# అపరాధ పరిశోధన

రు.7.50 | జూన్ '88

1-177

సప్లిమెంట్
174

-'PRABHAKAR'



అపరాధపరిశోధన అనుబంధం—174

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## బూతు బొమ్మ

రచన: వి. యస్. రావ్

## సిద్ధేంద్రస్వామి భక్తులు

రచన: వసుంధర

## గాంగ్ వార్

రచన: ఫణిబాబు

అపరాధ పరిశోధన సప్లిమెంట్—174
జూన్, 1988
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1,

# బూతు బొమ్మ

## ఎ.యస్. రావ్

వెండి తెరమీద కథ సాగుతోంది.

ట్రయాంగిల్ లవ్ స్టోరీకి సబ్ టైటిల్స్ రూపంలో తెరమీద ప్రత్యక్షమవుతున్న సంభాషణలు కథకి అద్భుతంగా ప్రాణం పోస్తున్నాయి.

హీరోయిన్ ఒక సీన్‌లో భర్త అసూయనీ, అనుమానాన్ని తట్టుకుంది. మరో సీన్‌లో తను ప్రేమించిన వ్యక్తి అనురాగాన్ని, ఇంకా ఆరిపోని అనురాగాన్ని రుచి చూసింది. భర్తను వదులుకోలేని, మోసం చేయలేని యువతిగా, మనసిచ్చిన ప్రియుడితో ఆనందంగా వుండలేని నిస్సహాయురాలిగా హీరోయిన్ అవార్డు నటన అందిస్తోంది....

కుషన్ కుర్చీలో అతను వెనక్కి వాలాడు. తెరమీద ఇలాంటి అసలు నటనను చూసి చాలా కాలమైంది. ఇవాళ రెండోసారి తను ఈ చిత్రం చూస్తున్నాడు. అయితే, కేవలం హీరోయిన్ అందిస్తున్న అవార్డు నటన

పోసమేశాడు. శెక్సీట్ సీన్లో అసూయతో, ఆగ్రహంతో నిండిన భర్త హీరోయిన్ సమక్షంలో హీరోని చితక బాదుతాడు. ఆ తరవాత సీనులో....

ఆ తరవాత సీనుకోసమే తను రెండోసారి సినిమా చూస్తున్నాడు. ఏవో ఆలోచనలు అతన్ని చుట్టు ముట్టాయి; తెరమీది నటన అతనికి అవుపించకుండా తెరిచివున్న అతని కళ్ళముందు ఏదో కనిపించని తెరను పట్టాయి ...

థియేటర్ విజిల్స్‌తో ఒక్కసారిగా దద్దరిల్లిపోయింది. అతని ఆలోచనలు చిందరవందరయ్యాయి. తెరమీద దృష్టిని కేంద్రీకరించాడతను. భర్త హీరోని చావగొడు తున్నాడు. హీరో నోట్లోంచి రక్తం కారుతోంది. ఓపిగ్గా తన్నులు తింటున్న హీరో, చివరికి తిరగబడ్డాడు. భర్తని ఉతకడం ప్రారంభించాడు. విజిల్స్. కేకలు. హీరోయిన్ ఇద్దర్నీ వారించే ప్రయత్నం చేసింది. ఇద్దరూ ఆమెని దూరంగా తోసేశారు.

ఫర్నిచర్ విరుగుతోంది. అద్దాలు పగులుతున్నాయి. ఇద్దరు వ్యక్తులు చావచితకగొట్టుకోడాన్ని, ప్రేక్షకులు బ్రహ్మాండంగా ఎంజాయ్ చేస్తున్నారు. కాదు; వాళ్ళలో అజ్ఞాతంగా వున్న హింసాప్రవృత్తి ఆ హింసని ఎంజాయ్ చేస్తోంది! అతను నిట్టూర్చాడు....

ఉన్నట్టుండి చాకిరేవు సీను అయిపోయింది. ఉన్న ట్టుండి హాల్లో నిశ్శబ్దం తాండవించింది. అతను కళ్ళు చిట్లించాడు.

తెరమీద మరో యుద్ధం ప్రారంభమైంది. స్త్రీ పురుష శరీరాలు క్లోజప్‌లో అవుపిస్తున్నాయి. మిడ్ లాంగ్ షాట్. లాంగ్ షాట్. మళ్ళీ క్లోజప్. ఇంకా,

క్లోజప్. అతను రెప్ప వేయకుండా చూస్తున్నాడు. ఇందాకా చావగొట్టుకుంటున్న ఇద్దర్ని చూస్తూ ప్రేక్షకులు తమలోని హింసాప్రవృత్తిని తృప్తిపరచుకున్నారు. ఇప్పుడు ఇద్దరి శృంగారాన్ని చూస్తూ తములోని లైంగిక వాంఛని పరోక్షంగా తృప్తిపరచుకుంటున్నారు!

మాతృభాషలో వచ్చే సినిమాల్లో బూతు పాటల వెనకా, బూతు డైలాగుల వెనకా, లంగోటీల వెనకా, బ్రాసియర్ల వెనకా దాగిన శృంగారంతో తృప్తిపడలేని ప్రేక్షకులంతా మాటలూ, పాటలూ, దుస్తులూ, వగైరాలతో దాచిపెట్టబడని డైరెక్టు శృంగారాన్ని చూడ్డానికి ఇంగ్లీషు సినిమాలకి ఎగబడతారు!

'సీను' అయిపోయింది. అతను లేచాడు. తల కిందికి వాల్చి సోదర ప్రేక్షకుల కాళ్ళని తప్పించుకుంటూ ఎగ్జిట్ వేపు కదలసాగేడు. పూర్తి సెక్సు చిత్రంగా అనౌన్సు చేయబడిన ఇంగ్లీషు చిత్రాన్ని పూర్తిగా చూడకుండా తమని డిస్టర్బు చేస్తూ వెళ్తున్న తెలుగు ప్రేక్షకుడైన తనని లోపల్లోపలే వెనకవరసల్లోని ప్రేక్షక సోదరులు తిట్టుకుంటున్నారని అతనికి తెలుసు!

కాస్సేపట్లో అతను డోర్ కి ఇవతల నిలబడ్డాడు. అతనిలో ఏవో ఆలోచనలు పుట్టి, పెరిగి, పెద్దవై పోతున్నాయి. సిగరెట్ ముట్టించాలన్న కోరికను చంపుకుంటూ అతను కదిలాడు. మెట్లు దిగాడు 'మేనేజర్' అని ఎర్రరంగులో రాయబడిన తలుపుముందు ఆగాడు. అతని కుడిచెయ్యి కోటుజేబులోకి దూరింది. ఎడంచెయ్యి తలుపుమీద బరువుగా ఆనింది. తలుపు లోపలికి జరిగింది.

అతని వెనక తలుపు చిన్న చప్పుడుతో మూసుకుంది. వెడల్పాటి టేబుల్ కి రెండువైపులా కూచుని, థియేటర్

లోపలి కొట్టువాడు ఫ్రీగా సప్లై చేసిన స్పెషల్ టీని సేవిస్తున్న ఇద్దరు వ్యక్తులు అతన్ని ప్రశ్నార్థకంగా చూస్తున్నారు. అతను వాళ్ళ వైపు నిర్లక్ష్యంగా చూశాడు.

"మేనేజర్ ...." అంటూ ఆగాడతను.

"నేనే. ఏం కావాలి?" లావుపాటి వ్యక్తి విసుగుని దాచుకోలేదు.

"ప్రొప్రయిటర్."

"మీరెవరు?"

"అడిషనల్ కమీషనర్, ఆర్.ఏ. డబ్ల్యూ: ఆనరరీ ఛైర్మన్, ఏ. ఏ. ఏ." తలుపుముందునుంచీ కదలకుండా అన్నాడతను.

మేనేజర్ కళ్ళు చిట్లించాడు. కనుబొమలు వంకీలు తిరిగాయి. రెండో వ్యక్తి నిర్లక్ష్యంగా టీ తాగుతున్నాడు.

"అంటే....?" మేనేజర్ ఆగాడు.

"అంటే....ఐమీన్, ఆర్. ఏ. డబ్ల్యూ అంటే రిసెర్చ్ అండ్ అనాలిసిస్ వింగ్, గవర్నమెంటాఫ్ ఇండియా. ఏ.ఏ.ఏ. అంటే ఆల్ అడియన్స్ అసోసియేషన్, ఇండియా."

"అంటే....?" మేనేజర్ మళ్ళా అన్నాడు.

అతను టేబుల్ దగ్గర జరిగాడు. రెండో వ్యక్తిని ఆదోలా చూశాడు. "హూ ఆర్ యూ?"

రెండో వ్యక్తి టీ కప్పు కింద పెట్టాడు. అతని మొహం కొద్దిగా జేవురించింది.

"నా మిత్రుడు...." మేనేజర్ కల్పించుకున్నాడు.

"దెన్, ఆస్క్ హిమ్ టూ గెట్ ఔట్. కాబిన్‌లో

కూచుని ఫ్రీగా సినిమా చూడమను?" అన్నాడతను మేనేజర్ వైపు తిరిగి.

"వాట్?!" మేనేజర్ గద్దించాడు.

"మేనేజర్, నేను నీతో, మీ ప్రొప్రయిటర్‌తో వ్యవహారం మాట్లాడాలి. వ్యవహారం మాట్లాడాలి అంటే నేను కూచోవాలి. కూచోవాలంటే నాకు కుర్చీ కావాలి. కుర్చీ కావాలంటే, ఇతను లేచి ఖాళీ చేయాలి! ఇది ఒకటి. రెండు: నేను నీతో అదే మాటలు మరొకరు వినడం నీకూ నీ థియేటర్‌కూ మంచిదికాదు..."

"నాన్ సెన్స్!" మేనేజర్ అరిచాడు. "హూ ది హెల్ ఆర్ యూ?"

"ఇందాకే చెప్పాను. నేను ఏమేం చేయగలనో చెప్తాను; కావాలంటే. ఈ దేశంలోని ఏ పదార్థాన్నైనా రిసర్చి చేయించి, అనలైజ్ చేయించే అధికారాన్ని ప్రభుత్వం నాకు అప్పగించింది. ఈ దేశంలోని సినిమాల్ని 'ఒకచూపు' చూసే అధికారాన్ని 'ఆల్ ఆడియన్స్ అసోసియేషన్' నాకు అప్పగించింది...."

"మాకూ తెలుసు. ఆర్ ఏ.డబ్ల్యూ పరిధిలోకి సినిమాలూ, థియేటర్లూ రావు!" మేనేజర్ తెలివిగా అన్నాడు.

అతను మెల్లిగా ముందుకి వంగాడు. రెండు చేతుల్ని టేబుల్ మీదున్న గ్లాస్‌లోంచీ అవుపిస్తున్న ఇద్దరు టాప్ లెస్ హాలీవుడ్ హీరోయిన్ల మీద బోర్లించాడు. మేనేజర్ కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు.

"మేనేజర్, నువ్వు తాగుతున్న టీనీ, నువ్వు పీలుస్తున్న గాలినీ, నీ థియేటర్లో ఇరుక్కుని ఉక్కిరిబిక్కిరవుతూ నీ ప్రేక్షక బలిపశువులు పీలుస్తున్న వేడి వేడి

గాలినీ, ఒక్క ముక్కలో చెప్పాలంటే నీ కాళ్ళ కిందున్న భూమికి, నీ నెత్తిమీదున్న ఆకాశానికీ మధ్య వున్న దేన్నైనా రిసెర్చిచేసి, అనలైజ్ చేసే అధికారం ఆర్ ఏ డబ్ల్యూకి వుంది!"

మేనేజర్ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. అతని చూపులు ఒకసారి యెదురుగా సాక్షిలా కూచున్న వ్యక్తి కేసి తిరిగాయి.

"ఇంతకీ మీరనేదేమిటి?" ఇంకా టేబుల్ మీదికి వంగేవున్న వ్యక్తిని విసుగు నటిస్తూ అడిగాడు మేనేజర్.

"నేను తలుచుకుంటే నీముందున్న టెలిఫోన్ ఉపయోగించి కలెక్టర్ ద్వారా నువ్వు కళ్ళుమూసి తెరిచేలోగా నీ థియేటర్ని సీల్ చేయించగలను. నేను అనేది ఇదే! తరవాత, నువ్విలాగే నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తే, నేను తలుచుకుంటాను. తెలుసుకో!"

మేనేజర్ ఎదురుగా కూచున్న వ్యక్తి మెల్లిగా పైకి లేచాడు. "సుందర్, నేను వెళ్తాను. నువ్వు పని చూసుకో" అంటూ గుమ్మంవైపు కదిలి, కాస్సేపట్లో అదృశ్యమయ్యాడతను.

అతను ఖాళీచేసిన కుర్చీని ఆక్రమించి, మేనేజర్ వైపు చిరునవ్వుతో చూశాడు.

"ఆల్ రైట్.... చెప్పండి. మీ పేరు?" మేనేజర్ సుందర్ ప్రశ్నించాడు.

అతను చిన్నగా నవ్వాడు. అతని కుడిచెయ్యి కోటు జేబులోకి మారి ఇవతలకి వచ్చింది. అరచేతిలో ఇరుక్కున్న ఐడెంటిటీ కార్డుని సుందర్ చూసేలా కాసేపు పట్టుకుని, మళ్ళీ జేబులోకి జారవిడిచాడతను.

ఇంకా ఎడం చేతిలోనే వున్న టీ కప్పుని తటాలున

గుర్తుకి తెచ్చుకున్న సుందర్ కప్పుని పెదాలకి ఆనించాడు. అప్రయత్నంగా అతని చెయ్యి కాలింగ్ బెల్ ని నొక్కింది. తలుపు తెరుచుకుంది. ఒక కుర్రాడి తల లోపలికి తొంగి చూసింది.

"కుల్ఫు, స్ట్రాంగ్ టీ పట్రా!" సుందర్ ఆజ్ఞాపించాడు. తలుపు మూసుకుంది.

"ఏమిటి సార్. ఢిల్లీ నుండి చాలాదూరం వచ్చేశారు!" సుందర్ తొ తరకంగా మాట్లాడ్డం ప్రారంభించాడు.

"ఢిల్లీ ఇప్పుడు దూరం కాదు!" నవ్వుతూ అన్నాడతను. "సుందర్, నువ్వు మేనేజ్ చేస్తున్న ఈ థియేటర్ మీద మాకు రిపోర్ట్సు వచ్చాయి...."

"ఎవరు........ఏ థియేటర్ వాడు రిపోర్టు చేశాడు?" సుందర్ ఆత్రంగా అడుక్కిగిలాడు.

"థియేటర్ వాడు కాదు; 'ఏఏఏ' రీజనల్ సెక్రటరీ!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"ఏఏఏ — ఈ ఊళ్ళో అది వున్నట్టులేదే!" సుందర్ అనుమానంగా అన్నాడు.

"మాకు అందిన రిపోర్టు నిజమే అని నేను స్వయంగా తెల్సుకున్నాను...." కమీషనర్ అతన్ని నిర్లక్ష్యంచేస్తూ అన్నాడు.

సుందర్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"ప్రస్తుతం మీరు ప్రదర్శిస్తున్న ఇంగ్లీషు చిత్రంలో అశ్లీల దృశ్యాలున్నాయి...."

తలుపు తెరుచుకుంది; మూసుకుంది. కుర్రాడు టీ కప్పుని టేబుల్ మీద పెట్టాడు. మళ్ళీ తలుపు తెరుచు కుంది; మూసుకుంది.

"టీ తీసుకోండి!" సుందర్ మర్యాద ఉట్టిపడేలా అన్నాడు,

కమీషనర్ టీ తీసుకున్నాడు. ఒక్క గుక్కలో తాగేసి కప్పుని కింద పెట్టేశాడు.

"అలాంటి సీన్లు ఈమధ్య వస్తున్న ఇంగ్లీష్ మూవీస్‌లో మామూలే సార్" సుందర్ నవ్వుతూ అన్నాడు.

కమీషనర్ చిన్నగా నవ్వాడు. "కొంతవరకూ నువ్వు కరెక్టే! అయితే ఆలాంటి దృశ్యాల్ని సెన్సార్ కత్తిరించేసి మరీ వదుల్తోంది "

"సెన్సార్ సంగతి మీకు తెలీందేముందిసార్! ఫిల్మ్ తెచ్చే ముందు మేం చూస్తామా, చేస్తామా? డిస్ట్రిబ్యూటర్ ఇస్తాడు; మేం వేస్తాం. వేశాకగానీ 'అది' వుందని మాకూ తెలీదుగా?" సుందర్ నవ్వాడు.

కమీషనర్ నవ్వలేదు. "ప్రస్తుతం మనదేశంలో థియేటర్లకి ప్రేక్షకుల్ని చీమల్లాగా ఆకర్షిస్తున్న ఎస్. ఆర్.ఐ. సినిమాల్ని స్పెషల్‌గా సెన్సార్ చేస్తున్నారు. కొన్ని వందల చిత్రాల్లో కొన్ని పదుల చిత్రాల్నే సెన్సార్ అంగీకరిస్తోంది. అంగీకరించిన వాటిలో అభ్యంతరకరమైన దృశ్యాల్ని కోసిపారేసి సర్టిఫై చేస్తోంది...."

"అలాగని అందరం అనుకుంటున్నాం లెండి. అయితే...."

"ఇప్పుడు నీ థియేటర్లో ఆడుతున్న చిత్రాన్ని తీసుకుందాం. ఇందులో మూడోరీలు ప్రారంభమయ్యాక, ఒక అశ్లీలదృశ్యం వుంది. ఢిల్లీలో ఈ చిత్రాన్ని నేను చూశాను. అప్పుడు ఈ దృశ్యంలేదు. ఈ చిత్రంలో సెన్సార్ ఏయే భాగాల్ని కత్తిరించిందో కూడా నాకు తెలుసు...."

"అయితే, ఆ కత్తిరించిన భాగాల్ని మేం మళ్ళీ అతికించి ఆడుతున్నామంటారా?" సుందర్ అడ్డు తగిలాడు.

"లేదు."

"అయితే మీరనేదేమిటి? నాకు అర్థంకావడంలేదు."

"మొదట్లో నాక్కూడా అర్థంకాలేదు!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు. సుందర్ అతన్ని అదోలా చూశాడు.

"అసలు కథలోవున్న పాత్రలు వేరు. ఆ సీనులోవున్న పాత్రలు వేరు!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"ఏమిటో....అయోమయంగా మాట్లాడుతున్నారు." సుందర్ విసుగ్గా అన్నాడు.

"ఇప్పుడు ఇక్కడ ప్రదర్శింపబడుతున్న చిత్రం ఒరిజినల్ గా ట్రయాంగిల్ లవ్ స్టోరీ. ఈ ఫ్రెంచ్ చిత్రంలో ఒరిజినల్ గా అశ్లీల దృశ్యాలున్నాయి వాట్ని సెన్సార్ కత్తిరించేసింది. సీదాసాదా ఇంగ్లీషుసినిమాల్ని ఇవాళా రేపూ నీ తెలుగు ప్రేక్షకులు పెద్దగా పట్టించుకోడంలేదు. అంచేత మరెక్కడో తయారైన అశ్లీలం బిట్స్ ని, చిత్రంలో ఎక్కడో ఒకచోట అతికించి నీలాంటి తెలివైనవాళ్ళ ప్రేక్షకుల్ని ఆకర్షిస్తారు...."

"మేం అలాంటి వెధవపని చెయ్యం! అలాంటి తెలివైనపని చేయొచ్చని మీరు చెప్తుంటే తెలుస్తోంది నాకు!" సుందర్ అడ్డుతగిలాడు.

కమీషనర్ చిన్నగా నవ్వాడు. "ఈ చిత్రంలో హీరో హీరోయిన్లు కాకుండా మరో జంట తెరమీద శృంగారం ప్రదర్శిస్తున్నారు. నువ్వు ఆడదాన్ని, మగాడ్ని నగ్నంగా కసరత్తు సీనులో చూపించినంతకాలం ప్రేక్షకులు, వాళ్ళు హీరో హీరోయిన్లా కాదా అని ఆలోచించరు. వాళ్ళకి కావాల్సింది బ్లూబిట్. అందులో

ఎవరున్నా వాళ్ళకి ఒకటే!"

"కమీషనర్ గారూ...."

"అడ్డురాకు. ప్రస్తుత - బూతుసీన్‌లో వున్న ఆడదీ, మగాడూ—వీళ్ళిద్దరి మొహాలే కాకుండా, బ్యాక్‌గ్రౌండ్, లైటింగ్ ఎఫెక్ట్, కథలో కంటిన్యుటీ—ఇవన్నీ కూడా అశ్లీలదృశ్యం అసల కథలోది కాదు అని చెప్తున్నాయి."

"దానికి నన్నేం చేయమంటారు? డిస్ట్రిబ్యూటర్ సప్లై చేసిన చిత్రాన్ని మేం తిప్పుతాం. అదంతా మాకు తెలీదు!" సుందర్ అడ్డు తగిలాడు.

"నీకు—అంటే మీకు; అంటే ప్రొప్రయిటర్‌కీ నీకూ—తెలుసని నాకు తెలుసు!" కమీషనర్ సగర్వంగా అన్నాడు. "సుందర్, ఆ అశ్లీలం ముక్క—ని నువ్వూ, నీ ప్రొప్రయిటరూ తయారుచేయలేదనీ నాకు తెలుసు...."

"తెలిసీ మీరు...."

"ఫిల్మ్ డిస్ట్రిబ్యూటర్‌కి ఈ 'అతుకు' గురించి ఏమీ తెలీదనికూడా నాకు తెలుసు. అయితే, నాకు తెలీని విషయం ఒకటుంది. అది తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తున్నా...." కమీషనర్ ఆగి, సాభిప్రాయంగా చూశాడు.

"ఏమిటి?" అర్థం అయ్యీకాని పరిస్థితిలో వున్న సుందర్ అడిగాడు.

"సోర్స్ ఆఫ్ దట్ బ్లూ బిట్!" కమీషనర్ అతని కళ్ళల్లోకే చూస్తూ అన్నాడు. "అశ్లీలదృశ్యం ముక్క—జన్మస్థానం!"

సుందర్ నిట్టూర్చాడు. "మాకు తెలీదు ”

"తెలీకపోడం నీ దురదృష్టం!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"మీ అర్థం?"

"నా అర్థం నీకు అవసరం తెచ్చిపెడుతుంది! రెండు నిమిషాల్లో నేను టెలిఫోన్ రిసీవర్ అందుకుంటాను. ఆ తరవాత కొన్ని నిమిషాల్లో నువ్వు పోలీసు రక్షణలోకి వెళ్ళిపోతావ్. నీ థియేటర్ మూతపడుతుంది!"

సుందర్ కళ్ళల్లో కంగారు ప్రత్యక్షమైంది. "మీ లాగే నేనూ ఉద్యోగిని. మధ్య నన్నెందుకు అరెస్టు చేస్తారు?"

"మీ ప్రొప్రయిటర్ లేడుగా!"

సుందర్ నవ్వుతున్న కమీషనర్ వైపు అదోలా చూశాడు. మెల్లిగా పైకిలేచాడు.

"ఒక్క క్షణం.... మా ప్రొప్రయిటర్ గార్ని పిలిపిస్తాను...."

అనుమానిస్తూ తనవేపు యేదో చెప్పమన్నట్టు చూస్తున్న సుందర్ని కమీషనర్ చిరునవ్వుతో చూశాడు. "మంచి ఆలోచన!"

సుందర్ ఆదరాబాదరా కదిలి, తలుపు తెరుచుకుని, మూసుకుని అదృశ్యమయ్యాడు. ప్రొప్రయిటర్ని పిలవడానికి టెలిఫోన్ ఉపయోగించకుండా మేనేజర్ సుందర్ స్వయంగా ఎందుకు, ఎక్కడికి వెళ్ళాడు అని ఆలోచిస్తూ కమీషనర్ సిగరెట్ వెలిగించాడు....

కాస్సేపట్లో తలుపు తెరుచుకుంది; మూసుకుంది. లోపలికి వస్తున్న ఇద్దర్ని కమీషనర్ ఆశ్చర్యంతో చూశాడు. మేనేజర్ ప్రొప్రయిటర్ కోసం ఫోనెందుకు ఉపయోగించలేదో అతనికి అర్థమైంది. ఇందాకా మేనేజర్ స్నేహితుడి అవతారంలో తను కూచున్న కుర్చీలో కూచున్నవ్యక్తి!—ప్రొప్రయిటర్—అదోరకం

భయభక్తులో, కంగారుతో టేబుల్ దగ్గరగా నడిచాడు.

"కమీషనర్ గారూ, ఎందుకొచ్చిన గొడవ అని ఇందాకా మా యజమానిగార్ని నా స్నేహితుడన్నాను.. క్షమించాలి...." సుందర్ పళ్ళికిలిస్తూ సిగ్గుపడ్డాడు.

కమీషనర్ నవ్వలేదు. కళ్ళు చిట్లిస్తూ చూశాడు.

"కమీషనర్ గారూ, అయామ్ పరమానందం...." మేనేజర్ కుర్చీలో కూచుంటూ అన్నాడు ప్రొప్రయిటర్. "కమీషనర్లూ, కలెక్టర్లూ, వాళ్ళూ వీళ్ళూ యేదో సాకుతో మమ్మల్ని ఇరకాటంలో పెడుతూవుంటారు! అందుకని...."

"నెవర్ మైండ్!" కమీషనర్ అతనికి అడ్డుతగిలాడు. "మీరు పొరపాటు చేశారు. నేను మామూళ్ళకి వచ్చే మామూలు ఆఫీసర్నికాను!"

"అఫ్‌కోర్సు.... సుందర్ చెప్పాడు. ఆ అశ్లీలం ముక్కలగురించి మాకేం తెలీదు.... మేం...."

"తెలీకపోతే, 'పూర్తి సెక్సుచిత్రం' అంటూ పబ్లిసిటీ ఎట్లా ఇచ్చారు?" కమీషనర్ ప్రశ్న తూటాలున అతనికి అడ్డుతగిలింది.

"ఇంగ్లీషు చిత్రాలంటే అది మామూలే.... కలెక్షన్స కోసం అలా రాస్తాం. ఈ క్లాబ్ పద్ధతివచ్చాక ఎలాగోలా గిట్టుబాటు చేసుకోవాలి చూడండి...."

"ఆల్ రైట్! అభ్యంతరకరమైన దృశ్యాన్ని మీరు ప్రదర్శిస్తున్నారు. నేను చట్టరీత్యా చర్య తీసుకోవాల్సి ఉంటుంది. ఆ చర్య యేమిటో మీకు తెలిసేవుండాలి. థియేటరు మూత. మిమ్మల్ని కస్టడీ ..."

"అంతదాకా లాగకండిసార్! ప్రజల అభిరుచులు మారుతున్నాయ్. దశాబ్దం కిందట వచ్చిన మన సినిమా

లకీ, ఇవాళ వస్తున్న వాటికీ లేదా మీరు గమనించే వుంటారు! బూతుమాటలూ, పాటలూ, మగాడి సెక్సుని ఉద్రేకపరిచే విధంగా ఒళ్ళంతా గుల్ల చేసుకునే డాన్సులూ వగైరాలు లేకపోతే సినిమాని తట్టుకోలేని స్థితికి ప్రేక్షకులు చేరుకున్నారు...."

"యూ ఆర్ రాంగ్! ప్రేక్షకులు ఆ స్థితికి చేర్చబడ్డారు!" కమీషనర్ అడ్డుతగిలాడు.

"బూతు లేకపోతే చిత్రం పురిటిలోనే సంధికొట్టి పోతుందని నిర్మాతలూ, దర్శకులూ హడలిచస్తున్నారు. ఆ భయం సహజంగా మమ్మల్నీ పట్టుకుంది!" ప్రొప్రయిటర్ పరమానందం నవ్వుతూ ఆగి సుందర్ వైపు సాభిప్రాయంగా చూశాడు. "సుందర్, కమీషనర్ గారు ఏం తీసుకుంటారో కనుక్కో; అరేంజ్ చెయ్!"

సుందర్ ఆదారాబాదరా కదలబోయాడు. కమీషనర్ కంఠం అతన్ని ఆటకాయించింది.

"మిస్టర్ పరమానందం, నేను తీసుకోబోయేది బైట దొరకదు; మీ దగ్గరే దొరుకుతుంది!"

పరమానంద్ అర్థమైనట్టు తేలిగ్గా నవ్వాడు. "చెప్పండి, సార్. ఎంత?"

కమీషనర్ ఆరిపోయిన సిగరెట్‌ని యాష్‌ట్రేలో పడేశాడు. కొత్తది వెలిగించి, సావధానంగా పొగ పీల్చాడు; అప్పటికే కంగారుని చిరునవ్వుగా మార్చుకున్న పరమానందం, సుందర్ అతన్నే చూస్తున్నారు. అతను పరమానంద్ కళ్ళల్లోకి తదేకంగా చూశాడు.

"ఎంత కాదు; 'ఏమిటి' అని అడగండి!"

పరమానంద్ అర్థంకానట్టు చూశాడు. కాష్ తీసుకోదం ఇష్టంలేని కమీషనర్ ఏదైనా వస్తువు ఆశిస్తూ

న్నాడా? కలరుటీవీ? నగ? లేకపోతే....

"ఏమిటో చెప్పండి!" పరమానందం ఉషారుగా అన్నాడు.

"ప్రదర్శించే ప్రతి ఇంగ్లీషు సినిమాకీ మీరు బ్లూ మసాలా తగిలిస్తున్నారు. ఆ 'బూతుముక్కలు' మీకు ఎక్కణ్నుంచీ అందుతున్నాయ్?"

పరమానందం, సుందర్ — ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. పరమానంద్ క్షణంలో సర్దుకున్నాడు.

"అది.... మాకేం తెలుసు? డిస్ట్రిబ్యూటర్ ...."

"షటప్!" కమీషనర్ హఠాత్తుగా హుంకరించాడు. "ఆ చెత్తంతా వినడానికి నాకు టైంలేదు. పైగా అదంతా ఎప్పుడో విన్నాను. సిల్వర్ స్క్రీన్ డిస్ట్రిబ్యూటర్సుని నేను కలుసుకున్నాను. వాళ్ళు మీకు అందించిన డబ్బాల్లో ఈ చెత్త లేదు!"

పరమానందం దిక్కుతోచని వాడిలా సుందర్ని చూశాడు.

"సార్...ఆ గొడవలన్నీ దేనికిలెండి... ఇకనుంచీ జాగ్రత్తగా వ్యవహరిస్తాం.. రేటు చెప్తే..." సుందర్ పళ్ళికిలిస్తూ నసిగాడు.

కమీషనర్ సిగరెట్ పొగని అతనివైపు ఊదుతూ తీక్షణంగా చూశాడు. "నా రేటు చెప్తే కళ్ళుతిరిగి, కాళ్ళు వొణికి నేలమీద కూలిపోతావ్!"

సుందర్ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. అతని చూపులు అయోమయంగా తన యజమానివేపు తిరిగాయి.

"ఆ బూతు ముక్కలు మీకు సప్లై చేస్తోందెవరు?" కమీషనర్ కంఠం ఖంగుమంది.

పరమానందం ఖంగుతిన్నట్టు చూశాడు. "మా కెవరో

లేనిపోనివి చెప్పినట్టున్నారు. అసలు ఫిల్మ్‌తోకాటే ఆ రీల్సు వచ్చివుంటాయి. మా మాట నమ్మండి!"

కమీషనర్ తటాలున పైకిలేచాడు. చిరునవ్వు నవ్వుతూ పరమానందాన్ని చూశాడు. "మీ ఫోన్ ఉపయోగించవచ్చా?"

"బై ఆల్ మీన్స్!" అంటూ పరమానందం ఆదరాబాదరా ఫోన్ని అతనివైపు తోశాడు.

చిరునవ్వు నవ్వుతూ కమీషనరు ఎర్రటి రిసీవర్ని ఎడం చేత్తో అందుకున్నాడు. ఉంగరం వేలితో నిర్లక్ష్యంగా డయల్ చేయసాగేడు. అతని వేళ్ళమధ్య ఇరుక్కున్న సిగరెట్ ఎర్రగా, కనిపించని గీతల్ని గీస్తూ గుండ్రంగా తిరుగుతోంది.

"దిసీజ్ శివానంద్, అడిషనల్ కమీషనర్, సి.బి.ఐ. కనెక్ట్ మీ టూ ది ఎస్.పి. ప్లీస్!"

పరమానంద్, సుందర్ కంగారుగా చూశారు. పరమానంద్ ఆదరాబాదరా పైకిలేచాడు. ఇంకా చిరునవ్వుతోనే చూస్తున్న కమీషనర్ వేపు ఆగ్రహంతో చూశాడు. అతని పెదవులు తడిఆరిపోతూ అదిరాయి.

"కమీషనర్ గారూ... ఫోన్ పెట్టెయ్యండి! ప్లీస్! మీతో మాట్లాడాలి!"

"నాతో మాట్లాడే విజ్ఞత మీలో లేదని రుజువు చేశారు. ముందట ఎస్.పి.తో, తరవాత కలెక్టర్‌తో మాట్లాడండి!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"నో! వద్దు! మీరే దీన్ని ఫైనలైజ్ చేయండి! దయచేసి..."

"అడిగింది ఇస్తేకానీ, ఇది ఫైనలైజ్ అవదు!"

సిగరెట్ పొగ ఊదుతూ కమీషనరు స్పష్టంగా అన్నాడు.

"ఇస్తాం. రిసీవరు పెట్టేయండి!" పరమానందం ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

ఒక్క కదలికలో రిసీవర్ని క్రెడిల్ మీదికీ, తన శరీరాన్ని కుర్చీలోకీ సరఫరా చేశాడు కమీషనరు. చెరగని చిరునవ్వుతో ఇద్దర్నీ కలయజూశాడు. పరమానంద్ కుర్చీలో కూలబడ్డాడు.

"షూట్!" కమీషనరు నవ్వుతూ అన్నాడు.

"ఈసారి అడగండి...మీకు...ఏంకావాలి...?"

"మీ ఇంగ్లీషు సినిమాలకి బూతుముక్కలు సప్లై చేస్తున్న వ్యక్తి పేరూ, ఊరూ....అతనికి మీరిచ్చే రేటూ—అతని పూర్తి జాతకం...వగైరా!"

"నన్ను నమ్మండి! అన్ని వివరాలు మాకు తెలీవు."

"మీకు తెలిసినవన్నీ వివరంగా చెప్పండి!" కమీషనరు నవ్వుతూ అన్నాడు.

పరమానందం చిన్నగా దగ్గాడు. "చెప్తే...మమ్మల్ని వొదిలేస్తారా?"

కమీషనరు చిన్నగా నవ్వాడు.

"మిమ్మల్ని ఇంకా పట్టుకోలేదుగా!" పరమానందం నవ్వే ప్రయత్నంలో దారుణంగా వోడిపోయాడు.

"అదికాదు...మా గురించి ఎవరికీ ముఖ్యంగా అతనికి చెప్పరుగా?"

"మిస్టర్ పరమానందం, తన ఇన్ఫార్మరుని సి.బి.ఐ—మరోవ్యక్తితో పెళ్ళయిన ఆడది గతంలోని తన ప్రేమ వ్యవహారాన్ని దాచినట్టుగా—దాచి వుంచుతుంది!"

"సార్...దీని మూలంగా మాకేం ప్రమాదం రాదుగా.

అసలే క్లబ్ మా లాభాల్ని కొరుక్కుతినేస్తోంది."

"రాదు. అయితే అశ్లీలదృశ్యాల్ని అతికించే అభ్యంతరకరమైన అలవాటుని మీరు మానేయాలి. ముఖ్యంగా జరుగుతున్న షో అయిపోయాక, ఆ బిట్‌ని మీరు కత్తిరించి, నాకు సరెండరు చేయాలి. తరవాత మీరు కంచె దాటకూడదు. ఈ క్షణంనుంచీ మీ థియేటరు మా మైక్రోస్కోప్ కిందవుంటుంది. వందలాది ప్రేక్షకుల్లో మా వ్యక్తి ఎవడో మీరు చచ్చినా కనుక్కోలేరు."

"సార్..."

"అసలు సినిమానుంచీ, అతకుల్ని విడదీసి చూసే నైపుణ్యం మా వాళ్ళందరికీ వుంది! మరో సంగతి మీకు చెప్తాను. ఇల్లంతా వ్యాపించిన పొగని చెదరగొట్టడం కన్నా, పుట్టుక స్థానంలోనే పొగని నాశనం చేయడం తెలివైనపని. థియేటర్ల వెంట పరుగెట్టడంకన్నా, అశ్లీల దృశ్యాలు పుట్టుకస్థానాన్ని మూతవేయించడం శక్తివంతమైన రెమెడీ అని నేను భావిస్తున్నాను. అందుకే తాత్కాలికమైనా కూడా మీ థియేటర్ని వదిలేస్తున్నా. అయితే ఆ వదిలేయడం మీరిచ్చే ఇన్‌ఫర్మేషన్‌లోని యథార్థం మీదా, మీ నిజాయితీ మీదా ఆధారపడి వుంటుంది."

పరమానందం మొహంమీది కంగారు మాయం కాసాగింది. "సార్..."

"తప్పుడు ఇన్‌ఫర్మేషన్ ఇచ్చారనుకోండి. నేను తిరిగొస్తాను. అయితే ఒంటరిగా రాదు. కలెక్టర్, ఎస్.పీ. వగైరా ఉన్నతాధికారులు నాతో వుంటారు! రైట్. ప్రారంభించండి!"

పరమానందం విచారంతో ప్రారంభించాడు.

# 2

మూసిన తలుపుపక్కనేవున్న కాలింగ్ బెల్ నొక్కబోతూ అతను ఆగాడు.

మనసు మార్చుకుని కోటుజేబులోంచి బ్రయర్ పైప్ ఇవతలికి తీశాడు. నిర్మానుష్యంగావున్న నడవని సాలోచనగా చూస్తూ పైప్ గిన్నెలో పొగాకు కూరాడు. పొగాకు కవర్ని కోటుజేబులోకి వదిలిన అతని కుడిచెయ్యి అగ్గిపెట్టెతో ఇవతలికి వచ్చింది. అతని ఆలోచన పూర్తయ్యింది. అగ్గిపుల్ల వెలిగింది. ఘాటుగా పొగపీల్చి అతను హాండిల్ని తిప్పుతూ తలుపుని లోపలికి తోశాడు.

లోపలికి జొరబడిన అతని వెనకే తలుపు మూసుకుంది. ఎదురుగా టేబుల్కి అటువైపున కూచున్న వ్యక్తి మొహంమీద అతని చూపులు కేంద్రీకరించబడ్డాయి.

పల్చగా, పొడుగ్గా అవుపిస్తున్న మీసాలు లేని మొహం. ఫాషన్తోబాటు వెళ్ళిపోకుండా ఇంకా అతన్నే అంటిపెట్టుకునేవున్న హిప్పీజుట్టు భుజాలదాకా వేళ్ళాడుతోంది. గుబురుగా, అల్లిబిల్లిగావున్న కనుబొమలకింద అనుమానంతో చూస్తున్న కళ్ళు. పొగచూరిన పెదవులు.

“ఎవరు? బెల్ నొక్కకుండా రాకూడదని తెలీదా?” కోపాన్నీ, విసుగునీ సమపాళ్ళలో రంగరించింది అతని కంఠం. గుమ్మం ముందు ఎత్తుగా ఫుల్సూటులో నిలబడ్డ అపరిచిత వ్యక్తిని అతను పరీక్షగా చూస్తున్నాడు. వంకీల జుట్టు. పెదంకిందికి కొద్దిగా జారిన వెడల్పాటి మీసాలు.

చిరునవ్వులో విచ్చుకుంటున్న పెదాల మధ్య పైప్ ఇరికించి. అతను గిరుక్కున వెనక్కి తిరిగాడు. తలుపు లాగి, అవతలికి జరిగాడు. తలుపు మూసుకుంది. నవ్వు

కుంటూ అతను కాలింగ్ బెల్ బటన్ మీదున్న చిన్నగంట మీద వేలితో నొక్కాడు. తలుపు తోస్తూ లోపల దూరాడు.

కుర్చీలో కూచున్న వ్యక్తి అర్థంకానట్టు చూస్తున్నాడు.

"సారీ. బెల్ నొక్కి, అనౌన్స్ చేసి గదిలోకి ప్రవేశించడం పాతపద్ధతి. నేను సంచరించే దేశాల్లో అలవాట్లూ, ఆచారాలూ మారిపోయాయి...."

"మీరు...."

"మిమ్మల్ని అఫెండ్ చేయడం ఎందుకని, మర్యాదగా అవతలికెళ్ళి, మర్యాదగా బెల్ నొక్కి, మర్యాదగా లోపలికొచ్చాను!" కొత్తవ్యక్తి నవ్వుతూ, ఇందాకా అతను కత్తిరించడానికి ప్రయత్నించిన తన మాటని పూర్తిచేశాడు. కూచున్నవ్యక్తి కళ్ళలో నవ్వూ, ఆశ్చర్యం కలిసి ప్రత్యక్షమయ్యాయి.

"అయితే మీరు...."

"అయామ్ డాక్టర్ దండేకర్, మిస్టర్ కాశీనాథ్."

కాశీనాథ్ అదరాబాదరా లేచి నించున్నాడు. లూజు చొక్కాని పాంటులోకి దోపుకున్నా కూడా అతను సన్నగా నవ్వుపిస్తున్నాడు.

"వెల్‌కమ్!" అన్నాడు టేబుల్ మీంచీ దూరంగా జరుగుతూ.

అప్పటికే అతన్ని సమీపించిన దండేకర్, ముందుకి సాగిన అతని చేతిని పట్టుకుని, వదిలేశాడు.

"క్షమించాలి. మీరు పదకొండున్నరకి వస్తానన్నారు ఫోనులో. గంటముందుగా వచ్చాను. అందుకే ఊహించలేక పోయాను! అన్నట్టు ఫారిన్ కంట్రీస్‌లో గదిలో

దూరేముందు చెల్నొక్క ఆచారం మారిపోయినట్టు నేను అనుకోలేదు!" కాశీనాథ్ నవ్వుతూ అన్నాడు.
"ప్లీస్ సిడౌన్!"

దండేకర్ కూచున్నాడు. "ఫారిన్ ఆచారాలూ, ఫాషన్లూ రాకెట్ స్పీడులో మారిపోతూ వుంటాయి. అక్కడ జన్మించిన ఫేడెడ్ జీన్స్ ఇండియాకి రావడానికి పదేళ్ళు పట్టింది!"

కాశీనాథ్ అరక్షణమైనట్టు నవ్వాడు. "పొద్దుట మీరు ఫోన్ చేస్తూంటే ఆశ్చర్యపోయాను. అనుమానించును కూడా! నా పేరూ, టెలిఫోన్ నంబరూ ఎలా సంపాయించారు? ఇక్కడ మీ కెవరు చెప్పారు?"

"మిస్టర్ కాశీనాథ్, ఇక్కడ నాకెవరూ చెప్పలేదు. 'అక్కడే' మీ గురించి కనుక్కున్నాను...."

"ఈజిట్ సో? ఎలా? నేను నమ్మలేను...." కాశీనాథ్ ఆశ్చర్యంగా అన్నాడు.

దండేకర్ సగర్వంగా నవ్వాడు. "ఈ భూగోళం మీద ఏ అక్షాంశంలో, ఏ రేఖాంశంలో ఏ డిగ్రీమీద ఎవరున్నారో నేను అతిసులువుగా కనుక్కోగలను!"

"పూరా? ఎలా?"

"చెప్తాను, వినండి; మరిచిపోండి: మాఫియాతో నాకు మెయిల్ కనెక్షన్సనాయి!"

"ఈజిట్?" కాశీనాథ్ ఆశ్చర్యంతో అరిచాడు.

దండేకర్ నవ్వుతూ తలాడించాడు.

"డాక్టర్ దండేకర్, మీరు....మీర్ర త్రివైద్యమా?" కాశీనాథ్ ప్రశ్నించాడు.

"కాదు. సెక్స్ అండ్ సైకాలజీలో రిసెర్చ్ చేశాను. డాక్టరేట్ సంపాయించాను. నాది మెడికల్ ఫీల్డు

అయితే, మీ దగ్గరికి వచ్చేవాణ్ని కాను!" దండేకర్ నవ్వుతూ అన్నాడు.

"చెప్పండి. ఏం పనిమీద వచ్చారు? ఎక్కణ్నుంచీ వచ్చారు?" కాశీనాథ్ అడిగాడు.

"రెండేళ్ళుగా పారిస్‌లోవుంటున్నా అయితే, అమెరికా, ఇంగ్లండ్, స్పెయిన్, జపాన్ వగైరా దేశాల్లో నాకు చాలా దగ్గర సంబంధాలున్నాయి. నా వృత్తి నన్ను ఎన్నో దేశాలకి తిరుముతూవుంది...."

"మీ వృత్తి?" కాశీనాథ్ అడ్డుతగిలాడు.

"సెక్స్ అండ్ సైకాలజీ!" దండేకర్ నవ్వుతూ అన్నాడు.

"అర్థంకాలేదు; విడమరచి చెప్పండి...."

"లైంగిక జీవనం, మనిషి—ఈ విషయం నాకు ఎంతో నచ్చింది. ఎంతో అధ్యయనం చేశాను. ఫ్రాయిడ్ హేవలాక్ ఎల్లిస్. జంగ్. యాడ్లర్. పద్మశ్రీ. కొక్కోకుడు. ముఖ్యంగా వాత్స్యాయనుడు. ఇంకా ఎందరో. ఎంత చదివినా, అధ్యయనం చేసినా అధ్యయనం చేయాల్సిందీ, అర్థం చేసుకోవాల్సిందీ ఎంతో వుందనిపించింది. ఇంకా అధ్యయనం చేయాల్సిన గ్రంథాలు; సజీవ గ్రంథాలున్నట్టు కనిపెట్టాను...."

"సజీవగ్రంథాలా?" కాశీనాథ్ ఆశ్చర్యంతో అడ్డుతగిలాడు.

"మనుషులు." దండేకర్ నవ్వుతూ జవాబిచ్చాడు. ప్రముఖ భారతీయ లైంగిక శాస్త్రవేత్త వాత్స్యాయన మహర్షి 'కామసూత్రాల' ప్రాతిపదికగా, నేను రూపొందించుకున్న ఒక విశిష్టమైన పద్ధతిలో సజీవగ్రంథాల్ని అధ్యయనం చేస్తూ, నేను జన్మించిన భారతదేశానికి

వచ్చాను. నాలో మొలకలెత్తి వృక్షాలుగా ఎదిగిన ఎన్నో సందేహాలకి సరైన సమాధానాలు ఇక్కడే చిక్కుతా యన్న నమ్మకం నాకు కలిగింది...."

"ఇక్కడా? అంటే?" కాశీనాథ్ అయోమయంగా అడిగాడు.

"ఇక్కడ అంటే—మీ ఆఫీసుగదిలో కాదు; ఇండియాలో!" దండేకర్ నవ్వుతూ అన్నాడు.

"ఐసీ...." ఇండియాలో చిక్కే సమాధానాల కోసం వెతుక్కోకుండా తన దగ్గిరికి దండేకర్ ఎందుకు వచ్చాడో అంతుపట్టని కాశీనాథ్ పొడిగా అన్నాడు.

"యూసీ మిస్టర్ కాశీనాథ్, ఇతర దేశాల్లో మనుషులు చెప్పలేని ఎన్నో సమాధానాల్ని స్త్రీ పురుష సంబంధంలోని రహస్యాల్ని ఇండియాలో నోరులేని శిల్పాలు చెపుతున్నాయి! నేను ఇక్కడికి, ఐమీన్—ఇండియాకి రావడానికి శిల్పాలు కూడా ఒక ముఖ్య కారణం...." దండేకర్ ఆగి పైప్‌లోని బూడిదని యాష్‌ట్రేలో విదిల్చడం ప్రారంభించాడు.

"డాక్టరు దండేకర్....అయినా మీరు నన్నెందుకు కల్సుకున్నారో అర్థంకావడంలేదు....ముఖ్యమైన బిజినెస్ అన్నారు పొద్దుట ఫోన్‌లో...." కాశీనాథ్ సస్పెన్స్ భరించలేక అడిగాడు.

"వస్తున్నా: ముఖ్యంగా కోణార్క్ దేవాలయం పద్యశిల్పాలు నన్ను అయస్కాంతాల్లా ఆకర్షించాయి. మిస్టర్ కాశీనాథ్. మీకు క్రిస్టినీ కీలర్ గురువు డాక్టరు వార్డు గుర్తున్నాడా?"

"అఫ్‌కోర్సు....అతనుఆత్మహత్య చేసుకున్నాడుగా?" కాశీనాథ్ అన్నాడు.

"డాక్టరు వార్డు లోనాయక్ శిల్పాల్ని చూసి అదిరిపోయాడు. ఆయన మెదడుని కప్పిన ఎన్నో పొరల్ని ఆ శిల్పాలు చీల్చిపారేశాయి. ఆ శిల్పాలనుండీ తను కనుక్కొందేమిటో లోకానికి చెప్పకుండానే ఆయన లోకం వదిలి వెళ్ళిపోయాడు. అందుకు రాజకీయాలు కారణం అనుకోండి.... అది వేరే సంగతి ..."

అసహనంగా ముందుకి వంగుతున్న కాశీనాథ్‌ని చూస్తూ దండేకర్ ఆపేశాడు.

"డాక్టర్ దండేకర్, ముందు నా దగ్గరికి మీరెందుకు వచ్చారో చెప్పండి!"

దండేకర్ నవ్వుతూ తెల్లటి పళ్ళని అతనికి చూపించాడు. "మనిషి మన స్తత్వాన్నీ, శరీరాన్నీ, పెర్సనీత్యూణ్నంగా పరిశోధించిన నేను ఆ ఫలితాల్ని 'మనిషి'కి అందజేయాలని నిర్ణయించుకున్నాను. ఆ కార్యంలో మీ సహకారం నాకు కావాలి...."

కథ అర్థమైపోయిన కాశీనాథ్ చప్పుడు చేస్తూ నిట్టూర్చాడు. టేబుల్ మీదున్న పాకెట్ లోంచీ తీసి, సిగరెట్ వెలిగించాడు. పొగ ఊది చిరునవ్వు నవ్వాడు. "యూ హావ్ కమ్ టూ ఏ రాంగ్ పర్సన్! డాక్టర్ దండేకర్. నేను పుస్తకాల వ్యాపారంలో లేను! కాశీనాథ్ అండ్ కాశీనాథ్ పేరుతో పబ్లిషర్స్ న్యూ ఢిల్లీలో వున్నారు. మీరు పొరపాటుగా ఈ కాశీనాథ్ దగ్గరకొచ్చారు...."

"యూ ఆర్ రాంగ్!" దండేకర్ అడ్డుతగిలాడు. "మీరు మీరని తెలుసుకునే వచ్చాను. నేను రాయబోయే పుస్తకాల్ని పబ్లిష్ చేయమని మిమ్మల్ని అడగడానికి రాలేదు. నేను నోరు తెరిచి అడిగితే చాలు

అక్స్‌ఫర్డ్, మాక్మిలన్, రీడర్స్ డైజస్టు వగైరా కంపెనీ లన్నీ పోటీపడి నా పుస్తకాల్ని వేస్తారు. నా ఉద్దేశం అదికాదు...."

"ఏమిటి మీ ఉద్దేశం?"

"నా పరిశోధనల ఫలితాల్ని చదువుతున్న వాళ్ళకే పరిమితం చేయడం నాకిష్టంలేదు. నా పరిశోధనల ఫలితం కళ్ళున్న ప్రతి మనిషికీ కనిపించాలి!"

"అంటే....?"

"అంటే ఇండియా దేవాలయాల గోడలమీదున్న అపురూప శిల్పాల్నీ, వాత్స్యాయన కామసూత్రాల్నీ ఆధారంగా చేసుకుని నేను ఎనభై నాలుగు రకాల చలన చిత్రాల్ని నిర్మించాలనుకుంటున్నాను...."

"ఎనభై నాలుగా?" కాశీనాథ్ నోరు వెళ్ళబెట్టాడు.

"యస్. ఎనభై నాలుగు. నిడివి చిత్రాలుకాదు; పావు గంట నుండీ అరగంట డ్యూరేషన్ వున్న చిత్రాలు..."

"ఎనభై నాలుగు....?"

"ఎగ్జాక్ట్లీ ఎయిటీఫోర్! కామశాస్త్రం నిర్దేశిస్తున్న ఎనభై నాలుగు బంధాల్ని—చౌశితి బంధాల్ని—గురించి మీకు తెలిసే వుంటుంది. ఎనభై నాలుగురకాల భంగి మల్ని ఎనభై నాలుగు రకాల బిట్స్‌గా—క్లాసికల్‌గా నా జాతికి బహూకరించాలని ఉవ్విళూరుతున్నాను. అందుకే మీ దగ్గరకు వచ్చాను!"

కాశీనాథ్ ఇబ్బందిగా చూశాడు. "ఇంతకీ నన్నేం చేయమంటారు? నా వ్యాపారంవేరు. నేను ఫైనాన్సి యర్ని కాను!"

డా॥ దండేకర్ చిన్నగా నవ్వాడు. "మీరు ఎవరు కారో, ఎవరు అవుతారో నాకు తెలుసు. ఈ చౌశితి

బంధాల చిత్రనిర్మాణంలో మీరు సహాయం చేయాలి...."

"ఏం చేయాలో నాకు అంతుపట్టడంలేదు. సినిమాలు వాళ్ళులుకొని వాట్ని వీడియో కాసెట్స్‌గా తీసి అమ్ము కునే సంస్థ నాది...."

దండేకర్ పైప్ వెలిగించి పొగ ఊదుతూ ముందుకి వంగాడు. "మిస్టర్ కాశీనాథ్, అందరికీ కనిపించే మీ వీడియో క్యాసెట్ వ్యాపారంతో నాకు పనిలేదు. మీరు స్వయంగా నిర్మించి థియేటర్ వాళ్ళకి సప్లై చేస్తున్న అశ్లీలదృశ్యాల వ్యాపారంతో నాకు పనుంది!"

కాశీనాథ్ ఉలిక్కిపడి, ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. "వాట్ డూ యూ మీన్?"

"ఐ మీన్ వాట్ ఐ జస్టు సెడ్!"

"నేను అలాంటి అభ్యంతరకరమైన పనులు చేయను. నౌ యూ కెన్ గో!" కాశీనాథ్ లేకిలేస్తూ అన్నాడు.

"కంగారుపడకండి, కాశీనాథ్! మీ వృత్తి గురించీ, ప్రవృత్తి గురించీ పూర్తిగా తెలుసుకునే మీ దర్శనం చేసుకున్నాను. మీరు అండర్ గ్రౌండ్‌లో షూట్ చేస్తున్నారు. ఇండియాని సందర్శించడానికి వచ్చే ఇతర దేశాల స్త్రీ పురుషుల్ని చాకచక్యంగా పట్టి, వాళ్ళని ఉపయోగించి బ్లూ బిట్స్ తీస్తున్నారు. ఎన్.ఆర్.ఐ. సినిమాలు ప్రదర్శించే థియేటర్లకి జాగ్రత్తగా ఆ బిట్స్ సప్లై చేస్తున్నారు! మీరు చేస్తున్నదాన్ని కాదనడానికి నేను రాలేదు. నేను తలపెట్టిన పనికి సెన్సారు అంగీక రించదు. అంచేత మీరు చేస్తున్న కార్యాన్ని, నా ఆశ యాన్ని జోడించి నా ఎనభైనాలుగు చిత్రాల్ని మీ ద్వారా థియేటర్లకి, తద్వారా ప్రజలకి అందించాలని నేను నిర్ణయించాను...."

దండేకర్ ఆగి, పొగలాగాడు. అనుమానంగా అదు రాగా చూస్తున్న కాశీనాథ్ కళ్ళల్లోకి చిరునవ్వుతో చూశాడు.

"నేను తయారుచేసే ఈ చిత్రాల్ని అండర్‌గ్రౌండ్ నుండీ మీరు డిస్ట్రిబ్యూట్ చేస్తారు. అంతే!"

"నా గురించి మీ కెవరో రాంగ్ ఇన్‌ఫర్మేషన్ ఇచ్చారు...." కాశీనాథ్ ప్రారంభించాడు.

"ఒక్కక్షణం!" డా. దండేకర్ "ఔనంటూ నేనూ కాదంటూ మీరూ కబడీ ఆడుతూ టైం వేస్టు చేయడం నాకిష్టంలేదు. మీరు అశ్లీల దృశ్యాల్ని—సెన్సారు భాషలో-దొంగచాటుగా థియేటర్లకి అందిస్తూ వ్యాపారం చేస్తున్నారు. ప్రస్తుతం రాష్ట్రం మొత్తం మీదా పదకొండు బిట్స్ ప్రేక్షకుల కళ్ళకి విందు చేస్తున్నాయ్. ఏయే ఊళ్ళలో ఏయే థియేటర్లలో ఏయే బిట్స్ ఆడుతున్నాయో కూడా నాకు తెలుసు మిస్టర్ కాశీనాథ్. నాతో దాగుడుమూతలు ఆడ్డానికి ప్రయత్నించకండి!"

కాశీనాథ్ లేవబోయి, కూలబడ్డాడు. అతని కళ్ళల్లో యేదో సందేహం దొంగలా తొంగిచూస్తోంది. రెప్ప పాటులేని కళ్ళు అతనిలో సాగుతున్న ఆలోచనల్ని స్పష్టంగా చూపిస్తున్నాయి.

"ఎనభై నాలుగు బిట్స్ షూట్ చేయడానికి అయ్యే ఖర్చంతనీ నేనే భరిస్తాను. యువతీయువకుల్ని ఇద్దరం సెలక్టు చేద్దాం. నేనే డైరెక్టు చేస్తాను. అవసరమైతే నేనే కెమెరామన్ గా కూడా పనిచేస్తాను. మీరు చేయాల్సిన పనులు రెండే. మీ అండర్‌గ్రౌండ్ స్టూడియోనీ, కెమరాల్నీ ఉపయోగించడం; దేశవ్యాప్తంగా

బిట్స్ పంపిణీ చేయడం...."

"జస్ట్ మా మాట్ ..." కాశీనాథ్ అడ్డుతగిలాడు.

"వచ్చే లాభాల్ని చెరిసగం పంచుకుంటాం. ఎనభై నాలుగునీ వీడియో క్యాసెట్స్‌గా కూడా తీస్తాం. ఆర్నెల్లు తిరిగేలోగా ఆ క్యాసెట్లు దేశంలో కొత్త దంపతులకి పెళ్ళికానుకగా తయారయ్యే పరిస్థితి వస్తుంది! వాటిని అంత ఆర్టిస్టిక్‌గా తీస్తాన్నను!" దండేకర్ ముగించాడు.

కాశీనాథ్ పెదవి కొరుక్కున్నాడు. "ఆల్‌రైట్, డాక్టరు దండేకర్, ఇతర దేశాల్లో మీరనుకున్న వాటిని ఈజీగా తీయొచ్చు. ఏ అమెరికాలో మీరు షూట్ చేసి వదిలినా ఇక్కడ మేం చూస్తాం. నా దగ్గరికే రావడంలో మీ ఉద్దేశం ఏమిటి? నిజం చెప్పండి."

డా. దండేకర్ చిన్నగా నవ్వాడు. "నా ప్రాజెక్టుకి ఇండియన్ టెంపుల్స్‌లో లభించే శిల్పాలు ఆధారం అని ఇందాకే చెప్పాను. ఇండియన్ స్టయిల్లో, ఇండియన్ ఆర్టిస్టులతో వాత్స్యాయన కామసూత్రాలకి రూపకల్పన చేయాలన్నదే నా ధ్యేయం. ఒక్కో ప్రత్యేక విధానాన్ని ఒక్కో ప్రాంతం వాళ్ళు అనుసరిస్తారని వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. ఆ ప్రాంతం వాళ్ళతో, ఆ విధానాన్ని వివరించే చిత్రం తీస్తాను నేను. ఉదాహరణకి ఆంధ్రదేశంలోని ప్రజలు యెక్కువగా అనుసరించే విధానాన్ని ఆంధ్రదేశంలో, ఆంధ్ర యువతీయువకులతో చిత్రీకరిస్తాను!" దండేకర్ ఉద్రేకంతో అన్నాడు.

"అందుకే నేను పనిగట్టుకుని ఇండియాకి వచ్చాను. విదేశాల వాతావరణం, వ్యక్తులూ, ఫేసెస్ ఏవీ మచ్చుకి కూడా నా చిత్రీకరణలో అవుపించడం నా కిష్టంలేదు.

సెక్స్‌ని మన ప్రాచీనులు ఎలా గౌరవించారో, ఎలా డెవలప్ చేశారో లోకానికి చూపిస్తాను! అందుకే ఇండియాకి, అందుకే మీ దగ్గరకూ వచ్చాను. కొత్త వాళ్ళతో రిస్క్ తీసుకోవడంకన్నా అండర్ గ్రౌండ్ ప్రొడ్యూసరుగా, డిస్ట్రిబ్యూటరుగా అనుభవం సంపాదించిన మిమ్మల్ని నేను ప్రత్యేకంగా ఎన్నుకున్నాను!"

కాశీనాథ్ మెల్లిగా పైకిలేచాడు. సిగరెట్ వెలిగించి రెండుసార్లు ఇటూ అటూ పచార్లు చేశాడు. తటాలున ఆగి దండేకర్ వైపు తీక్షణంగా చూశాడు.

"నీ ఆఫర్‌ని నేను కాదంటే ఏం చేస్తారు?"

డా. దండేకర్ అర్థంకానట్టు కాశీనాథ్ వైపు చూశాడు. మెల్లిగా చిరునవ్వు నవ్వాడు. "వెళ్ళిపోతాను. ఫిల్మ్ సెన్సార్ బోర్డుని కల్సుకుంటాను. 'విదేశీ ప్రొడ్యూసర్స్ తీస్తున్న బ్లూ బిట్స్‌నీ, ఇండియాలో ఇతర దేశాల వ్యక్తులతో తీసి దొంగతనంగా కాశీనాథ్ సరఫరా చేస్తున్న అశ్లీల దృశ్యాల్ని దేశంమీదికి వదిలేసి కళ్ళు మూసుకున్న మీరు నా కళాఖండాల్ని ఎందుకు అనుమతించకూడదు?' అని నిలదీస్తాను...."

"మధ్యలో నా విషయం దేనికి?" కాశీనాథ్ అడ్డు తగిలాడు.

"మీ ప్రస్తావన నాకు బలం ఇస్తుంది!" దండేకర్ నవ్వుతూ అన్నాడు.

కాశీనాథ్ నవ్వలేదు. కిటికీవైపు తిరిగి, ఏకాగ్రతతో ఆకాశాన్ని చూస్తూ వుండిపోయాడు. గిరుక్కున వెనక్కి తిరిగాడు.

"డాక్టర్ దండేకర్, నేను పైసా పెట్టుబడి పెట్టను. కేవలం పంపిణీ చేస్తాను. ఫిఫ్టీ పర్సెంట్ ఇస్తావా?"

"ఇస్తానని రాసిస్తాను!" దండేకర్ నవ్వుతూ అన్నాడు. "చాకచక్యంగా, సమర్థవంతంగా మీరు పంపిణీ చేసేయాలి! నాకు డబ్బు అవసరంలేదు. ఫెయిర్ ఫాక్స్ అబ్బలు కూడా కనిపెట్టలేనంత పకడ్బందీగా స్విస్ బాంక్స్‌లో నా డబ్బు దాక్కుంది. ఇంకో విషయం కూడా మీకు చెప్తాను. త్వరలో నేను ఎనభై నాలుగు బుక్‌లెట్స్ పబ్లిష్ చేస్తాను. ఆ పుస్తకాల ఆదాయం చాలు నాకు!"

కాశీనాథ్ కళ్ళు అటూ ఇటూ చూశాయి. మెల్లిగా దండేకర్ ముందుకి నడిచాడతను. "డాక్టర్ దండేకర్, చాలా కాలంగా పబ్లిషర్ కావాలన్న ఆలోచన కూడా వుంది నాకు. నన్ను పార్ట్‌నర్‌గా తీసుకుంటారా?"

కాశీనాథ్ కళ్ళల్లో నాట్యంచేస్తున్న ఆశ్యాశని దండేకర్ చిరునవ్వుతో చూశాడు.

"అది చిత్రనిర్మాణంలో మీరు అందించే సహకారం మీద ఆధారపడి వుంటుంది!"

"నా సహకారాన్ని మీరు చూస్తారు!" కాశీనాథ్ సగర్వంగా హుషారుగా అన్నాడు.

"తప్పకుండా!"

కాశీనాథ్ నవ్వుతూ టేబుల్‌కి అనుకున్నాడు. "డాక్టర్ దండేకర్, విస్కీతో మన బిజినెస్ అగ్రిమెంట్‌ని సీల్ చేద్దాం!"

"సారీ. నేను తాగను. టీతో ఆ పని చేద్దాం!" దండేకర్ నవ్వుతూ అన్నాడు.

కాశీనాథ్ విదేశాల్లో పెరిగిన దండేకర్‌ని ఆశ్చర్యంతో చూస్తూ కుర్చీలో కూచున్నాడు.

"మిస్టర్ కాశీనాథ్! మీరో పని చేయాలి. మూడు రోజుల్లోగా రాష్ట్రంలో వివిధ ప్రదేశాల్లో వున్న మీ బిట్స్‌ని అన్నింటినీ రప్పించాలి. నాకోసం ప్రత్యేకంగా ప్రాజెక్టు చేయాలి. వాటికీ, మనం తీయబోయేవాటికీ ఎక్కడా క్లాష్ రాకూడదు. మీ బిట్స్‌ని నేను పరిశీలిస్తూ, చూడాలి...."

"తెప్పించే అవసరంలేదు. కాపీలువున్నాయి. మీరు చూడవచ్చు!" కాశీనాథ్ సగర్వంగా అడ్డుతగిలాడు.

"వెరీగుడ్. రాత్రికే ఆ పని ప్రారంభిస్తాం..తరవాత మనకి డజనుమందికి పైగా ఆడాళ్ళూ, మగాళ్ళూ అందమైన వ్యక్తులు—నిజం చెప్పాలంటే చక్కటి శరీర సౌష్టవం వున్న వాళ్ళు కావాలి. వాళ్ళందర్నీ నేను ఇంటర్వ్యూ చేయాలి...."

"ఇంతవరకూ నేను ఇండియన్ ఫేస్‌ని వాడలేదు! టూర్ల పేరుతో ఇండియాకి వచ్చే ఫారినర్స్‌ని—యువతీ యువకుల్ని—వాడుకున్నాడు....ఇప్పుడింక వెతకాలి.... అంతసులభం కాదనుకుంటాను...."

"మిస్టర్ కాశీనాథ్, అనుకుంటే ఈ లోకంలో అసాధ్యం ఏదీలేదు! నాకు స్వదేశీ సరుకే కావాలి!" దండేకర్ నవ్వుతూ అన్నాడు.

కాశీనాథ్ నవ్వాడు. "మార్కెట్లో వెతికిస్తాను!"

"రైట్. రాత్రి పదింటికి ఇక్కడికొస్తాను. మీ బిట్స్ అన్నింటినీ చూస్తాను. వారం రోజుల్లో మనం నాలుగు బిట్స్ తీయాలి!"

"అంత త్వరగా....ఐ థింక్...."

"డోంట్ థింక్! డబ్బు చేతిలో వుంటే యెంత పనైనా, ఎంత త్వరగా అయినా చేయొచ్చు. నా

జేబుల్లో యెంతో డబ్బుంది!" దండేకర్ సగర్వంగా అన్నాడు.

కాశీనాథ్ నవ్వుతూ టీకోసం బెల్ నొక్కాడు....

## 3

తలుపు తెరిచిన కాశీనాథ్ గుమ్మంలో నిలబడ్డ డా. దండేకర్‌ని ఆశ్చర్యంతో చూశాడు. అతని కళ్ళు మెరిశాయి.

"రండి రండి రండి! చెప్పాపెట్టకుండా అంతర్ధానమై పోయారు. వారం రోజుల్లో ఫస్టు బిట్ షూట్ చేయాలన్న మీరు పన్నెండు రోజులూ ఐపులేకుండా పోయేసరికి, ఇండియానుంచీ అంతర్ధానమైపోయారేమో అనుకున్నాను!" కాశీనాథ్ గబగబా అన్నాడు.

దండేకర్ నవ్వుతూ లోపలికి జరిగాడు. తలుపుమూసి, జాగర్తగా గొళ్ళెంపెట్టిన కాశీనాథ్ అతన్ని వెంబడించాడు. అప్పటికే కుర్చీలో కూచున్న దండేకర్ ఎదురుగా తన కుర్చీలో కూచున్నాడు.

"డాక్టర్ దండేకర్, ఎక్కడికి అంతర్ధానమయ్యారు?"

డా. దండేకర్ చిన్నగా నవ్వాడు. "అనుకున్నది సాధించేదాకా నేను అంతర్ధానం కాను!"

"అయితే....ఇన్నాళ్ళూ..."

"ఇన్నాళ్ళూ రాష్ట్రమంతా తిరిగాను...."

"ఎందుకు?" కాశీనాథ్ కళ్ళు చిట్లించాడు.

"నువ్వు సృష్టి చేసిన బూతు ముక్కలు అసలు సినిమాలకి అతికించి ప్రేక్షకుల జేబులు ఖాళీచేస్తున్న థియేటర్ యజమానుల్ని కలుసుకోడానికి...."

ఉన్నట్టుండి తనని ఏకవచనంలో సంబోధిస్తున్న డా. దండేకర్ని కాశీనాథ్ ఆశ్చర్యంతో చూశాడు. ఏదో కొత్త భావం దండేకర్ మొహాన్ని మాస్క్‌లా కప్పింది. అతను ప్రయోగించిన ఏకవచనాన్ని కాశీనాథ్ నిర్లక్ష్యం చేస్తూ అన్నాడు.

"వాళ్ళని కల్పుకోడం దేనికి?"

"ఆ బూతు బొమ్మల్ని నువ్వే సప్లై చేశావని రాత మూలకంగా వాళ్ళనుంచీ తీసుకోడానికి!" దండేకర్ నవ్వుతూ అన్నాడు.

కాశీనాథ్ కనుబొమలు అతని భ్రూపుని పైకిలేస్తూ కదిలాయి. అతను తీక్షణంగా దండేకర్ మొహంలోకి చూశాడు.

"డాక్టర్ దండేకర్, ఏమిటో అర్థం పర్థం లేకుండా మాట్లాడుతున్నారు....మన ప్రాజెక్టుకి అవన్నీ అవసరం లేదనుకుంటున్నాను...."

"మన ప్రాజెక్టు కాదు; నా ప్రాజెక్టు!" దండేకర్ అతనికి అడ్డు తగిలాడు.

కాశీనాథ్ కనుబొమలు మళ్ళీ ఇబ్బందిగా కదిలాయి. "వాట్ డూ యూ మీన్? నా పార్టనర్ షిప్‌ని వదులుకుంటున్నారా? ఎనభై నాలుగునీ మీరే...."

"కాశీనాథ్, నేనెప్పుడూ పార్టనర్స్‌ని పెట్టుకోను. నా పని ఏదైనా నేనొక్కణ్ణే చేసుకుపోతాను!"

"అయితే నన్ను వెతుక్కుంటూ ఇక్కడికెందుకు వచ్చారు?" కాశీనాథ్ విసుగ్గా అన్నాడు.

దండేకర్ చిన్నగా నవ్వాడు. "నీతో వ్యాపారం చేయాలనుకుంటున్నాను గనక!"

"ఏమిటి మీ వ్యాపారం?" కాశీనాథ్ గర్జించాడు.

"నువ్వు చెప్పిన లిస్టుప్రకారం థియేటర్ వాళ్ళని కల్సుకున్నాను. నీ బూతు ముక్కలు చూశాను. నువ్వు సజెస్ట్ చేసినట్టూ, మామూలుగా చేస్తున్నట్టూ థియేటర్ వాళ్ళనుంచీ స్టేట్ మెంట్స్ తీసుకున్నాను. నువ్వు సెలెక్ట్ చేసిన యువతీ యువకుల్ని కల్సుకున్నాను. వాళ్ళ స్టేట్ మెంట్సూ తీసుకున్నాను...."

"ఎందుకు?" కాశీనాథ్ బిగ్గరగా అరిచాడు. "వాళ్లెవరో నేను చెప్పలేదు!"

"చెప్పకపోయినా ఫర్వాలేదు. నువ్వు కల్సుకున్న వాళ్ళందర్నీ ఒక కంట కనిపెట్టాను. తరవాత కల్సుకున్నాను. ఫేమస్ డైరెక్టర్ దండేకర్ గా వాళ్ళతో మాట్లాడాను. నువ్వు బూతు బొమ్మల్లో నటించడానికి తమని అడిగినట్టు వాళ్ళంతా రాసిచ్చారు...."

"ఐ సే వై? ఎందుకు?" విసిగిపోయిన కాశీనాథ్ అరుస్తూ టేబుల్ మీద పిడికిలిని సుత్తిలా వాయించాడు.

"కాశీనాథ్, అనవసరంగా టేబుల్ ని బాదకు. ఎలాగా కాస్సేపట్లో నెత్తీనోరూ బాదుకుంటావ్...."

"నాన్ సెన్స్!" అరుస్తూ కాశీనాథ్ పైకిలేచాడు. దండేకర్ వైపు ఆవేశంతో చూశాడు. లోపలే పళ్ళు కొరుక్కుంటున్న అతని దవడలు మెల్లిగా కదిలాయి. దండేకర్ వాలకం బొత్తిగా అంతుపట్టని కాశీనాథ్, ప్రయత్నించి తన ఆవేశాన్ని అదుపులోకి తెచ్చుకున్నాడు.

"డాక్టర్ దండేకర్...."

"అయామ్ నాట్ డాక్టర్. ఐ యామ్ నాట్ దండేకర్...."

"దెన్ హూ ది హెల్ ఆర్ యూ?" కాశీనాథ్

గర్జించాడు.

దండేకర్ కుర్చీలో వెనక్కి వాలాడు. కోటుజేబు లోంచి పాకెట్ తీసి సిగరెట్టు వెలిగించాడు. పొగ ఊదుతూ, బుసకొడుతున్న కాశీనాథ్‌ని చిరునవ్వుతో చూశాడు.

"అయామ్ శివరామ్."

కాశీనాథ్ కనుబొమలు అష్టవంకర్లు తిరిగాయి. అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి. "ఎవర్నువ్వు?"

"చెప్పానుగా! అయామ్...."

"ఎందుకొచ్చావ్? తప్పుడు పేరు ఎందుకు చెప్పావ్?" కాశీనాథ్ ఆద్భుతగులూ హుంకరించాడు.

"నీతో వ్యాపారం చేయడానికి."

"ఏమిటి నీ బోడి వ్యాపారం?"

"బోడి వ్యాపారంకాదు; బూతు వ్యాపారం!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

కాశీనాథ్ ఉక్కిరిబిక్కిరవుతూ ఆగ్రహావేశాలతో చూశాడు.

"వాట్ నాన్‌సెన్స్...."

"షటప్!" శివరాం కంఠం టపాకాయలా పేలింది. "నోరు మూసుకుని నీ కుర్చీలో కూచో. చెవులు రిక్కించు. చేతులు నీ వొళ్ళో పెట్టుకో. ఎందుకంటే కాసేపట్లో అవి వణకడం ప్రారంభిస్తాయి...."

"నాన్‌సెన్స్! ఏమిటీ వాగుడు? ఫట్టు యూ గెటౌట్!" కాశీనాథ్ హుంకరించాడు.

"ఫస్టు ఐ విల్ గెట్ వాట్ ఐ వాంట్....తరవాత ఐ విల్ గెట్ ఔట్!"

"ఏం కావాలి నీకు?"

"డబ్బు" శివరాం స్పష్టంగా అన్నాడు.

"వెళ్ళి నీ బాబునడుగు!"

"నీలాంటి జేబుదొంగలున్నంత కాలం బాబుల్ని అడగాల్సిన అవసరంలేదు!" శివరాం నవ్వుతూ అన్నాడు. "బూతుబొమ్మలుతీసి, ప్రేక్షకులకి విందుచేసి తెలివిగా, చేతులు ఉపయోగించకుండా వాళ్ళ జేబులు కొట్టేస్తున్నావ్ ..."

"దటీస్ నన్నాఫ్ యువర్ బిజినెస్!" కాశీనాథ్ అరిచాడు.

"కరెక్ట్! అది నా వ్యాపారంకాదు; నా వ్యాపారం ఇది!" శివరాం నవ్వుతూ అన్నాడు. "నీ చరిత్రంతా ఒక చక్కటి ఫైలుగా తయారుచేశాను. నువ్వు తయారుచేసిన బూతు కళాఖండాల లిస్టూ వాటికి సంబంధించిన స్టిల్సూ, ప్రస్తుతం అవి కనిపించే అసలు సినిమాలూ, ఆడిస్తున్న థియేటర్లూ, థియేటరు యజమానులు వినయ విధేయులతో సప్లై చేసిన స్టేట్మెంట్సూ కొత్తగా నువ్వు డాక్టర్ దండేకర్ సహకారంతో నిర్మించబోయే ఎనభై నాలుగు కళాఖండాలకోసం సంప్రదించి బుక్ చేసిన దేశవాళీ ఆర్టిస్టుల వివరాలూ స్టేట్మెంట్లూ ఫైల్లో వున్నాయి."

"అవన్నీ నీకెందుకు?" నివ్వెరపాటుతో కుర్చీలో చతికిలబడుతూ కాశీనాథ్ ప్రశ్నించాడు.

"అంకుశం లేకపోతే ఏనుగుని లొంగదీయలేం!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"నేన్నమ్మను. నువ్వు బుకాయిస్తున్నావ్!" కాశీనాథ్ కొద్దిగా తేరుకుని అన్నాడు.

"నువ్వు నమ్మకపోవచ్చు. పోలీసులు నమ్ముతారు; ప్రభుత్వం నమ్ముతుంది!" శివరామ్ నవ్వుతూ అన్నాడు. "నీకు కావాలంటే ఆ ఫైల్ని నీకే అమ్మేస్తాను. వద్దంటే పత్రికలకి అమ్మేస్తాను...."

పైకిలేస్తున్న కాశీనాథ్ ని చూస్తూ శివరాం ఆపేశాడు. కాశీనాథ్ టేబుల్ చుట్టూ తిరిగి శివరాం దగ్గరగా నించున్నాడు. రెప్పపాటులేని కళ్ళతో శివరాం కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. నవ్వు అతని పెదవుల చివర్లని కొద్దిగా కదిపింది.

"బ్లాక్ మెయిలింగ్ బాస్టర్డ్! ఈ వృత్తిలో నీలాంటి వాళ్ళని లెఖ్ఖలేనంత మందిని చూశాను. నన్ను తప్పుగా అంచనా వేశావ్. అందుకు విచారిస్తావ్!"

శివరాం రెప్పలు పైకెత్తి కాశీనాథ్ ని తదేకంగా చూశాడు. చివరి దమ్ములాగి సిగరెట్ పీకని యాష్ ట్రేలో నొక్కుతూ వుండిపోయాడు. చూపుల్ని కాశీనాథ్ మొహంమీంచీ తిప్పకుండా మెల్లిగా పైకిలేచాడు. అతని ఎడమకాలు తటాలున కదిలింది. వెనకున్న కుర్చీ చప్పుడు చేస్తూ వెల్లకిలా పడింది.

"కాశీనాథ్, యూ ఆర్ కరెక్టు. నిన్ను తప్పుగా అంచనా వేశాను! నా మెసేజ్ ని అర్థంచేసుకుని, నీ ఆరోగ్యాన్ని కాపాడుకుంటావనుకున్నాను. నా దగ్గరున్న నీ జాతకాన్ని కొనుక్కుంటావనుకున్నాను. ఎంత మందిని చూసివున్నా కూడా, ఎదగాల్సినంతగా నువ్వు ఎదగలేదు! ఆల్ రైట్. వస్తాను!" శివరాం పక్కకి జరిగి గుమ్మంవేపు తిరిగాడు. ఎడంచేత్తో పట్టుకున్న లెదర్ ఫోల్డర్ని వూపుకుంటూ సావధానంగా నడవసాగేడు.

"ఆగు...." నింపాదిగా ధ్వనించిన కాశీనాథ్ కంఠం

గుమ్మానికి మూడడుగుల దూరంలో శివరామ్‌ని ఆపింది. ఆగి, వెనక్కి తిరిగి శివరాం అమాయకంగా చూశాడు.

కాశీనాథ్ టేబుల్ ముందు లేడు. తన కుర్చీదగ్గరగా నించున్నాడు. అతని చేతిలో ఇరుక్కున్న రివాల్వర్ శివరాంఛాతీని ఒంటికంటితో చూస్తోంది.

"దండేకర్, శివరామ్ .... లేకపోతే — శివరామ్ దండేకర్. ఈ గదిలోంచీ నువ్వు రెండు వస్తువుల్లో ఒకే ఒకదాన్ని తీసుకెళ్ళగలవ్. ఒకటి నీ ప్రాణం. రెండోది నీ చేతిలోని ఫైలు. ఏది తీసుకెళ్తావో తేల్చుకో...."

"అలాగా?" శివరాం ఎగతాళిగా అన్నాడు.

కాశీనాథ్ అద్దాలబిళ్ళల్లావున్న కళ్ళని శివరాం మొహం మీదే నిలిపాడు. "నీకు కొద్దిగా టైం ఇస్తాను. రెండో ఎక్కం చెప్పటం ప్రారంభిస్తాను. 'రెండుపదుల ఇరవై' అనేలోగా నీ సెలెక్షన్ ఏదో నాకు తెలియజేయాలి. తెలియజేయకపోతే నీకు రెండూ అవసరంలేదని నేను తేల్చుకుంటాను; రెండూ తీసుకుంటాను...."

ఆగిన కాశీనాథ్‌ని శివరాం అర్థంకానట్టు చూశాడు.
"రెండు ఒకట్ల రెండు...." కాశీనాథ్ ప్రారంభించాడు.

చిరునవ్వు నవ్వుతూ శివరాం అతనివేపు మెల్లిగా అడుగులు వేయసాగాడు. కాశీనాథ్ కళ్ళు కదలిక లేకుండా శివరాంమీదేవున్నాయి. ఫోల్డర్ని చేతికింద ఇరికించి, శివరాం సిగరెట్టు వెలిగించాడు.

"రెండు ఏళ్ళ పద్నాలుగు.... రెండెనిమిదుల...." కాశీనాథ్ తెలివైన విద్యార్థిలా రెండో ఎక్కం చెప్పుకు పోతున్నాడు. శివరాం ఫోల్డర్ని ఎడిచేత్తో పట్టుకున్నాడు. రివాల్వర్ పట్టుకున్న కాశీనాథ్ చెయ్యి కదిలింది. నవ్వుతూ శివరాం ఫోల్డర్ని టేబుల్ మీదికి

గిరాటేశాడు.

"రెండుపదు...." ఫోల్డర్ చప్పుడు రెండో ఎక్కం పూర్తి చేయకుండా కాశీనాథ్ కి అడ్డు తగిలింది.

"రిలాక్స్!" శివరాం నవ్వుతూ అన్నాడు.

రివాల్వర్ని తృప్తికరంగా ఒకసారి చూసి, రెప్పలెత్తి సగర్వంగా కాశీనాథ్ శివరామ్ని చూశాడు. చిరునవ్వుతో అతని పెదవులు వంకరగా కదిలాయి.

"తెలివైన నిర్ణయం! నా గెట్ లాస్ట్!" కాశీనాథ్ గర్జించాడు.

శివరాం సుప్పున పొగవూది నవ్వుతూ చూశాడు. "థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంటు! నా దగ్గర 'ప్రాణం' ఒక్కటేవుంది; ఐమీన్....ఒకే ఒక ప్రాణంవుంది. ఫోల్డర్సు బోల్డన్ని వున్నాయి! ఆల్ రైటు! సీ యూ లేటర్ ఇన్ హెల్! గుడ్ బై!" గిరుక్కున వెనక్కి తిరిగి శివరామ్ గుమ్మంవేపు జోరుగా నడిచాడు.

"ఆ....గు...." కాశీనాథ్ కంఠం బొంగురుగా ధ్వనించింది.

శివరాం ఆగలేదు; తిరిగి చూడలేదు.

"శివరాం.... వెళ్లొద్దు.... ఆ...గు!" కాశీనాథ్ దాదాపుగా అరుస్తున్నట్టు అన్నాడు.

ఈసారి శివరాం ఆగి తలుపుకి వీపు ఆనించాడు. చిరునవ్వుతో కాశీనాథ్ని చూశాడు. అతని మొహం మీద ఆశ్చర్యం కొత్తచర్మంలా అవుపిస్తోంది. శత్రువుని ఎదుర్కోడానికి రివాల్వర్ లాగి, చివరిక్షణంలో ఆ రివాల్వర్లో గుళ్ళులేవని తెలుసుకున్న వ్యక్తిలా కంగారుతో బలహీనంగా చూస్తున్నాడతను.

"కాశీనాథ్, తెలుగు సినిమాలోని సెకండ్ రేట్

విలన్‌లా ప్రవర్తించావు! మనిషికి ఒకజేబులో డబ్బూ మరో జేబులో రివాల్వర్ — ఈ రెండూ మాత్రమే ఉంటే చాలదు! మెడమీదున్న బుర్రలో సవ్యంగా పనిచేసే మెదడుండాలి! అదిలేని నీలాంటి మూర్ఖులతో శివరాం వ్యవహారం చేయడు. సో లాంగ్" శివరాం తలుపుమీంచీ వీపుని ముందుకి కదిలించాడు.

"స్కాండ్రల్, ఇలారా. పూర్తిగా, వివరంగా మాట్లాడుకుందాం. ." కాశీనాథ్ పళ్ళు బిగబట్టి అన్నాడు.

"సారీ! పూర్తిగా వివరంగా మాట్లాడుతూ కూచుంటే నీ కొంప పూర్తిగా మునిగిపోతుంది. నీ టేబుల్ మీద మీద పడున్న ఫోల్డర్ కవలలు మరో అరు, అరు చేతుల్లో రెక్కలు విప్పి ఎగిరిపోడానికి సిద్ధంగా వున్నాయ్. నేను ముందే నిర్ణయించిన టైం ప్రకారం మరో పాతిక నిమిషాలలో, నేను క్షేమంగా, సుఖ్యంగా లాభంగా తిరిగి వెళ్ళి ఆ రెక్కలు కత్తిరించాలి. లేకపోతే ఆరుగురూ ఆరుగురు వ్యక్తుల్ని కల్సుకుని కథంతా చెప్పి కథని సరండర్ చేస్తారు. మరుక్షణం చట్టం తన ఎలాస్టిక్ హస్తాల్ని చాపుతుంది. కాషాయ గుడ్డలు ధరించి కాశీకి వలసవెళ్ళే అవకాశం కూడా — కనీసం నీకుండదు...."

"నో! యూ ఆర్ బ్లఫింగ్!" కాశీనాథ్ బొంగురుగా అరిచాడు.

"నీ రివాల్వర్ని నువ్వు నీకు కవచంగా వాడుకున్నట్టే నీ చరిత్రని — లేకపోతే ఆ ఫోల్డర్ కవలల్ని నాకు కవచంగా నేను వాడుకుంటున్నాను, కాశీనాథ్!" శివరాం గంభీరంగా అన్నాడు.

కాశీనాథ్ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. అతను

తెరువు కేలోగా శివరాం ప్రారంభించాడు.

"పాతిక నిమిషాల్లో నాలుగు పరుగెట్టేశాయి. మిగిలిన ఇరవై ఒక్క నిమిషాల్లో నేను వెళ్ళి ఎగిరిపోడానికి తహ తహలాడుతున్న ఆ ఫోల్డర్ రేగల రెక్కలు కత్తిరిం చేయాలి. కత్తిరించాలంటే ప్రభుత్వం ప్రింట్ చేస్తున్న కాగితాల కత్తెరని నువ్వు నాకు అందించాలి!"

"ఎన్ని....?" కాశీనాథ్ నత్తిగా అన్నాడు.

శివరాం సిగరెట్ పీకని కాశీనాథ్ వైపు గురిచూసి రువ్వాడు. నవ్వుతూ అతనివైపు సింహంలా నడిచాడు. కుర్చీలో కూచున్నాడు. కాలుమీద కాలు వేసుకుని కొత్త సిగరెట్టు వెలిగించాడు. రివాల్వర్ పట్టుకున్న సిపాయి బొమ్మలా నించున్న కాశీనాథ్‌ని నవ్వుతూ చూశాడు.

"కాశీనాథ్, రివాల్వర్ మళ్ళీ వెంటనే నీకు దొర క్కుండా దాచేయి. లేకపోతే-ఎంతో నేను చెప్పగానే, దాన్ని నీ తలకి అన్చుకుని ట్రిగ్గర్ నొక్కేస్తావు!"

కాశీనాథ్ అసంకల్పితంగా ఇంకా చేతిలోనే వున్న రివాల్వర్ని కంగారుగా చూసుకున్నాడు. అప్రయత్నంగా అతని చెయ్యి వణికింది. రివాల్వర్ని టేబుల్ సొరుగులో పడేసి, అతను వెర్రివాడిలా శివరాంవైపు చూశాడు.

"నీ కింద బ్లాక్ మనీ ఎంతుందో నాకు తెలీదు. బ్యాంకుల్లో ఎంతుందో తెలుసు. నీ బ్లాక్ మనీ గురించిన నా అజ్ఞానం ఈ క్షణంలో నీకు వరంగా తయారైంది కాశీనాథ్ ...."

"వాట్ ....?"

"మూడు బ్యాంకు ఖాతాల్లో మొత్తం అరవై రెండున్నర లక్షలా చిల్లర దాచుకున్నావు. ఆదరా బాదరా అరవై లక్షలు నా ఫీజా కింద...."

"నో! ఇది....దారుణం! అక్రమం!" కాశీనాథ్ అరుస్తూ దబాలున కుర్చీలో కూలబడ్డాడు.

"కాశీనాథ్, గుండెని చిక్కబెట్టుకో. రివాల్వర్ నీకు అందకుండా, టేబుల్ సొరుగు మూసెయ్. క్విక్!" శివరాం నవ్వుతూ అన్నాడు.

కాశీనాథ్ చూపుల్ని అప్రయత్నంగా టేబుల్ సొరుగువైపు తిప్పాడు. అప్రయత్నంగా అతని చెయ్యి టేబుల్ సొరుగుని మూసేసింది. మెల్లిగా, పాలిపోయిన మొహాన్ని శివరాంవైపు తిప్పి ప్రాధేయపూర్వకంగా చూశాడతను.

"శివరాం....లోకంలో పూర్తి బ్లూ ఫిల్మ్ లే తీసి, వీడియో క్యాసెట్లుగా అమ్ముతూ యెందరో లక్షలకి లక్షలు ఆర్జిస్తున్నారు. దాంతో పోలిస్తే నేను చేస్తోంది లెక్కలోకే రాదు. నా మాట విని...."

"మాటలు వినడానికి నేనిక్కడికి రాలేదు, కాశీనాథ్!" శివరాం అడ్డుతగిలాడు. "నువ్వు ఎనభై నాలుగు బంధాల చిత్రీకరణకోసం అరడజనుమందిని ఏర్పాటు చేశావు. వాళ్ళందర్నీ నేను కలుసుకుని తగు విధంగా బ్రెయిన్ వాష్ చేశాను. తలా వో ఫోల్డర్ ఇచ్చొచ్చాను. తగిన పారితోషికం ఇచ్చి నీకోసం వాటిని వాళ్ళనుండి తీసుకోవాలి! అంచేత...."

"ఒక్కక్షణం" కాశీనాథ్ అడ్డుతగిలాడు. "ఎనభై నాలుగు చిత్రాలకీ పెట్టుబడి నువ్వే పెట్టాలని మొదట్లో నేనన్నాను. ఇప్పుడు ఇద్దరికీ లాభం కలిగేలా కొత్త ప్లానిస్తాను. నేనూ సగం పెట్టుబడి పెడతాను. పంపిణీ చేస్తాను. నీది సగం పెట్టుబడి మాత్రమే. అయితే కూడా లాభాల్ని చెరిసగం పంచుకుందాం. నన్ను అడుగుతున్న

చిత్రాన్ని వెక్కిరించే చిత్రాలు నీ పోర్ట్రైవాలుతాయి! నా మాట విను. ఆ ఫోటర్లనీ, వాళ్ళనీ రప్పించెయ్. లైట్స్ స్టార్ట్స్ షూటింగ్!" కాశీనాథ్ ఉద్రేకంతో అన్నాడు.

శివరాం పకపక నవ్వాడు. "ఇంటలిజెంట్ రోగ్! కష్టంలో నీ బుర్ర కత్తిలా పంకేస్తోంది! బూతుబొమ్మల్ని దేశంమీదికి వదలడానికి నేనూ నువ్వూ అంత శ్రమ పడక్కర్లేదు. 'సారే జహాఁసే అచ్ఛా' అని సగర్వంగా, రేడియోల్లో, టీవీల్లో, స్కూళ్ళలో మనం పాడుతూ కీర్తించుకునే మన హిందూదేశంలో జన్మించి, నాన్ రెసిడెంట్ ఇండియన్స్‌గా తయారైపోయి, మన సంస్కృతినీ, అభిరుచినీ ఇతర దేశాల్లో దండోరా వేస్తున్న మన భారతీయులు ఎంతో విశాల హృదయంతో 'ఎన్ ఆర్ ఐ' పథకం కింద హై క్లాసు బూతునీ, టాప్ క్లాస్ హింసనీ ఇక్కడికి సరఫరా చేస్తూ సోదర భారతీయుల్ని బ్రహ్మాండంగా ఎలివేట్ చేస్తున్నారు! నువ్వూ నేనూ...."

"అదికాదు...."

"నువ్వూ నేనూ ఆ బృహత్ కార్యాన్ని సాగించే అవసరం బొత్తిగా లేదు!" కాశీనాథ్‌ని నిర్లక్ష్యం చేస్తూ శివరాం ముగించాడు. ఒకసారి వాచీ చూసుకుని సాభిప్రాయంగా కాశీనాథ్‌ని చూశాడు.

"శివరాం....నన్ను అన్యాయం చెయ్యొద్దు. అది నీకు ఆరోగ్యకరం కాదు!" కాశీనాథ్ మెల్లిగా, బెదిరింపుగా అన్నాడు.

"అలాగా! అయితే వస్తాను. న్యాయంగానే వ్యవహరిస్తాను!" అంటూ శివరాం లేచాడు.

"బాస్టర్డ్! పారేస్తాను. అయితే అరవై లక్షలు కాదు; వేలు. అంతకుమించి—" కాశీనాథ్ ఉక్రోషంతో ప్రారంభించాడు.

"అంతకు మించి మరో అక్షరం పలికితే నా రేటు అక్షరానికి లక్ష చొప్పున పెంచేస్తాను! అరవై—వేలు కాదు, లక్షలు ఇచ్చుకుంటానంటే కాసేపు కూచుంటాను. ఆమాట అనకపోతే వెళ్ళిపోతాను!" శివరాం తీక్షణంగా చూస్తూ అన్నాడు.

కాశీనాథ్ తలవాల్చి, రెప్పల పైకెత్తి గుడ్లు పైకి పెళ్ళగిస్తూ బెదిరింపుగా చూశాడు. "శివరాం, నేను బూతు బొమ్మలు అమ్మి ఆర్జించుకున్నాను. నన్ను నువ్వు దోచుకుంటున్నావ్. నేను చేస్తున్న బూతు వ్యాపారం కన్నా నీ 'వ్యాపారం' గొప్పదేం కాదు! అంచేత...."

"గుర్రాన్ని కట్టెయ్!" శివరాం అడ్డు తగిలాడు. తదేకంగా కాశీనాథ్ ఎర్ర కళ్ళల్లోకి చూశాడు. "నీలాంటి స్వార్థపరులు అక్రమంగా దోపిడీ సాగించినంతకాలం, నేను ఇలా సక్రమంగా బుద్ధి చెప్తూనే వుంటాను! బూతు అమ్మి బతికే నువ్వు నాకు నీతి చెప్పే ప్రయత్నం చేయకు! ఎందుకంటే మనుషుల బలహీనతని నువ్వు తెలివిగా డబ్బుకింద మార్చేస్తున్నావు. నేను నీ తెలివిని విజ్ఞానంతో దెబ్బతీస్తున్నాను. ఆల్ రైట్ మరో పదినిమిషాల్లో నేను రెక్కలు కత్తిరించాలి. కత్తెర్లు ఇస్తున్నావా?"

"పారేస్తాను! ఏరుకుని పారిపో! మళ్ళీ నీ మొహం నాకు అవుపిస్తే ఏం చేస్తానో నాకే తెలియదు!" కాశీనాథ్ ఉక్రోషంతో హుంకరించాడు.

శివరాం పకపక నవ్వుతూ వుండిపోయాడు. "వెరీగుడ్

అలాగే వెళ్ళిపోతాను. మళ్ళీ నీకు కనిపించను. అయితే నా కళ్ళు నిన్ను అనుక్షణం గమనిస్తూనే వుంటాయ్. నీ భవిష్యత్తుకి నేను బాట వేస్తాను. ఆ బాట తప్పితే తరవాత బాధపడతావ్! వెళ్ళు. ముల్లెతో తిరిగిరా. తరవాత నీకు బాట చూపిస్తాను!"

కాశీనాథ్ బుసకొడుతూ పళ్ళు కొరికాడు. కోపంతో ఓటమితో అతని మొహం వికృతంగా తయారైంది. అతను తయారుచేసిన బొమ్మల్లోని బూతు అంతా ఆ క్షణంలో అతని మొహంలో కేంద్రీకరించినట్లు శివరాం చిరునవ్వుతో గమనిస్తూ కొత్త సిగరెట్టు వెలిగించాడు....

# 4

తలుపు తెరుచుకుంది. మూసుకుంది; మంచంమీద పడుకున్న లత తటాలున పైకి లేచింది. ఆమె విశాల నేత్రాలు గుమ్మంలో నిలబడ్డ శివరాంని నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూశాయి.

"హెల్... వో...." శివరాం తమాషాగా అన్నాడు.

"సందేహంలేదు. హెల్లే! నాలుగ్గోడల మధ్య ఇలా ఖైదీగా పడేసి కాలారా హాయిగా తిరిగొస్తావ్! ఇది అన్యాయం!" లత చిరుకోపంతో అంది.

"ఎవర్ని పలకరించినా నన్ను 'అన్యాయం' 'అన్యాయం' అంటున్నారు?" శివరాం నవ్వుతూ అన్నాడు.

లత మాట్లాడకుండా బుంగమూతి పెడ్తూ నిలబడింది.

"హనీ....ఏమిటి కొత్త వేషం? నా లుంగీ, నా జుబ్బా తగిలించావు. నా దుస్తుల్లో నిన్నెందుకు దాచుకున్నావ్?" శివరాం లతని తృప్తికరంగా చూస్తూ అన్నాడు.

లత చేతులు ఆమె వేసుకున్న చైనాసిల్కు జుబ్బాని కిందికి లాగాయి. "నీకు దగ్గరగా వుండలేకపోయినా, కనీసం నీ దుస్తులకైనా దగ్గరగా వుండాలిగా!"

చిలిపిగా నవ్వుతున్న లత కళ్ళల్లోకి శివరాం నవ్వుతూ చూశాడు. "థాంక్స్. "ఈ దుస్తుల్లో నువ్వు రోడ్డు మీదికి అడుగుపెడితే, మరుక్షణం ఫ్యాషన్ మారిపోతుంది. ఇరవైయేళ్ళ క్రితం కనుమరుగైపోయిన 'లుంగీ జుబ్బా' ఫ్యాషన్ అమ్మాయిల్ని సుడిగాలిలా చుట్టేస్తుంది!"

"కబుర్లేనా, కథ చెప్తావా?" లత అతని కాళ్ళ దగ్గరున్న సూట్‌కేస్‌ని ఆశగా చూస్తూ అంది.

సూట్‌కేస్‌ని అందుకుని శివరాం ఆమె దగ్గరగా జరిగాడు. మంచంమీద చతికిలబడ్డాడు. ఇంకా నుంచునే వున్న లత భుజమ్మీద చెయ్యేసి కిందికి లాగాడు. అతని పక్కనే కూలబడి లత అతనివైపు నవ్వింది.

"హనీ, బొమ్మలా వున్నావ్!" మెప్పుగా ఆమె సౌందర్యాన్ని చూస్తూ అన్నాడు శివరాం.

"బొమ్మా....ఏవో బూతు బొమ్మలన్నావ్....ఇది ఆ బూతేనా?" సూట్‌కేసుని చూపిస్తూ అంది లత.

శివరాం పకపక నవ్వాడు. "కాశీనాథ్ అనబడే బూతు నాథుడు చేస్తున్న బ్లూ బొమ్మల వ్యాపారం గురించి నీకు చెప్పాగా? ఇప్పుడు క్లైమాక్స్ చెప్తా, విను: దండేకర్ అవతారంలో నేను నిర్మించే ఎనభై నాలుగు బూతు కళాఖండాలకోసం ఆరుగురు ఆవేశపరుల్ని వాడు ఏర్పాటు చేశాడు. వాళ్ళని కమీషనర్ శివానంద్‌గా కల్సుకున్నాను. అదరగొట్టి అసలు సంగతి కక్కించాను. అంతా రాయించుకున్నాను. అరవైలక్షలు చదివింపుగా

అర్పించకపోతే సిబిఐ, పోలీసు, పత్రికలు వగైరాలకి కథ అప్పజెప్తానంటూ కాశీనాథ్ గాణ్ణి కంగారు పెట్టేశాను....”

“అర్పించాడా?”

“అర్పించుకోకపోతే ఆరిపోతాడుగా?” శివరాం సగర్వంగా అన్నాడు. “ఘీంకరించాడు. హుంకరించాడు. గర్జించాడు. బుసకొట్టాడు. క్షణంలో వాడి జంతువుల అరుపులన్నింటినీ మనిషి ఏడుపుకింద మార్చేశాను. రేపట్నుంచీ బ్లూ వ్యాపారం కట్టేసి, బూతులా అవుపించకుండా వ్యర్థప్రయత్నం చేసే తెలుగు సినిమా క్యాసెట్లు అమ్ముకొమ్మని సలహా ఇచ్చాను. రాష్ట్రమంతా ఆడుతున్న బ్లూ బిట్స్‌ని రేపట్లోగా వాపసు తెప్పించి కాల్చేయమన్నాను....”

“కాల్చేస్తాడా?” లత అడిగింది.

“కాల్చకపోతే కాలిపోతాడు!” శివరాం నవ్వుతూ అన్నాడు.

“డార్లింగ్ ....”

“యస్?”

“....,వొద్దులే,....అర్థమైంది,....వాడు ఎలాగా పోలీసుల్ని కల్సుకోలేడు....నక్కిన పేనులా పడుంటాడు. అంతేగా?”

“గుడ్! సందేహాల్ని సమాధిచేయడం అచిరకాలంలో నేర్చుకున్నావ్!”

“డార్లింగ్ ....అరమైలో ఖర్చెంత?”

“ఖర్చా? ఈసారి మనం ఖర్చులేని కొనుగోలు చేశాం!” శివరాం సగర్వంగా అన్నాడు.

ఆలసటగా మంచంమీద వెల్లకిలా వాలుతున్న

శివరాంమీదికి లత పరవశంతో వాలే ప్రయత్నంచేసింది. రెండు చేతుల్తో ఆమె రెండు భుజాల్నీ పట్టుకుని ఆపా డతను. బాబ్డు హెయిర్ ఫ్రేములో ఇమిడిన ఆమె మొహాన్ని సగర్వంగా చూశాడు.

"హనీ, అలిసిపోయాను. టెలిఫోన్ అందుకో. నంబరు తిప్పు. అతను పలకగానే రిసీవర్ నా చెవికి అనించు ...."

"నంబరు.... టెంపో నంబరేగా?" లత కనుబొమలు ముడి వేస్తూ ఆయిష్టంగా అడిగింది.

శివరాం నవ్వుతూ బాబ్డు హెయిర్ తెర కింద దాక్కున్న లత చెంపని ప్రేమగా తడిమాడు. "హనీ, యూ ఆర్ స్మార్ట్!"

"డార్లింగ్ ...."

"యస్ హనీ "

"టెంపోని గోకడం మానేయ్!"

శివరాం తలాలున పైకి లేచాడు. లతని వదిలేసి లేచి నిలబడ్డాడు. సాలోచనగా సిగరెట్ వెలిగించాడు. తీక్ష ణంగా లతవేపు, కిందికి చూశాడు. లత కళ్ళు అతన్నే చూస్తున్నాయి. చిన్న గెడ్డం, చిన్న నోరూ, ఎర్రటి పెదవులూ శివరాంని రెచ్చగొడ్తున్నాయి.

"హనీ, ఒకసారి డిటెక్టివ్ టెంపో నన్ను—నా హృదయాన్ని, నా అహాన్ని రక్షించాడు. నేను ఇలా వాయిదాల పద్ధతిమీద అతని అహాన్ని, తెలివినీ గోకు తూనే వుంటాను!"

శివరాం వొంగి రిసీవర్ పైకెత్తాడు. లత మంచం మీంచీ గెంతేసింది. ఎడంచేత్తో అతని ఎడమ చేతిలోని

రిసీవర్ని లాక్కుంది....కిందికి వొంగి నంబర్ డయల్ చేసింది. క్షణంలో రిసీవర్ని శివరాం చేతిలోకి తోసింది.

నవ్వుతూ శివరాం రిసీవర్ని చెవికి ఆనించాడు. లత చేతులు లేత తీగల్లా, అతని చేతుల కిందుగా అతని చుట్టూ పెనవేసుకున్నాయి. చెంపని అతని ఛాతీమీద ఆన్చి, ఆమె అతని మొహంలోకి, పైకి చూసింది.

శివరాం చేతిలోని సిగరెట్ కిందికి జారింది. అతని చెయ్యి ప్రేమపాశంలా లత శరీరాన్ని అల్లుకుంది. ఆమె కళ్ళల్లోకే ప్రేమగా చూస్తూ శివరాం "డిటెక్టివ్ టెంపో?" అన్నాడు మౌత్ పీస్‌లోకి....

['శివరామ్ అడ్వెంచర్స్' సీరిస్‌లో ఇది ఏడవ నవల]

# సిద్ధేంద్రస్వామి భక్తులు

వసుంధర

ఓ చిన్న పెంకుటింటిముందు కారాపి దిగాను. ఇంటి ముందు పందిరి వుంది. ఇంట్లో వేడుక జరుగుతోంది. జగన్నాథం కూతురి కొడుక్కి బారసాల!

జగన్నాథం నాకు వరుసకు బాబాయవుతాడు. బాగా దూరపు బంధుత్వం. అయినప్పటికీ వాళ్లింట్లో జరిగే ప్రతి వేడుకకీ నన్ను పిలుస్తాడు. నామీద అభిమానంతో కాదు. నా దగ్గరున్న డబ్బు, పలుకుబడి ఎంతో కొంత తనకుపయోగపడతాయన్న ఆశ ఒకటీ, తనకున్న ఎన్నికైన బంధువుల్లో నేనొకణ్ని కాబట్టి నారాక ఆయన ప్రెస్టేజిని పెంచుతుందన్న నమ్మకం ఒకటీ— ఆయన్ను నన్ను వాళ్లింటికి తరచుగా పిలిచేలా చేస్తున్నాయి. కేవలం ఈ రెండు కారణాలేకాక—ముఖ్యమైన మూడో కారణం కూడా ఉండడంవల్ల ఆయన నన్ను విధిగా పిలుస్తాడు. అదేంటంటే నే నెప్పుడూ ఆయన ఆహ్వానాన్ని మన్నిస్తాను.

అందుక్కారణం అభిమానమని కొందరూ, వినయ గుణమని మరికొందరు చెప్పుకుంటారు. బంధు ప్రీతి ఎక్కువ అని చాలామంది నా గురించి అంటారు. కానీ అసలు కారణం వేరే వుంది.

నాకు నాకంటే బాగా తక్కువ హోదాలో ఉన్న బంధుమిత్రులంటే బాగా యిష్టం. అందుక్కారణం చాలా సింపుల్.

తిరుపతి వెళ్ళడానికి వెయ్యిరూపాయలు పోగుచేసే మధ్యతరగతి మనిషి ఊళ్ళో దేవుణ్ని చూడ్డానికి రిక్షా ఖర్చులక్కూడా యిష్టపడడు. కారణం డబ్బు! తిరుపతి దేవుడి దగ్గర డబ్బుంది. ఆ దేవుడి దగ్గరకు వెళ్ళినవారికి డబ్బొస్తుంది. కలియుగంలో మనిషి జీవితంలో ముఖ్య పాత్ర వహిస్తున్న డబ్బుకీ, ఆ దేవుడికీ అవినాభావ సంబంధముంది. ఆ దేవుణ్ని నమ్మినవారందరికీ ప్రయోజనం సిద్ధించిందనుకునేందుకూ లేదు. అదే నిజమైతే దేశంలో ఇన్ని కోట్లమంది అనాధులుండరు. తిండికి లేనివాళ్ళందరూ నాస్తికులు కారు కదా!

తిరుపతి దేవుణ్ని చూసిరావడంవల్ల భక్తుడి హోదా పెరుగుతుంది. అందుకే భక్తులా దేవుడికి అమిత గౌరవాన్నిస్తారు. ఆయన్ని గౌరవించడంలోనే తమకూ గౌరవముందని వారికి తెలుసు.

నా బంధువులకు నేను తిరుపతి దేవుడిలాంటివాణ్ని. నన్ను చూడ్డంలోనే, నాతో మాట్లాడ్డంలోనే వారి గౌరవం, హోదా ఉన్నాయని వారనుకుంటారు. ఆ భావనతో వారు నన్నమితంగా గౌరవిస్తారు. నన్ను ప్రత్యక్ష దైవంలా కొలుస్తారు.

ఊళ్ళో నాకున్న పలుకుబడి కారణంగా యెందరో

పెద్దవాళ్ళు నన్ను పిలుస్తూంటారు. నా అవసరాన్నీ, పిలిచినవారి ప్రాముఖ్యతనూ, వెళ్ళకపోవడంవల్ల వచ్చే అనర్థాలనూ అంచనావేసి కొందరి ఆహ్వానాలను మన్నిస్తూంటాను. నేను వెళ్ళినచోట పార్టీ ఘనంగా ఉంటుంది. కానీ అక్కడ పదిమందిలో నేనొకణ్ని. హాలో అంటే హాలో అంటారు. అక్కడ కొందరు నాకంటే కాస్త గొప్పవాళ్ళు. కొందరు నాకంటే కాస్త తక్కువవాళ్ళు. ఏమైనా అక్కడ నన్ను ప్రత్యేకంగా గౌరవించే వాళ్ళు లేరు.

బంధువు లిళ్ళలో అలా కాదు. అక్కడ నన్ను పదిమందినుంచీ వేరుచేసి ప్రత్యేకంగా పీటవేసి నన్ను గౌరవిస్తారు. అది నాకిష్టం!

జగన్నాథం ఇంట్లో అలాంటి ప్రత్యేక మర్యాద అందుకునేందుకే నేను విధిగా వెళతాను.

కారు దిగిన నా చేతిలో ఓ ప్రెజంటేషన్ ఉంది. దాని ఖరీదు నూటయాభైరూపాయలు. సాధారణంగా పెద్దవాళ్ళింటికి ప్రజంటేషన్ తీసుకుని వెళ్ళినపుడు కనీసం అయిదువందలు ఖర్చవుతుంది నాకు. సాధారణంగా వేలలో వుంటుంది. అయినా నా ప్రజంటేషన్ కక్కడ ప్రత్యేకత లభించదు. నా విలువ తగ్గిపోకుండా నా ప్రజంటేషన్ నన్ను కాపాడుతుంది.

ఇక్కడ నా ప్రజంటేషన్ ఖరీదు తక్కువైనా ప్రత్యేకతను సంతరించుకుంటుంది.

కారాగిన చప్పుడు విన్నట్టున్నాడు; జగన్నాథం పెద్దకొడుకు కొడుకు — ఎనిమిదేళ్ళవాడు — పరుగున అక్కడికి వచ్చాడు నాకు నమస్కరించి—"రండంకుల్! నాన్నగారు మీకోసం చూస్తున్నారు—" అన్నాడు.

ఇంట్లోకి వెళ్ళాను. మర్యాదలందుకున్నాను. భారసాల భోజనం చేశాను. నాకుత్సాహంగా ఉంది. అక్కడ ప్రతిఒక్కరూ నా వంక ఆరాధనాపూర్వకంగా చూస్తున్నారు. నేను జోక్ వేస్తే పడిపడి నవ్వుతున్నారు. నేనన్న ప్రతిమాటకూ అవునంటున్నారు. నేను కాదన్న ప్రతిమాటనూ వాళ్ళూ ఖండిస్తున్నారు.

కానీ ఈ ఉత్సాహం మధ్య తళుక్కున ఓ మెరుపు చూశాను. అప్పుడు కాసేపు నా బుర్ర పనిచేయలేదు.

నెమ్మదిగా ఆమె గురించిన వివరాలు సేకరించాను.

ఆమె పేరు వినీత. వయసు ఇరవై ఒకటి. మూడేళ్ళ క్రితం పెళ్ళయింది. రెండేళ్ళ క్రితం కాపురానికి వెళ్ళింది. ఆమె మూడుమాసాల గర్భిణిగా వుండగా యాక్సిడెంట్లో భర్త పోయాడు. అత్తమామలామె నింట్లోంచి పొమ్మన్నారు. ఆమె అన్నగారివద్దకు వెళ్ళింది. అన్నా వదినలామెకు పురుడుపోసి— ఇక నీదారి నువ్వు చూసుకో అన్నారు. ఆమెకెవ్వరూ లేరు. ఏదైనా ఉద్యోగం చూపించమని అన్నగారామెను జగన్నాథం ఇంట్లో దిగబెట్టాడు. ఆమె కొడుక్కిప్పుడు ఆరుమాసాలు.

"ఏం చదువుకుంది?"

"ఇంటర్మీడియేట్ ఫస్ట్ క్లాసులో ప్యాసయింది. కాపురానికి వెళ్ళేక తీరిక సమయంలో టైపు, షార్ట్ హ్యాండు కూడా నేర్చుకుంది....." అన్నాడు జగన్నాథం.

ఆమె వాళ్ళింటికి వచ్చి రెండ్రోజులయింది.

"సర్టిఫికెట్సుతో రేపు ఆఫీసుకు పంపించండి—" అన్నాను.

అంతా నా వంక ఆరాధనాపూర్వకంగా చూశారు.

# 2

వినీతకు మా కంపెనీలో ఉద్యోగం ఇచ్చాను. నెలకు ఎనిమిదివందలు జీతం. మా కంపెనీలో నెలకు అంత జీతం పుచ్చుకునే స్టెనో ఆమె మాత్రమే! ఆమెకు పని కూడా తక్కువ.

వినీత ఉద్యోగంలో చేరాక నేను జగన్నాథంగారింటికి ఆహ్వానం లేకుండా కూడా వెడుతున్నాను. వేడుకలు లేకపోయినా ఆమె కొడుక్కి బొమ్మలు కొనిపెడుతున్నాను. వినీత వాళ్ళింట్లోనే తనకో గది ప్రత్యేకించుకుని వుంటోంది. ఆమె తన వంట తను చేసుకుంటూ—జగన్నాథంగారికి నెలయ్యేసరికి కొంత అద్దె కూడా యిస్తోంది.

ఆ విధంగా ఆర్నెల్లు గడిచాయి.

ఒకరోజున వినీత నాతో ఇబ్బందిగా—"మీ అభిమానం మరిచిపోలేను. కానీ తరచుగా మా యింటికి రావద్దు. నలుగురూ తలోవిధంగా అనుకుంటున్నారు—" అంది.

"నువ్వేమీ అనుకోవడంలేదుగా—" అన్నాను.

వినీత తల అడ్డంగా ఊపింది.

"అయితే ఫరవాలేదు. నీ ప్రవర్తనను శాసించడమే తప్ప మరేవిధంగానూ నీకు సాయపడలేని ఆ నలుగురినీ నువ్వు పట్టించుకోకు—" అన్నాను.

"ఆడదాన్ని—అలా నాకు వీలుపడదు" అంది వినీత.

"ఆడదానిలా ప్రవర్తించు. వీలుపడుతుంది" అన్నాను.

వినీత తెల్లబోయి నావంక చూసింది.

"నేను నీకుద్యోగమిచ్చానని ఆఫీసులో అంతా అందుకేదో కారణంఅంటగడుతున్నారు. నా మంచి మనసును

వాళ్ళతోపాటు నా భార్య కూడా అపార్థం చేసుకుంది. కానీ నేను భయపడను. చెదరను ”

వినీత ఇంకా అలా తెల్లబోయి చూస్తోంది.

“మన చుట్టూ వున్న వాళ్ళు మనవు చెయ్యని నేరా న్నంటగడుతున్నారు. చేయని పాపభారాన్ని మన మెందుకు మోయాలి?” అన్నాను.

“అయితే ఏం చేయాలి?” అందామె అమాయకంగా.

“వాళ్ళ ఆరోపణల్ని నిజం చేద్దాం. మొండివాడు రాజుకన్నా బలవంతుడు. అప్పుడు వాళ్ళు మనని ఏమీ చేయలేరు....”

“మీరు దేవుడువంటివారని జగన్నాథంగారు చెప్పారు. అంతా యేమనుకున్నా ఫరవాలేదు. మీరు మాత్రం పాపపుటాలోచనల్ని మీలోకి రానివ్వకండి. ఇంతవరకూ పెడదారులు తొక్కని మీ బుద్ధి నా కారణంగా చెడిపోతే—నేను పాపిష్టిదాన్నని నన్ను నేనే నిందించుకోవలసి వస్తుంది—” అంది వినీత.

ఆమె నాకు మెత్తగా బుద్ధి చెప్పాలని చూసింది. తను పవిత్రంగా వుంటూ ఉద్యోగం నిలబెట్టుకోవాలని చూసింది.

కానీ ఆమె బలహీనతలు నాకు తెలుసు. లేకుంటే వ్యాపారంలో ఇంత పైకి రాలేనుకదా!

నేనామెను సామదానభేద దండోపాయాలతో లోబర్చుకోవాలని చూశాను. కానీ ఆమె సామాన్యురాలు కాదు.

మంచి మాటలకు మంచిగానే సమాధానమిచ్చింది. ఆశపెడితే రవంత కూడా ప్రలోభ పడలేదు. తనకి బ్రతుకు చాలంది.

మగాడికి అందిన ఆడపిల్ల పురుగుతో సమానం. అందని ఆడపిల్ల చందమామ. ఆ చందమామను నేలకు దింపాలని నా విశ్వప్రయత్నం.

వినీతకు నా కంపెనీలోనే పనిచేయాలని వుంది. ఇక్కడున్న సదుపాయాలు, జీతం మరెక్కడా లభించవు. పైగా నేను జగన్నాథంగారికి భయపడతానని ఆమె నమ్మకం. మరోచోట ఆమెకలాంటి రక్షణలేదు.

వినీత నన్ను తప్పు అంచనా వేసింది.

ఒకరోజున నేనామెతో — "నువ్వు వైభవంగా జీవించు. నీ కొడుకును గొప్పవాణ్ణి చేయి. అంతేగాని అర్థంలేని విలువలకు పోయి నీ కొడుకును నీ అంత సామాన్యంగా వుంచకు...." అన్నాను.

ఆమె ఎప్పటిలాగే నవ్వి—"మీరు నన్ను పరీక్షిస్తున్నారు. మీరు నిప్పులాంటి మనిషని జగన్నాథంగారు చెప్పారు—" అంది.

అది ఆమె తరచుగా నామీద వాడే అస్త్రం.

ఈసారి నేను ఆ అస్త్రానికి లొంగకుండా—"నువ్వు నా ఒడిలో వాలినా జగన్నాథంగారు నా గురించలాగే అంటారు—" అన్నాను.

వినీత తడబడింది. ఆమె చూపులనుబట్టి కొత్త అస్త్రం గురించి ఆలోచిస్తోందని అర్థమయింది.

నేను వెంటనే—"వినీతా! అనవసరంగా నీ తెలివిని తప్పుదారికి మళ్ళించకు. జీవితం నీటిబుడగలా అశాశ్వతమైనది. నీ నీతి నీ జీవితాన్ని కష్టాలలో నింపుతుంది తప్ప మరెందుకూ పనికిరాదు. బ్రతికినంతకాలం సుఖంగా జీవించు. ప్రపంచంలో రాముడొక్కడే నీతిగానూ జీవించలేదు, రావణుడొక్కడే దుర్మార్గానికి ఒడిగట్టనూ

లేదు. సమాజంలో ప్రముఖ స్థానాల్లో ఉన్నవాళ్ళు చేసే పనులకు ప్రచారం లభించి వారు చరిత్రలో కలకాలం వుండిపోతారు. వారి గురించి జరిగే ప్రచారమంతా నిజమనుకునేటందుకూ లేదు. ప్రచారం చేసేవాడి అభిరుచి, శక్తిసామర్థ్యాలను బట్టి మనిషి తప్పొప్పులు నిర్ణయించబడతాయి. ఈ ప్రపంచంలో యెందరో రాముళ్ళు, రావణులు ప్రచారంలేక మరుగునపడి వుండిపోయారు. కాబట్టి ఆదర్శాలను నమ్మకు. నా మాట విను. నన్ను కాదనకు...." అన్నాను.

"నా ఆదర్శం చరిత్రలో పేరు తెచ్చుకుందుక్కాదు. నా తృప్తికోసం. కొందరికి రోజూ రసగుల్లాలు తింటే తృప్తిగా వుంటుంది—" అంది వినీత.

"అయితే ఈ రోజు ఇంటికి వెళ్ళు. ఏం జరిగిందో తెలుసుకో. ఆ తర్వాత కూడా కావాలనుకుంటే ఆదర్శాలను నమ్ముకువుగాని—" అన్నాను.

వినీత రవంత కూడా కలవరపడలేదు. నేనాశ్చర్యపడి "ఏం జరిగిందని నన్నడగవేం?" అన్నాను.

"నేను సిద్ధేంద్రస్వామి భక్తురాలిని. నేను మనుషులకు భయపడను—" అంది వినీత.

సిద్ధేంద్రస్వామి పేరు విన్నాను నేను. ఆయన ప్రత్యక్ష దైవం. ఆయన భక్తుల్లో యెందరో గొప్పవాళ్ళున్నారు. ప్రజల మనసులు క్షాళనం చేసి—సమాజంలో పవిత్రతను నింపడానికి కంకణం కట్టుకున్న యోగి ఆయన. ఆయన గాలిలో ఎగురగలడు. నీటిపై తేలగలడు. శూన్యంలోంచి వస్తువులను సృష్టించగలడు. ఆయనకు మనదేశంలోనే కాక విదేశాల్లో కూడా పేరుంది.

ఒకవిధంగా నేను నాస్తికుణ్ని. వ్యాపారావసరాల

కోసం నా భావాలను నేను ధైర్యంగా ప్రకటించలేక పోయినా — నాకు దేవుడన్నా, ప్రత్యక్ష దైవాలన్నా నమ్మకం లేదు.

వినీత సిద్ధేంద్రస్వామి భక్తురాలని తెలిసి ఆశ్చర్యపడి ఆమె నా స్వామి గురించి మరికొన్ని వివరాలడిగాను.

వినీత భర్త సిద్ధేంద్రస్వామి భక్తుడు. ఆయన కారణంగానే వినీత సిద్ధేంద్రస్వామికి భక్తురాలయింది. వినీత భర్త ఉద్యోగరీత్యా యేదో పెద్ద తప్పుచేశాడు. ఆ తప్పు కారణంగా కొన్ని వందల కుటుంబాలకు ఆధారం లేకుండా పోయింది. అందుకాయనెంతో బాధపడి సిద్ధేంద్రస్వామి దర్శనం చేసుకున్నాడు. స్వామి ఆయనకు "నీ తప్పు నిన్ను అల్పాయుష్కుణ్ని చేస్తుంది. ఒక యేడాదిపాటు జాగ్రత్తగా వుండు. ఏడాది గడిస్తే భగవంతుడు నీ తప్పు క్షమించినట్లే!" అని చెప్పాడు. ఏడాది తిరక్కుండానే వినీత భర్త పోయాడు.

ఒక్కసారి మాత్రం వినీతకు స్వామిదర్శనమయింది. కాపురం పెట్టినకొత్తలో భర్త ఆమెను దీవెనలకై స్వామి ఆశ్రమానికి తీసుకుని వెళ్ళాడు. అప్పుడు స్వామి ఆమెతో "హిందూనారీ ధర్మం మన కట్టూ బొట్టులో లేదు. త్రికరణశుద్ధిగా పవిత్రతను నమ్మడంలో వుంది. ఎన్ని అడ్డంకులు వచ్చినా నీ పవిత్రతను కాపాడుకో. నా దీవెనలు నీకెప్పుడూ వుంటాయి. భగవంతుడు నిన్ను రక్షిస్తాడు...." అని చెప్పాడు.

వినీత గుడ్డినమ్మకంతో ఆదర్శాలననుసరిస్తోందంటే అందుకు సిద్ధేంద్రస్వామి కారణం!

ఆమె మాటలు విని నాలో నేను నవ్వుకున్నాను. ఈ రోజు వినీత నాకు లొంగక తప్పదు.

జగన్నాథంగారింటికి డాక్టర్ వీరభద్రరావు వెళ్లాడు. నేను పంపగా! ఎన్నో వ్యవహారాల్లో నేను, ఈ డాక్టరు తోడు దొంగలం!

డాక్టర్ వీరభద్రరావు జగన్నాథాన్ని కలుసుకుని-"నాకు వినీత ఫోన్ చేసింది. బిడ్డ ఆరోగ్యం బాగుండడం లేదుట...." అంటాడు. తర్వాత బిడ్డను పరీక్షించి—"కేసులో కాంప్లికేషన్సున్నాయి. నర్సింగ్ హోంకు తీసుకుని వెడతాను—" అంటాడు.

వినీత కొడుకు నర్సింగ్ హోం చేరుకుంటాడు. బిడ్డ తిరిగి తల్లిని చేరుకోవాలంటే షరతు నాది!

నా షరతు వినీతకు తెలుసు!

వినీత తన బిడ్డ ప్రాణాలతో ఆడుకోగలదా?

## 3

మర్నాడు వినీత మామూలుగా ఆఫీసుకు వచ్చింది. తన సీట్లోకి వెళ్ళి కూర్చుని పని ప్రారంభించింది.

నేనామెను నా గదిలోకి పిలిచాను....వచ్చింది.

"ఇంటి దగ్గర విశేషాలేమిటి?" అన్నాను.

"మీకు చాలా థాంక్స్. బాబుకు వంట్లో బాగో లేదని వెంటనే నర్సింగ్ హోంకు పంపించారు—" అందామె.

"ఎలా వున్నాడో వెళ్ళి చూశావా?"

"డాక్టర్ వీరభద్రరావుగారు వీల్లేదన్నారు. కొన్నాళ్ళపాటు తల్లి బిడ్డను దూరంగా వుండడమే బిడ్డకు క్షేమమన్నారు...."

"ఎన్నాళ్ళో అడిగావా?"

"అడిగాను...."

నేను నవ్వి—"ఆయన నీకు చెప్పలేదు, ఎందుకంటే

నేనాయనకు చెప్పలేదు కాబట్టి ...." అన్నాను.

వినీత ఆశ్చర్యపడుతుందనుకున్నాను. కానీ నిర్లిప్తంగా నవ్వింది. ఆ నవ్వులోనే నా ప్రశ్నలకు సమాధానా లున్నాయి.

నేను వినీత చేయిపట్టుకుని—"వినీతా! తల్లీ బిడ్డల్ని యెక్కువ కాలం విడదీయడం నాకిష్టముండదు....మరి నువ్వు నన్ను కాదనకు...." అన్నాడు.

వినీత నా వంక తీవ్రంగా చూసి—"చేయి వదలండి" అంది.

నేనామె చేయి మరింత గట్టిగా పట్టుకుని-"వదలను-" అన్నాను.

"వదలండి—" అందామె మళ్ళీ.

"వదలండి అనే బదులు నీవే విదిలించుకోవచ్చుగా- నాకు తెలుసు. నీకిష్టమే!" అన్నాను.

"రావణాసురుడిని సీత ఆపలేదు. తన క్షేమంకోరిన వాడైతే రావణుడే ఆమె అనుమతికోసం ఆగాడు...."

"ఆమె సీత. సాక్షాత్తూ శ్రీరామచంద్రుడి భార్య."

"నేను వినీతను. సాక్షాత్తూ సిద్ధేంద్రస్వామి భక్తురాల్ని...."

చటుక్కున ఆమె చేయి వదిలి—"నీ కొడుకు నీ యింటికి క్షేమంగా తిరిగిరావాలని లేదా?" అన్నాను.

"ఉంది. కానీ అందుకు మీమీద ఆధారపడను...." అందామె.

"మరెవరున్నారు నీకు?"

"సిద్ధేంద్రస్వామి! ఆయన తల్చుకుంటే ఆకాశం నేల కూలుతుంది. సముద్రాలు పొంగుతాయి. మీ వంటివారు సర్వనాశనమైపోతారు....

కోపంలో కూడా ఆమె యెంతో అందంగా వుంది. ఇంకా చెప్పాలంటే కోపంలో ఆమె అందం పెరిగింది.

"సిద్ధేంద్రస్వామి నిన్నెలా ఆదుకుంటాడో చూస్తాను. ఈ క్షణంలోనే నేను నిన్ను లోబర్చుకుంటాను...."

ఆమె నా వంక చూసింది. నా కళ్ళలో దృఢ నిశ్చయాన్ని కనిపెట్టిందో ఏమో—"నేను పవిత్రతను నమ్ముకున్నాను. నా పవిత్రత నిలబడినంత కాలమే జీవిస్తాను" అంది.

"అంటే?"

"నర్సింగ్ హోంలో మీరు నా బాబును చంపేయండి. బయట నేను ఆత్మహత్య చేసుకుంటాను...."

ఉలిక్కిపడి ఆమె వంక చూశాను.

ఆమె నన్ను బెదిరిస్తోంది. మనిషి చాలా ప్రశాంతంగా వుంది.

"నీ బిడ్డపోయి, నువ్వాత్మహత్య చేసుకుంటే ఆ సిద్ధేంద్రస్వామి ఏమి చేసినట్లు? ఆయన్ను మర్చిపోయి నన్ను నమ్ముకో. మీరిద్దరూ సుఖంగా బ్రతికే మార్గం యేర్పాటు చేస్తాను...."

"నా మనసు కేది నచ్చితే, ఏది తోస్తే అది సిద్ధేంద్ర స్వామి ఆశయం. ఈ ప్రపంచంలో యెవరు బ్రతికినా ఆయన శాసనంమీదనే! అవకాశముండీ ఇంతకాలం మీరు నాపై బలప్రయోగం చేయలేదంటే అంతా ఆయన మహిమ...."

ఆమె మాటలు వినగానే అట్నించి నరుక్కురావాలనిపించింది.

"నువ్వెంతగా నిరాకరించినా నాకు నీమీద మోజు పోవడంలేదు. అది కూడా సిద్ధేంద్రస్వామి ఆశయమే!"

అన్నాను.

"రావణాసురుడు యెన్నో పాపాలు చేశాడు. ఆ పాపాలు భగవంతుడి ఆదేశమూకాదు, ఆశయమూకాదు. సృష్టిలో ఏదో వికటించి అటువంటి దుర్మార్గులు అవతరిస్తూండడం జరుగుతుంది. ఆ పాపాలు పండేరోజున పాపాత్ముడు భగవంతుడి జోలికి వెడతాడు. రావణుడు సీత సత్తువని పోయాడు. మీరు నన్ను బలాత్కారం చేయాలనుకుంటున్నారు. వినాశకాలే విపరీత బుద్ధీ...."

"అయితే?"

"ఏదో జరుగుతుంది మీకు" అంది వినీత.

"ఎప్పుడు?"

"మీరు నన్ను బలాత్కారం చేసేలోగా........"

నమ్మకం ఆమె కళ్ళలో చూశాను....అప్పటి కామె జోలికి వెళ్ళలేదు.

# 4

ఆరోజు సాయంత్రం ఇంటికి వెళ్లేసరికి నాభార్య శ్రీదేవి చాలా కంగారుగా వుంది.

"ఏం జరిగింది?" అన్నాను.

ఆమె మౌనంగా నాకో ఉత్తరం అందించింది.

"డియర్ శ్రీదేవీ!

డియర్ అన్నానని కంగారు పడకు. నేను నీభర్తలా దుష్టుణ్ని కాదు. నీకు అన్నవంటివాణ్ని. ఇటీవల నీ భర్త దురాగతాలు పెచ్చుమీరాయి. తనది కానిదాన్ని తనదిచేసుకోవాలన్న తాపత్రయం ఎక్కువయింది. తప్పులు చేసిన ప్రతివాడికీ శిక్ష తప్పదు. నీభర్త తప్పిలాగే కొనసాగితే అతడికి మరణశిక్ష తప్పదు. నీమాంగ

ల్యాన్ని కాపాడుకునేందుకు అతణ్ని హెచ్చరించు. అందుకే ఈ ఉత్తరం.........

నీ

అన్నయ్య....."

ఉత్తరం చదువుకుని కంగారుపడ్డాను.

అన్నయ్య ఎవరో వెంటనే తెలిసిపోయింది నాకు.

ఒక స్మగ్లింగ్ ఆపరేషన్లో అతడు, నేను ప్రత్యర్థులం. వరుసగా రెండుసార్లు అతడు నా చేతిలో దెబ్బతిన్నాడు. రెండుసార్లూ అతడి నష్టం తడవకు నాలుగులక్షలు. అతడి నష్టమే నాకు లాభం.

రెండోసారి కూడా నష్టపోయేక అతడు నన్ను హెచ్చరించాడు—"నువ్వు కాలనాగుతో ఆడుకుంటున్నావు. పులిమీసాలు లాగుతున్నావు. ఫలితం ఘోరంగా ఉంటుంది. ఇంతవరకూ చేసిన తప్పులు క్షమించాను. ఇక ముందు చేసే తప్పులు క్షమించను........"

ప్రత్యర్థిగా అతణ్ని చూడడమే తప్ప అతడెవరో నాకు తెలియదు. నేనతణ్ని—"నువ్వెవరు?" అనడిగాను.

"నీ భార్యను డియర్ అని పిలిచే చనువుంది నాకు. నే నామెకు అన్నయ్యని—" అన్నాడతడు. ఆ మాటలు బాగా గుర్తుండిపోయాయి నాకు.

నాభార్యకు తమ్ముళ్ళే కానీ అన్నయ్యలులేరు. దగ్గర, దూరపు బంధువుల్లో నాకు తెలిసి ఆమెను చెల్లీ అని పిలిచేటంత చనువుగల వ్యక్తులు లేరు. శ్రీదేవి నడిగితే ఆ విషయం కన్ఫర్మ్ చేసింది.

"మీరు నిజంగా దుర్మార్గాలు చేస్తున్నారా?" అంది శ్రీదేవి.

ఉత్తరం మడిచి—"లేదు...." అన్నాను.

"చేస్తే మానేయండి........"

"శ్రీదేవి! ఈ ఉత్తరం రాసిందొక దుర్మార్గుడు. నేను చేసే మంచి పనులు నచ్చక ఇలా ఉత్తరం రాశాడు...."

"అతరెవరో మీకు తెలుసా?"

"తెలియదు....కానీ తెలుసుకోగలను...."

శ్రీదేవికి నానుంచి ఇంకా తెలుసుకోవాలని ఉంది. నాకు మాత్రం ఆమెతో మాట్లాడాలని లేదు. వెంటనే ప్రదీప్ కు ఫోన్ చేశాను.

కాసేపట్లో ప్రదీప్ మాయింటికొచ్చాడు. ఇద్దరం ఓ గదిలో దూరి తలుపులు వేసుకున్నాం.

ప్రదీక్ నా అంతరంగిక గూఢచారి. అతడి కూళ్ళో అన్నిరకాల సమాచారమూ తెలుసు. సమాచారాన్ని సేకరించి ఉంచుకోవడం అతడి హాబీ. పోలీసులకీ, పత్రికలవాళ్ళకీ కూడా తెలియని ఎంతో రహస్యసమాచారం అతడివద్ద ఉంటుంది.

"ఏమిటి విశేషం?" అన్నాడు ప్రదీప్.

"శ్రీదేవి అన్నయ్య ఉత్తరం రాశాడు ..." అంటూ ఉత్తరం అతడి కందించాను. ప్రదీప్ ఉత్తరం చదవసాగాడు.

శ్రీదేవి అన్నయ్య గురించి ప్రదీప్ కు ముందే చెప్పాను. ప్రదీప్ అతడి గురించి నాకు కొంత సమాచారం అందజేశాడు.

అతడు చాలా చాలా ప్రమాదకరమైన వ్యక్తి. రూపాలు మారుస్తాడు. పేర్లు మారుస్తాడు. రాజకీయంగా అతడికి చాలా పలుకుబడి ఉంది. అతడు నేరాలు

చేయడు. చేయిస్తాడు.

ప్రదీప్ నా కతడి పేరు మాత్రం చెప్పలేదు.

"అతడి పేరు నీకు అనవసరం. అతడి విషయంలో నీవు జాగ్రత్తగా ఉండడం అవసరం—" అన్నాడు ప్రదీప్.

"జాగ్రత్తగా ఉండడానికి నేనేం చేయాలి?"

"ఏం చేయాలి? కొన్నాళ్ళపాటు స్మగ్లింగ్ ఆపరేషన్సుకు దూరంగా ఉండు. అయినా నీకు స్మగ్లింగుతో పనేముంది? అది నీ ఫీల్డు కాదుకదా!"

అది నిజమే! ఊరికే రెండులక్షల వాటా వస్తోందని ఒక మిత్రుడు కోరితే అంగీకరించాను. ఆ మిత్రుడి పేరు నేను చెప్పకపోయినా ప్రదీప్ తెలుసుకున్నాడు. ప్రదీప్‌కు తెలియని దేముంటుంది?

"నీ మిత్రుడు—ఆ అన్నయ్యకు శత్రువు. అతణ్ని స్వయంగా ఎదుర్కోడానికి భయపడి—నిన్నిందులో ఇరికించాడు........"

నేను ప్రదీప్ మాటలు లెక్కచేయలేదు. ప్రస్తుతం మరో స్మగ్లింగ్ ఆపరేషన్‌లో ఉన్నాను. ఇందులో నా వాటా మూడు లక్షలు.

ఇప్పుడీ ఉత్తరం వచ్చింది.

"ఆ అన్నయ్య మరణశిక్ష గురించి వ్రాశాడంటే నీకు చావు తప్పదు...." అన్నాడు ప్రదీప్ ఉత్తరం చదివేక.

"నా ప్రాణాలు తీయడం అంత తేలిక కాదు..."

"నీకు నిరంజన్ తెలుసా?" అన్నాడు ప్రదీప్.

"తెలియదు...."

"అప్సరా థియేటర్ వెనుక మూడంతస్థుల మేడ ఉంది. అది తెలుసా?"

"తెలుసు...."

"ఆ మేడ నిరంజన్‌ది...."

"అయితే?"

ప్రదీప్ నవ్వి—"థియేటర్ పరమానంద కూడా అతడిదే! మనూళ్ళో ఉన్నవాటిలోకల్లా అత్యాధునికం అది....?" అన్నాడు.

"కానీ నిరంజన్ పేరు నేనెక్కడా వినలేదే?" అన్నాను.

"ఇంకావిను.... ఈవూళ్ళో నిరంజన్‌కు రెండుహోటళ్లు, ఓ పెద్ద మార్కెట్ కాంప్లెక్స్ ఉన్నాయి...."

"ఇదంతా ఎందుకు చెబుతున్నట్లు?" అన్నాను చిరాగ్గా.

"ఇంతకీ నిరంజన్ ఎవరో తెలుసా?"

"ఎవరు?"

"జిల్లా పరిషత్తు స్కూల్లో అటెండరు...."

"ఆశ్చర్యం....అలా ప్రారంభించాడన్నమాట జీవితం...."

"ప్రారంభించడం కాదు....ఇప్పటికీ అతడక్కడ అటెండరే! అతడు తనకుతాను సామాన్యమైన పెంకుటింట్లో జీవిస్తున్నాడు...."

"నాకేమీ అర్థం కావడంలేదు...."

"ఒక్కమాటలో చెబితే నీకర్థంకాదు, అందుకే ఇంతలా వివరించాను. ఉదాహరణకు కొందరుద్యోగాలు చేస్తూ కథలు రాసి డబ్బుసంపాదిస్తారు. కొందరు వ్యాపారం చేస్తూ స్మగ్లింగులోకి దిగి డబ్బుసంపాదిస్తారు కొందరు రాజకీయనాయకులై ప్రజల జీవితాలతో వ్యాపారం చేస్తారు. అలా కొందరు—...." ఆగాడు

ప్రదీప్.

"ఊఁ చెప్పు..."

"ఒక్క మాటలో చెప్పాలంటే—నిరంజన్ ప్రొఫెషనల్ మర్డరర్...."

ఆశ్చర్యంతో నాకు నోటమాటరాలేదు.

"అతడి సంపాదనంతా హాబీమీద సంపాదించిందే! హత్యలు చేయడంలో అతడి కెదురులేదు...."

"నువ్వు నిజమే చెబుతున్నావా?"

"నిజం తప్ప మరొకటి చెప్పాల్సిన అవసరం నాకేముంది? నేను నీ స్నేహితుణ్ని!"

"ఇంతకీ ఇప్పుడా నిరంజన్ ప్రసక్తి ఎందుకు?"

"నేను నీకెలాంటి స్నేహితుడినో—ఆ అన్నయ్యకు నిరంజన్ అలాంటి స్నేహితుడు...."

అర్థమవుతోంది నాకు. అయినా — "అయితే?" అన్నాను.

"నిరంజన్ నిన్ను చంపాలనుకుంటే ఆ భగవంతుడు కూడా నిన్ను రక్షించలేడు. అంతే!"

"ఇప్పుడు నన్నేం చేయమంటావు?"

"నా మాట విని—నీ స్మగ్లింగ్ ఆపరేషన్ మానుకో. అన్నయ్యతో శత్రుత్వం పెట్టుకోకు...."

"డబ్బు సంపాదించేవాడిలో భయాన్ని ప్రవేశపెడుతున్నావు...."

"భయపడితే నీ డబ్బు నిన్ను సుఖపెడుతుంది. ఆశ పెరిగితే నీడబ్బే నిన్ను చంపుతుంది...."

"ఈరోజు—ఆ అన్నయ్య బెదిరించాడు. రేపింకొకడు నన్ను వ్యాపారం మానేయమని బెదిరించవచ్చు" అన్నాను.

"నాకు తెలిసింది నీకు చెప్పగలను. నా అనుభవంలో నీకు సలహా యివ్వగలను. నేను నిన్ను శాసించలేను...." అన్నాడు ప్రదీప్.

## 5

నేను వెళ్లేసరికి నిరంజన్ ఇంట్లోనే ఉన్నాడు. అతణ్ని చూసి ఆశ్చర్యపోయాను.

అతడి ఎత్తు అయిదడుగుల మూడంగుళాలు. మనిషిని చూడగానే యాభై కేజీలైనా ఉంటాడా అనిపిస్తుంది. సన్నగా ఉన్నాడు. పరీక్షించిచూస్తే తప్ప వయసున్న వాడనిపించదు.

అతణ్ని ప్రొఫెషనల్ మర్డరర్ అంటే నమ్మడం కష్టం.

ఇల్లుకూడా చాలా సింపుల్ గా ఉంది.

డ్రాయింగ్ రూంలో కుర్చీలుకూడా లేవు. అతడు నా కోసం చాప వేశాడు.

ఇద్దరం చాపమీద ఒకరికొకరు ఎదురుగా కూర్చున్నాం.

"పాలు పుచ్చుకుంటారా?" అన్నాడతడు.

నేను తల అడ్డంగా ఊపాను.

"మా యింట్లో కాఫీ, టీలు నిషిద్ధం...." అన్నాడు నిరంజన్.

నేను మరోసారి ఆశ్చర్యపడి—"ఈరోజుల్లో ఇలాంటి వారు అరుదు—" అన్నాను.

"అదంత అరుదైన విశేషమేంకాదు. మీరు వచ్చిన పని చెప్పండి" అన్నాడు నిరంజన్.

"మిమ్మల్ని చూసేక నేను వచ్చినపని చెప్పడానికి సందేహిస్తున్నాను" అన్నాను.

నిరంజన్ గంభీరంగా—"మీరు చంపమనే వ్యక్తి నా స్నేహితుడు కాకుండా ఉంటే చాలు....ఇంకే షరతులూ లేవు. ఎటొచ్చీ నా రేటు చాలా ఎక్కువ. నడిరోడ్డుమీద నిస్సహాయుడై తిరిగే బిచ్చగాణ్ని చంపడానికే నేను పాతిక వేలు తక్కువ పుచ్చుకోను—" అన్నాడు.

"మీరు హత్యలు చేస్తారా? మిమ్మల్ని చూస్తే అలా కనిపించదు" అన్నానేమీ ఎరుగనట్లు.

"నన్ను హత్యలు చేయమని పురమాయించేవాళ్ళను చూసినా మీ కలాగనిపించదు. ఎందుకంటే వాళ్ళలో చాలామంది మన నాయకులు...."

"మీరు మరీ ఓపెన్‌గా మాట్లాడుతున్నారు. పట్టుబడతారన్న భయం లేదా?" అన్నాను.

"నేను సిద్ధేంద్రస్వామి భక్తుణ్ని. నన్నెవ్వరూ ఏమీ చేయలేరు...." అన్నాడు నిరంజన్.

ఉలిక్కిపడ్డాను. సిద్ధేంద్రస్వామి భక్తుడు హంతకుడా? అందులోనూ కిరాయి హంతకుడు....

"ఆశ్చర్యంగా ఉంది. సిద్ధేంద్రస్వామి అవతార పురుషుడు. ఆయన్ని నమ్మిన మీరు హత్యలెలా చేయగల్గుతున్నారు?"

నిరంజన్ నవ్వి—"భగవంతుడు హత్యలు చేయడనీ, చేయించడనీ మీ నమ్మకమైతే అది మార్చుకోండి. అగ్నిపర్వతాలు బద్దలైనా, సముద్రాలు పొంగినా, క్షామం తలెత్తినా, యుద్ధాలు చెలరేగినా భగవంతుడి ఆదేశమే అందుకు కారణం. హత్యలు చేయడానికి భగవంతుడొకోసారి ప్రకృతిశక్తులనీ, ఒకసారి మనుష్యశక్తినీ నిర్దేశిస్తాడు. రెండోది జరిగినప్పుడు నావంటివారు హత్యలు

చేస్తారు—" అన్నాను.

"అయితే హంతకులందరూ భగవంతుడి అనుచరులనా మీ ఉద్దేశ్యం?"

"కాదు. భగవంతుని ఆదేశం లేకుండా హత్యలు చేసినవారు పట్టుబడి శిక్షకు పాత్రులవుతారు. నాలాంటి వారు పట్టుబడకుండా మేడలు కడతారు. సంపదలు పెంచుకుంటారు...."

"ఒకవిధంగా మీరూ శిక్ష అనుభవిస్తున్నారేమో! అంతులేని సంపదలకు వారసులయ్యుండీకూడా మీరు సామాన్యంగా జీవిస్తున్నారు...." అన్నాను.

"నాకు సంపదలమీదా, విలాసాలమీదా మోజు లేదు. మానసికంగా ఏనాడో సన్యాసిని. నా జీవితం నాకు నచ్చింది...."

"అయితే మీరు హత్యలెందుకు చేస్తున్నట్లు?"

"ఆరంభంలో ఆత్మరక్షణకు హత్య చేశాను. నన్ను నేను కాపాడుకు నేందుకో పెద్దమనిషి నాశ్రయిస్తే ఆయన నా చేత మరిన్ని హత్యలు చేయించాలనుకున్నాడు. అప్పుడు నేను సిద్ధేంద్రస్వామి భక్తుడి నయ్యాను. స్వామి నా పాపాలు క్షాళనం చేశాడు. మనసును పవిత్రం చేశాడు. హత్యలుచేసి సమాజంలో పెద్దమనుషులందర్నీ కాపాడమని ఆదేశించాడు. నేనేపాపంచేసినా అది తనదేననీ నన్నంటదనీ భరోసా యిచ్చాడు. హత్యలు నాకోసం కాక భగవంతునికోసం చేస్తున్నాను కాబట్టి ప్రతిఫలం నన్నుభవించవద్దన్నాడు. హత్యల కారణంగా నేను సంపాదించిన డబ్బు నేననుభవించిననాడు—హత్యలు పాపాలై నన్ను వేధిస్తాయి. అందుకే నేనిలా సామాన్యంగా జీవిస్తున్నాను...."

"అయితే ఆ డబ్బంతా ఎవరనుభవిస్తున్నారు?"

"నాకు నలుగురు కూతుళ్ళున్నారు. అయిదుగురు కొడుకులున్నారు. అందరూ పిల్లాపాపలతో సుఖంగా ఉంటున్నారు. నాసంపదను వారనుభవిస్తున్నారు...."

"మీ ఆస్తిని మీరనుభవిస్తేనేం—మీ పిల్లలనుభవిస్తేనేం—ఒకటేకదా!" అన్నానాశ్చర్యంగా.

"నేను మానసికంగా సన్యాసిని. నాబిడ్డలకు నాఆస్తి పాస్తులిచ్చి ఉండవచ్చు. కానీ మానసికంగా వారికీ నాకూ ఏ సంబంధమూ లేదు. తాళికట్టాను కాబట్టి నా భార్య నాతో ఉండవచ్చు. కానీ మానసికంగా ఆమె నాకు శిష్యురాలు మాత్రమే!"

"చాలా చిత్రంగా ఉంది...." అన్నాను.

"ఇందులో చిత్రామేమీలేదు. ఇలా ఇప్పుడు చాలా మంది చేస్తున్నారు. ఎందరిలోనో నేనొకణ్ని. నాకు సిద్ధేంద్రస్వామి దీవెనలున్నాయి...."

నేను నిరంజన్‌వంక పరీక్షగా చూశాను. అతడు నిజంగా సన్యాసి అనిపించింది. అతడి ముఖంలో ఎటువంటి భావాలులేవు.

కాసేపు మామధ్య మౌనం రాజ్యమేలింది. నిశ్శబ్దాన్ని నిరంజనే ఛేదించి—"మీరు వచ్చిన పని చెప్పలేదు"— అన్నాడు.

నేను చటుక్కున—"నాప్రాణాలు ప్రమాదంలో ఉన్నాయి. మీరే రక్షించాలి—" అన్నాను.

నిరంజన్ చిత్రంగా నావంక చూసి నా వివరాలడిగాడు. అతడికి నేను నాగురించి చెప్పుకున్నాను.

"మీకు ప్రాణభయం మెందుకు?" అన్నా డత డాశ్చర్యంగా.

"ఇటీవల నేనో స్మగ్లింగ్ వ్యవహారంలో దిగాను. అందులో నా ప్రత్యర్థి నా ప్రాణాలు తీస్తానని బెదిరిస్తున్నాడు...."

"స్మగ్లింగ్ లోకి దిగేక అలాంటివి తప్పవు...."

"అవును. నా ప్రత్యర్థి నాకంటే బలవంతుడు కాదు కానీ ప్రమాదకరమైన మనిషి. అందుకే అతడికి నేను భయపడుతున్నాను...."

"ఎవరతను?"

"అతడి పేరు నాకు తెలియదు. కానీ అతడి గురించిన వివరాలు చెప్పగలను—" అంటూ నా శ్రీమతి శ్రీదేవికి అన్నయ్య నంటూ ఉత్తరం రాసినరాసినవాడి విశేషాలు చెప్పాను. నా స్మగ్లింగు ఆపరేషన్ గురించి కూడా చెప్పాను.

"అతడు నాకు తెలుసు...." అన్నాడు నిరంజన్.

"అతణ్ని చంపగలరా?"

నిరంజన్ గంభీరంగా — "అతడు నా స్నేహితుడు. నా స్నేహితులను నేను చంపను...." అన్నాడు.

అతడి గొంతులోని ధ్వని అతడి నిర్ణయమెంత కఠోరమైనదో తెలియజెప్పింది నాకు. నేను కాసేపు మౌనంగా ఉండిపోయాను.

నిరంజన్ నావంకనే చూస్తున్నాడు.

"కానీ - అతణ్ని చంపొద్దు. కానీ అతడు నన్ను చంపమంటే అంగీకరించకూడదు "

"ఎందుకని?"

"నా ప్రాణాలు రక్షించుకునేందుకు...." అనినవ్వాను.

"నేను కాకపోతే అతడికి మరో హంతకుడు దొర

కదా?"

"దొరకొచ్చు. కానీ అందరు హంతకులూ సిద్ధేంద్ర స్వామి భక్తులు కారుకదా! మీరుతప్ప ఇంకెవరైనా అయితే—నా ప్రాణాలు నేను రక్షించుకోగలను...."

నిరంజన్ ఆలోచనలో పడ్డాడు.

"నా ప్రాణాలు రక్షించినందుకు మీరు కోరిన డబ్బిస్తాను. మీరు చేయవలసిందల్లా—నన్ను చంపడానికి అంగీకరించకపోవడం...."

నిరంజన్ సాలోచనగా— "సాయపడగలిగిన శక్తి ఉండి—స్నేహితుడు సాయమడిగితే చేయనవడం—స్నేహధర్మమూకాదు, వృత్తిధర్మమూకాదు." అన్నాడు.

"వృత్తిధర్మమా?" అన్నానాశ్చర్యంగా.

"అవును. నా స్నేహితులకు సాయపడకపోతే నా వృత్తి కేవలం స్వార్థానికే అనిపించుకుంటుంది. సిద్ధేంద్ర స్వామి నన్ను క్షమించడు...."

నేను మరి కాసేపాలోచించాను. ఒక ఉపాయం తోచింది—"మీరు నన్ను స్నేహితుణ్ని చేసుకోండి. అప్పుడు మీరు నన్ను చంపలేరు...." అన్నాను.

"స్నేహం బజార్లో కొనుక్కొని తొడుక్కొనే దుస్తుల్లాంటిదికాదు. స్నేహానికి మనసు కారణం. బలమైన సంఘటనలు కారణం. ఆపదలో అవసరానికి నా చెంత చేరిన ప్రతివాడినీ నేను స్నేహితుడిగా అంగీకరిస్తే నా వృత్తి ఏమైపోతుంది?"

"అయితే మీరు నా ప్రాణాలు రక్షించలేరా?"

నిరంజన్ ఉలిక్కిపడి—"అయ్యో! ఇంతసేపూ మనం మాట్లాడుకుంటున్నది ప్రాణరక్షణ గురించి కదూ!" అన్నాడు.

"అవును—" అన్నాడాశగా.

"నేను ప్రాణాలు తీయడమే వృత్తిగా పెట్టుకున్న వాణ్ని. ప్రాణరక్షణ నావల్ల నెలాగవుతుంది?" అన్నా డతడు.

"మీరే చెప్పాలి—"

"ప్రాణరక్షణకు ఒక్కటే వుపాయముంది—"

"చెప్పండి—" అన్నా నాత్రుతగా.

"త్రికరణశుద్ధిగా సిద్ధేంద్రస్వామిని నమ్మండి...."

"నమ్మితే?"

"ఆస్వామి మిమ్మల్ని రక్షిస్తాడు...."

"ఎలా?" అన్నా నాశ్చర్యంగా.

"స్వామిలీలలు అనంతాలు. ఎలాగంటే నేను చెప్ప లేను...."

ఇదంతా ఏదో నాటకమనిపించింది నాకు. నిరంజన్ నన్ను కూడా సిద్ధేంద్రస్వామి భక్తకోటిలోకి లాగాలని చూస్తున్నాడు. నేను సమాజంలో పలుకుబడి బాగా ఉన్న భాగ్యవంతుణ్ని. నాకారణంగా సిద్ధేంద్రస్వామికీ పలుకుబడి పెరుగుతుంది.

"నమ్మకం పుట్టడం అంత సులభంకాదు...."

"నాకు తెలుసు...." అన్నాడు నిరంజన్—"భగ వంతుడు తనమీద నమ్మకం పుట్టించడానికే మనిషికి సమ స్యలు సృష్టించి పరిష్కరిస్తాడు....ఇప్పుడు మీకు వచ్చిన సమస్య మీ కదృష్టం కావచ్చు—"

"ఆశపెడుతున్నారా?"

నిరంజన్ అదోలా నావంక చూసి—"దేవుడిపై నమ్మకం అదృష్టవంతులకే కలుగుతుంది. మిమ్మల్నాశ పెట్టాల్సిన అవసరం నాకు లేదు. మరోమాట చెబు

తున్నాను. మీరు సిద్ధేంద్రస్వామికి భక్తులైనప్పటికీ— నా స్నేహితుడు కోరితే మిమ్మల్ని చంపితీరతాను. నా నుండి కాపాడాలనుకుంటే నే సిద్ధేంద్రస్వామి మీ ప్రాణాలు రక్షిస్తాడు...." అన్నాడు.

నేను లేచి నిలబడి—"సెలవు—" అన్నాను.

"స్వామి దర్శనం చేసుకుని వెళ్ళరా?" అన్నాడు నిరంజన్.

"స్వామి ఇక్కడే ఉన్నాడా?"

"మాయింట్లో ఓగది స్వామికి ప్రత్యేకం. అక్కడ నిలువెత్తు స్వామివిగ్రహముంది. మీరు మనోవాక్కాయ కర్మణా ఆయన్ను నమ్మితే ఆ విగ్రహం మనుష్యరూపంలో మీతో సంభాషిస్తుంది—" అన్నాడు నిరంజన్.

"మీ కెప్పుడేనా అలా జరిగిందా?"

"ఎన్నో సార్లు...."

కుతూహలంగా నిరంజన్ ననుసరించాను.

ఆగది దేవాలయంలా ఉంది. గదిలో అగరువత్తుల పరిమళాలు....పవిత్ర వాతావరణం.

సిద్ధేంద్రస్వామి విగ్రహం చిరునవ్వులు చిందిస్తోంది.

నేను విగ్రహాన్ని పరీక్షగా చూశాను. కళ్ళు మూసుకుని నమస్కరించాను. నా మనసులో ఎలాంటి భావమూ కలగలేదు.

కళ్ళు తెరిచాను.

విగ్రహం చిరునవ్వులు చిందిస్తుంది.

"స్వామి కనబడుతున్నారా?" అన్నాడు నిరంజన్.

తల అడ్డంగా ఊపాను.

నిరంజన్ నిట్టూర్చి—"ప్రయత్నించండి. అదృష్ట

ముంటే ఏదో ఒకరోజున మీలో భక్తిభావం కలుగు తుంది....” అన్నాడు.

నేనూ నిట్టూర్చాను.

# 6

నా కొత్త స్మగ్లింగ్ ఆపరేషన్‌కింకా వ్యవధి ఉంది. ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాను.

ఒక హైస్కూల్లో అటెండరుగా ఉన్న నిరంజన్ దేశంలో ఏమూలనైనా హత్య చేయగల సమర్థుడు. తను వెంకటింట్లో ఉంటూ తనవారందరికీ సకల వైభోగా లనూ అందించగల నిరంజన్ ప్రాణాలు కింతవరకూ ఎవరి నుంచి ప్రమాదం వాటిల్లలేదంటే అది సిద్ధేంద్రస్వామి మహిమ అనుకోవాలా, మన సమాజం గొప్పతనం అనుకో వాలా?

డబ్బు, పలుకుబడి, హోదా ఉన్న నేను నిరంజన్‌కి భయపడుతున్నాను. నాభయాన్ని తొలగించగలవాడు సిద్ధేంద్రస్వామి మాత్రమే నని అంటున్నాడు నిరంజన్. ఇప్పుడు నేనేం చేయాలి?

ఎందుకో నాకు సిద్ధేంద్రస్వామిపై నమ్మకం కుదర లేదు. నేను నాస్తికుణ్ణి.

ఏమీ పాలుపోని సమయంలో నావద్దకో విచిత్రమైన కేసు వచ్చింది. కేసు ఇద్దరు వ్యక్తులకు సంబంధించినది.

ఒకడిపేరు మాధవరావు. అమాయకుడు. ముక్కుకు సూటిగా పోయేవ్యక్తి. చిన్న ఉద్యోగి. నీతిసూత్రా లనూ, ఆదర్శాలనూ నమ్ముకున్న కారణంగా ఎదుగూ బొదుగూ లేకుండా ఉండిపోయిన సామాన్యుడు.

రెండోవ్యక్తి సుదర్శనం. బాగా ఉన్నవాడు. అహం కారి. అతడి ధనదాహం అంతులేనిది.

సుదర్శనం కూతురు మాధవరావు కొడుకుని ప్రేమించింది. ఇద్దరూ పెళ్ళి చేసుకుంటామంటున్నారు. సుదర్శనం కూతుర్ని మందలిస్తే—"నువ్వు నాకు మరో పెళ్ళి చేసినా నేను భర్తను వదిలిపెడతాను. నా ప్రియుడి దగ్గరకు వెళ్ళిపోతాను—" అని చెప్పింది. ఆమె మొండిది. అన్నంత పనీ చేయగలదని తండ్రికి తెలుసు. అందుకని ఆయన మాధవరావును హెచ్చరించాడు. మాధవరావు కొడుకు తండ్రి మాట వినడంలేదు. చివరకు సుదర్శనం మాధవరావు కొడుకును చంపేస్తానని చెప్పి పదిరోజులు గడువిచ్చాడు. పదిరోజుల తర్వాత మాధవరావు కొడుకు ఊళ్ళో కనపడకూడదు. కనపడ్డాడా ఆ తర్వాత ఈ ప్రపంచంలో ఎవరికీ కనపడడు.

సుదర్శనం, మాధవరావు—ఇద్దరూ నాకు స్నేహితులు. నా హోదా నన్ను సుదర్శనానికి స్నేహితుణ్ణి చేసింది. మధ్యతరగతివాళ్ళు నా పట్ల చూపే ఆరాధన నన్ను మాధవరావుకు స్నేహితుణ్ణి చేసింది.

ఇద్దరూ విడివిడిగా నన్ను కలుసుకున్నారు.

తెలివైనవాడు తనకు ప్రతికూలంగా వున్న విశేషం నుంచి కూడా ప్రయోజనం పొందగలడు.

నేను తెలివైనవాణ్ని.

మాధవరావుకు నేను సిద్ధేంద్రస్వామి గురించి సలహా యిచ్చాను. మాధవరావుకు దేవుడంటే అంతో యింతో నమ్మకముంది. నేను నాస్తికుడినని అతడికి తెలుసు.

"మీరు సిద్ధేంద్రస్వామిని నమ్ముతారా?" అంటూ ఆశ్చర్యపోయాడతడు.

"మీరు నమ్మరా?" అన్నాను.

"నేను అన్నింటికీ ఆ వెంకటేశ్వరునిపై ఆధార

పడ్డాను. సిద్ధేంద్రస్వామి గురించి నాకాట్టే తెలియదు...."

నేనతడికి సిద్ధేంద్రస్వామి గురించి చెప్పి—"త్రికరణ శుద్ధిగా స్వామిని నమ్మితే—సాక్షాత్తు మృత్యుదేవత తరలివచ్చినా మీ అబ్బాయికే ప్రమాదమూ వుండదు.." అన్నాను.

మాధవరావు నా వుపాయానికి చాలా సంతోషించాడు. నేను చెప్పిన నిదర్శనాలతడికి నమ్మకాన్ని కలిగించాయి.

అంతటితో నా పని పని అయిపోలేదు. నేను పులికీ, లేడికీ కూడా స్నేహితుణ్ని. వేటగాడికీ స్నేహితుణ్ని.

సుదర్శనం నన్ను సలహా అడిగినప్పుడు నేనతడికి నిరంజన్ పేరు సూచించాను.

"నిరంజన్ గురించి విన్నాను కానీ నేనెప్పుడూ ఉపయోగించుకోలేదు...." అన్నాడు సుదర్శనం.

"నిరంజన్ వల్ల చాలా సుఖాలున్నాయి. కార్యగురించి వంకాయలు బేరం చేసినంత సులభంగానూ మాట్లాడుకో వచ్చు. అన్నీ సూటిగా వుంటాయి. అనుకున్న పని గ్యారంటీగా అయిపోతుంది. నీ పేరు బయటకు రాదు...."

"నువ్వు చెప్పావు కాబట్టి నమ్ముతున్నాను. ఇంత వరకూ నేను కార్యాలు చేయలేదు. చేయించలేదు. అందుకే భయపడుతున్నాను. కానీ ఆ మాధవరావుకు గట్టిగా బుద్ధి చెప్పకపోతే ఎలా? నాకింకా ఎదగరాడపిల్లలున్నారు" అన్నాడు సుదర్శనం.

"అయితే మాధవరావు కొడుకును చంపించేస్తావా?"

"ఊఁ."

"ఇప్పుడేనా!"

"కాదు. పదిరోజులు గడువిచ్చానుగా. ఇంకా టైముంది....ఈలోగా మాధవరావు భయపడకపోడు.."

"అయితే నిరంజన్‌ని ఇప్పట్నుంచీ కలుసుకోకు. నిరంజన్‌కి మాటంటే రామబాణం. వాళ్ళ తప్పనిసరి అయితే ఒకరోజు ముందు వెళ్ళి అతడికి చెప్పడం మంచిది...." అన్నాను.

"నువ్వలా చెబితే అలాగే!" అన్నాడు సుదర్శనం వినయంగా.

మాధవరావుపట్ల అహంకారమే నాపట్ల వినయంగా మారిందని నాకు తెలుసు. అయినా అతడి వినయం నాకు సంతోషాన్ని కలిగించింది.

# 7

"పిలిచారట?" అంది వినీత.

నేనామెవంక పరీక్షగా చూశాను.

లేత తమలపాకులా సుకుమారంగా ఉందామె. ఆమె ఒంటిమీద దుస్తులు, అలంకరణ కిళ్ళీలో మసాలాలా వున్నాయి. నాకామెను కిళ్ళీని నమిలినట్లు నమిలేయాలనుంది. కానీ వినీత కళ్ళలో ఎటువంటి భావాలూ లేవు. ప్రశాంత వదనమామెది!

"నీకు వారంరోజులు మాత్రమే గడువు!" అన్నాను.

ఆమె నవ్వింది. చాలా అందంగా, మనోహరంగా!

"నీ సిద్ధేంద్రస్వామికి నేను పరీక్ష పెట్టాను. ఆ పరీక్షలో స్వామి తప్పక ఓడిపోతాడు. అప్పుడు నన్నిక ఎవరూ ఆపలేరు—నువ్వు కూడా!"

వినీత ఇంకా నవ్వుతూనే వుంది — "ఇంతకాలం మిమ్మల్నెవరాపారు? ఆ సిద్ధేంద్రస్వామి కాదా?"

కడబడ్డాను. వినీత నన్ను బెదిరించగానే నాకు శ్రీదేవి అన్నయ్యనుంచి బెదిరింపు ఉత్తరం వచ్చింది. అప్పటినుంచీ ఆమె గురించి మరిచి నిరంజన్ గొడవలో పడ్డాను.

ఇది సిద్ధేంద్రస్వామి మహిమ అవుతుందా?

“స్వామిని పరీక్షిస్తున్నాననుకుంటే అది మీ భ్రమ. స్వామి తనే మిమ్మల్ని పరీక్షిస్తున్నాడు—” అంది వినీత మళ్ళీ.

చటుక్కున మళ్ళీ ఆమె చేయి పట్టుకుని—“ఇప్పుడు నిన్ను దగ్గరగా లాక్కుంటే ఏమవుతుంది?” అన్నాను.

“మీ కుటుంబం సమూలంగా నాశనమవుతుంది....”

అదే ప్రశాంతత....అదే నిర్మలత్వం....

నేను ఆమె చేయి వదిలి—“వెళ్ళు....ఇంకా వారం రోజులు గడువుంది ...” అన్నాను.

“వారం రోజుల తర్వాత కూడా జరిగేదిదే....” అంటూ వెళ్ళిపోయిందామె!

ఆడది....అబల....అసహాయురాలు....అనాధ....

ఎంత ధైర్యంగా వుంది! ఎంత నమ్మకంగా వుంది!

సిద్ధేంద్రస్వామి సామాన్యుడు కాదు......మరి నా పరీక్షలో ఆ స్వామి ఏమవుతాడో చూడాలి.

## 8

వారంరోజుల గడువు పూర్తి కావస్తోంది. ఈ వ్యవధిలో ఒక్కసారి కూడా మాధవరావు నా దగ్గరకు రాలేదు.

సిద్ధేంద్రస్వామి మహిమతో మాధవరావు కొడుకులో మార్పు వచ్చిందా? లేక సుదర్శనం తన కూతుర్నాయింటి కోడల్ని చేయదల్చుకున్నాడా?

కుతూహలం పట్టలేక నేను మాధవరావింటికి వెళ్లాను. అక్కడ నాకు ప్రత్యేకంగా మర్యాదలు జరిగాయి. నేను, మాధవరావు ఓ గదిలో తలుపులు వేసుకుని కూర్చున్నాం.

"పరిస్థితిలో మార్పు వచ్చిందా?" అన్నాను.

"లేదు—" అంటూ తల అడ్డంగా ఊపాడు మాధవరావు.

"కానీ మీరు చాలా ఉత్సాహంగా కనబడుతున్నారు."

"నా కిప్పుడు మనసెంతో ప్రశాంతంగా వుంది. సిద్ధేంద్రస్వామి తప్పకుండా నా బిడ్డను కాపాడుతాడనే అనిపిస్తోంది."

"మీ వాడేం చేస్తున్నాడు?"

"ఆ అమ్మాయి రాత్రి కిల్లు వదిలి వచ్చేస్తానందిట. ఇద్దరూ కలిసి రాత్రికి రాత్రి గుళ్ళో పెళ్ళి చేసుకుంటారట. బ్రతికినా, చచ్చినా కలిసేనంటోందా అమ్మాయి."

"మరి మీ రేమంటున్నారు?"

"అంతా ఆ సిద్ధేంద్రస్వామి దయ..." అన్నాడు మాధవరావు.

నేను ఇంటికి తిరిగి వెళ్ళిపోయాను. మాధవరావుకు నేను మంచి చేశానో లేదో తెలియదు కానీ ఆయన సుదర్శనానికి భయపడ్డం మానేశాను.

నేను మంచంమీద పడుకుని ఈ విషయమే ఆలోచిస్తూండగా నాకోసం సుదర్శనం వచ్చేడు.

అతడి ముఖంలో కంగారు, కలవరం వగైరాలున్నాయి

సిద్ధేంద్రస్వామి భక్తులకీ, కాని వారికీ తేడా తెలుస్తోంది నాకు.

"ఏమయింది?" అన్నాను.

"అనవసరంగా గడువిచ్చాను. ఇప్పుడంతా నా పీకల మీదకు వచ్చింది—..." అన్నాడు సుదర్శనం.

"కంగారు పడకుండా అసలు విషయం చెప్పు."

"అమ్మాయి రాత్రికే ఆ దౌర్భాగ్యుణ్ని పెళ్ళి చేసుకుంటుందిట."

"ఈ రాత్రికే ఏం కర్మ! ఎప్పుడో పెళ్ళి చేసుకుంటానంది. కానీ నువ్వు సాగనిస్తావా?"

"అది చాలా తెలివైనది. వాళ్ళ బామ్మను పట్టింది."

సుదర్శనం తల్లికి వయసు ఎనభైపైన వుంటుంది. ఆమె పదిమంది పిల్లల తల్లి. ఆఖరివాడని సుదర్శనమంటే ఆమెకిష్టం. అందుకే అతడితో వుంటోంది. సుదర్శన మీసాడిలా వచ్చగా వున్నాడంటే కారణం ఆ తల్లి చలవే! ఆ యింట్లో సుదర్శనం తల్లి మాట కాదనగల శక్తి ఎవరికీ లేదు. ఎనభై ఏళ్ళు వచ్చినా ఆమె దృఢంగా ఉంది.

సుదర్శనం కూతురు తన ప్రేమ కథ గురించి బామ్మకు చెప్పుకుంది. బామ్మ మాధవరావు కొడుకును తనింటికి రప్పించుకుని పలకరించి మాట్లాడింది. ఆమెకు మాధవరావు కొడుకు నచ్చాడు. వెంటనే సుదర్శనాన్ని పిలిచి చీవాట్లు పెట్టింది.

"నీకు తెలియదమ్మా—వాడో దగుల్బాజీ వెధవ. అల్పాయుష్కుడు. ఒక్క బుద్ధికూడా మంచిది కాదు...." అంటూ సుదర్శనం తల్లిమనసు మార్చడానికి ప్రయత్నించాడు. ఆమె వినకుండా—"అంతా చూసేవాళ్ళ కళ్లలో ఉంది. నాకు తెలుసు. అతగాడు పేదవాడని నీకు నచ్చలేదు. ఒకప్పుడు మనమూ పేదవాళ్ళమే! పేదరికాన్ని

గౌరవించాలి కానీ ఏవగించుకోకూడదు. ఈశ్రాదు బుద్ధిమంతుడు. నాకు నచ్చాడు....” అని చెప్పింది.

“అమ్మా! చాలాసార్లు నీ మాటలు విన్నాను. ఈ విషయంలో మాత్రం నాకడ్డు చెప్పకు. అమ్మాయికి నేను మంచి సంబంధం చూసి చేస్తాను.....” అన్నాడు సుదర్శనం.

“నీ మాట ఎవరికి లెక్క? ఈ రాత్రే వాళ్ళ పెళ్ళి జరుగుతుంది...” అంది సుదర్శనం తల్లి.

“నా ప్రమేయం లేకుండా పెళ్ళెలా చేస్తావు?” అన్నాడు సుదర్శనం.

“పెళ్ళి గుళ్ళో చేస్తాను” అంది సుదర్శనం తల్లి.

ఆమె మొండిపట్టు వీడదని తెలిసేక — “అయితే అమ్మా! ఒక చిన్న మనవి. పిల్లలముందు నేను లోకువై పోకుండా కాపాడు. ఈ పెళ్ళి నాకు తెలియకుండా జరిగినట్లే వాళ్ళనుకోవాలి. ఓసారి పెళ్ళయ్యాక అక్షింతలు వేసి దీవించక తప్పదుగదా!” అన్నాడు సుదర్శనం.

“లేనిపోని పట్టుదలకు పోకు. వైభవంగా జరగాల్సిన పెళ్ళి గుళ్లో జరుగనివ్వకు..” అంది సుదర్శనం తల్లి.

“అమ్మా! నువ్వు నా మాట వినడంలేదు. నాకు తెలిసి ఆ వెధవ ఆల్వాయుష్కుడు. వాడికూళ్ళో చాలా మంది పెద్దవాళ్ళతో గొడవలున్నాయి. పెళ్ళికి కాస్త ముందో వెనకో వాడెవరి చేతిలోనో చస్తాడని నా భయం. అలాంటి వాణ్ని నే కోరికోరి అల్లుణ్ని చేసుకున్నానని నలుగురూ అనుకోవడం నాకిష్టంలేదు. వాడికి నా చేతుల్తో నేను కాళ్లు కడిగి కన్యాదానం చెయ్యలేను....” అన్నాడు సుదర్శనం.

“కొంపదీసి నువ్వే అతిగాడిని చంపేయవు గదా!”

అంది సుదర్శనం తల్లి అనుమానంగా.

"అమ్మా! నేను హంతకుణ్ని కాగలనా?" అన్నాడు సుదర్శనం.

"నా బిడ్డలు హత్యలు చేయరు. చేయించలేరు..." అంది సుదర్శనం తల్లి నమ్మకంగా.

ఇప్పుడు సుదర్శనం నాకా విషయాన్ని చెప్పి—"ఏ తల్లీ తన కన్నబిడ్డ హత్యలు చేయించే స్థాయికి ఎదిగాడని నమ్మదు. ఇప్పుడు నాకు నిరంజన్ సాయం కావాలి. పెళ్ళికి ముందే వాణ్ని ఫినిష్ చేయాలి.." అన్నాడు.

నిరంజన్ అయితే హత్య గ్యారంటీ. సుదర్శనమే ఆ హత్య చేయించాడన్న అనుమానం యెవరికీ రానివ్వడు. అది యాక్సిడెంటుకింద చూపగలడు.

"అయితే నిరంజన్ ని కలుసుకో.." అన్నాను.

"నువ్వు సాయం రావాలి. ఇలాంటివి నేనెప్పుడూ చేయలేదు. అందుకని నాకు భయంగా వుంది. వళ్ళంతా వణుకుతోంది."

మామూలుగా అయితే ఏమోకానీ—ఆ రోజు నా మనస్థితి వేరు. సిద్ధేంద్రస్వామిని పరీక్షించాలని అనుకుంటున్నాను. నిరంజన్ తో కొంత పరిచయమూ వుంది.

ఇద్దరం నిరంజన్ ఇంటికి వెళ్ళాం.

నిరంజన్ ఇంట్లోనే వున్నాడు. అప్పుడు సాయంత్రం ఆరుగంటలయింది.

నిరంజన్, మేము చాపమీద కూర్చున్నాం.

హత్య గురించి వినగానే హతుడి వివరా లడిగాడు నిరంజన్.

మాధవరావు కొడుకు గురించి చెప్పాడు సుదర్శనం.

వివరాలన్నీ విని—"నలభై వేలవుతుంది—" అన్నాడు

నిరంజన్.

"చాలా ఎక్కువ—" అన్నాడు సుదర్శనం చటుక్కున.

నిరంజన్ కళ్ళు చిట్లించి—"నా దగ్గర బేరాలుండవు. నా మాటే ఆఖరుమాట ...." అన్నాడు.

సుదర్శనం ఒప్పుకున్నాడు.

"సగం అడ్వాన్సివ్వాలి ...." అన్నాడు నిరంజన్.

సుదర్శనం కూడా డబ్బు తేలేదన్నాడు.

"ఫరవాలేదు. డబ్బు హత్యకు ఒకరోజు ముందిచ్చినా చాలు. ఈ హత్యకు ముహూర్తం సరిగా ఈ రోజుకు పదిరోజుల తర్వాత ...." అన్నాడు నిరంజన్.

"అలాకాదు. హత్య ఈ రోజే జరగాలి ...." అనాడు సుదర్శనం.

"ఈ రోజు వీలు కాదు."

సుదర్శనం తన ఆర్జెన్సీ వివరించినా నిరంజన్ అంగీకరించలేదు.

"యాభై వేలిస్తాను ...." అన్నాడు సుదర్శనం. నిరంజన్ చలించలేదు. ఆవేశంలో బేరాన్ని లక్షదాకా పోనిచ్చాడు సుదర్శనం.

"ఒకటికాదు—పదిలక్షలిచ్చినా ఈ రోజు హత్య చేయడం సాధ్యంకాదు ...." అన్నాడు నిరంజన్.

"ఎందుకని?" అన్నాను కుతూహలంగా.

"ఇంకో గంటలో నేను సిద్ధేంద్రస్వామి ఆశ్రమానికి బయల్దేరుతున్నాను. అదిక్కడికి రెండువందల కిలోమీటర్ల మార్గంలో వుందని మీకూ తెలుసు. అక్కడ వారం రోజులు గడిపి వచ్చేక నే—నేను మళ్ళీ ఇహాన్ని గురించి పట్టించుకునేది ...." అన్నాడు నిరంజన్.

"ప్రయాణం వాయిదా వేసుకోకూడదా?" అన్నాను.

నిరంజన్ కళ్లొ్ల్రబడ్డాయి—"మిన్ను విరిగి మీదపడ్డా సిద్ధేంద్రస్వామి దర్శనానికి బయల్దేరిన ప్రయాణం వాయిదా వేయడం సాధ్యంకాదు. ఈ ప్రపంచంలో నాకు స్వామి భక్తి తర్వాతనే మరేదైనా!"

నేను తెల్లబోయాను.

సిద్ధేంద్రస్వామి తన భక్తులను రక్షించి మహిమను చూపించేడా? కానీ హత్యల నామోదించిన మనిషి దేవు డెలాగౌతాడు?

సమాధానం నాకు తెలియలేదు. కానీ నేను కూడా సిద్ధేంద్రస్వామి భక్తుడినయ్యాను. ఆ భక్తి నిరంజన్ కుటుంబానికి అంతులేని సంపదను తెచ్చిపెట్టింది.

నేను సిద్ధేంద్రస్వామి భక్తుడినయ్యానని చెప్పాక— వినీతకూ నాకూ సంబంధించిన సమస్య ఎలా పరిష్క రించబడిందో చెప్పనవసరం లేదనుకుంటాను.

—:అ యి పో యిం ది:—

# గాంగ్ వార్

## ఫణిబాబు

అన్నార్తుడి కడుపులో ఆకలిలా ఘోష పెడుతుంది సముద్రం. మనిషి మనసులోని దురాశలా ఎగసిపడు తున్నాయి కెరటాలు.

ఆ సముద్రం ఒడ్డున ఆగి వుంది ఒక వాన్. దాని దగ్గరే నిలబడి వున్నాడొక విదేశీయుడు. అసహనంగా సముద్రం వైపు చూస్తున్నాడు. ఇంతలోనే వాచీ చూసు కుంటున్నాడు. అంతలోనే వాన్ కేసి చూస్తూ కళ్ళెర్ర చేస్తున్నాడు. అతడి చేతిలోని మిషన్ గన్ కూడా అతని లాగే అసహనంగా వుంది.

ఆ మిషన్ గన్ వైపే భయంగా చూస్తున్నారు కొంత మంది యువకులు. వాన్‌లో కూర్చుని వున్నారా యువ కులు. చదువు సంధ్యా లేనివారని వాళ్ళను చూస్తూనే తెలిసిపోతుంది.

చుట్టూ వున్న ప్రపంచాన్ని ఆవరించి వున్న చీకటి లాగా వారి మనసులను భయం ఆవరించి వుంది.

కాస్సేపటికి సముద్రంలో ఒక మోటారుబోటు వస్తూ కనిపించింది. దానిని చూస్తూనే ఆ విదేశీయుడి పెద వులపై చిన్న చిరునవ్వు మెరిసింది వాన్‌లో కూర్చున్న యువకులను దిగమని సైగ చేశాడు.

తడబడుతూ దిగిపోయారా యువకులు. వాళ్ళను సముద్రంవైపు తీసుకుపోయాడతను.

మోటారుబోటు ఒడ్డుకు చేరింది. అందులో నుండి మరో విదేశీయుడు దిగాడు.

"హాలో చార్లెస్!"

"హాలో రోనాల్! సరుకు సంపాదించావా?"

"అనుకున్నంత తెచ్చాను. నువ్వు ఇక్కడి ఏర్పాట్లు పూర్తి చేశావా?" రోనాల్డు మాటల్లో అమెరికన్ యాస క్లియర్‌గా తొంగిచూస్తుంది.

"బ్రహ్మాండంగా పూర్తిచేశాను."

చార్లెస్ తన ముందు నిల్చున్న యువకులకు మోటారు బోటులో వున్న చెక్కపెట్టెలు తీయమని సైగ చేశాడు. గబగబా సముద్రంలోనికి దిగి ఆ చెక్కపెట్టెలు పైకి ఎత్తుకున్నారా యువకులు. వాటిని వాన్‌లోనికి జార వేయసాగారు.

"వీళ్ళందరూ ఎవరు?" ప్రశ్నించాడు రోనాల్డు.

"దారిలో తగిలారు. జాలరు లనుకుంటాను. భయపెట్టి తీసుకువచ్చాను."

పనిపూర్తయిన వెంటనే ఆ జాలరి యువకుల నందరిని వరసగా నిలబెట్టాడు చార్లెస్.

"వాళ్ళను చంపవద్దు" అడ్డుపడ్డాడు రోనాల్డు. "బుల్లెట్లతో వాళ్ళను చంపితే పోలీసులకు అను మానం వస్తుంది. వీళ్ళకు ఇంకో క్రొత్తరకం బహుమానం

ఇద్దాం."

తన భుజానికున్న లెదర్ బాగ్ నుండి ఇంజక్షన్ బాటిల్స్ తీశాడు రోనాల్డు. ఆ బాటిల్స్‌లోని యల్.యస్.డి. సిరంజిలోనికి తీసి ఒక్కొక్కరికి ఇంజెక్టు చెయ్యసాగాడు.

తమకు ఏం జరుగుతుందోనని గుండెలు అరచేతిలో పట్టుకుని నిల్చున్నారాయువకులు. రోనాల్డుకు అభ్యంతరం చెప్ప లేదు.

కాస్సేపటికి తన పని పూర్తిచేసుకుని వచ్చి వాన్‌లో కూర్చున్నాడు రోనాల్డు. చార్లెస్ వాన్ కదిపి వేగంగా పోనిచ్చాడు.

సముద్రం ఒడ్డున ఇసకలో పడి పొర్లుతున్నారా జాలర్లు. వారి శరీరాల్లో అధిక మోతాదులో ప్రవేశించిన యల్.యస్.డి. వారి ప్రాణాలు చాలా త్వరగానే తీస్తుంది. వారి శవాలను చూసిన పోలీస్ డిపార్టుమెంట్ ఆ యువకులు డ్రగ్ అడిక్ట్స్ అయి మరణించారని భావిస్తుంది.

వాన్‌లో దూసుకుపోతున్న రోనాల్డు, చార్లెస్‌లకు ఆ విషయం బాగా తెలుసు.

"మనం చేరవలసిన ప్రదేశం ఇంకా ఎంత దూరం?" అడిగాడు రోనాల్డు. అతనికి ఆ సిటీ పూర్తిగా కొత్త. అయితే చార్లెస్‌కు ఆ సిటీ అంతా బాగా తెలుసు.

డాష్ బోర్డునుండి విస్కీ బాటిల్ తీశాడు చార్లెస్. ఒక చేత్తో స్టీరింగ్ కంట్రోల్ చేస్తూ రెండో చేత్తో ఆ బాటిల్ నోట్లో పెట్టుకున్నాడు. కొంత తాగి రోనాల్డుకు ఇచ్చాడు.

"సిటీ బార్డర్‌లో అమరనాథ్ కేవ్స్ అనే శిధిల గుహలు వున్నాయి. అక్కడే మనకోసం పార్టీ ఎదురు చూస్తూ వుంటుంది. వాన్‌లో వున్న మాల్ వాళ్ళకు

అప్పగించడం, పది మిలియన్ డాలర్ల విలువచేసే బంగారం తీసుకుని ఈ దేశంనుండి ఝూంమని ఎగిరిపోవడం"
విరగబడి నవ్వాడు చార్లెస్.

అతనితో శృతికలిపాడు రోనాల్డు. అయితే ఆ నవ్వు ఎంతోసేపు నిలబడలేదు. ముందుకు సాచిన అతని పెదవులు బిగుసుకున్నాయి. చార్లెస్ కూడా ఎదుట పొంచి వున్న ప్రమాదాన్ని గుర్తించాడు. శరీరంలోని శక్తి అంతా హరించుకు పోయినట్లు నిస్తేజంగా వుండి పోయాడు.

## 2

"శిశువు పుట్టుకతో రోదన శబ్దం తప్ప ఇంకేమి చెయ్యలేదు. ఆ ఏడుపు కూడా అసంకల్పితంగా జరుగుతుంది. వెదురు బొదల మధ్యకు గాలి వెళితే శబ్దం వచ్చినట్లు, ఖాళీ అయిన ఊపిరితిత్తులలోనికి గాలి చేరి ఏడుపు బయటకు వస్తుంది. ఆ దశలో శిశువు ఏడవడం మాత్రమే చేస్తుంది."

చెప్తున్న పాఠాన్ని ఆపుచేసారు లెక్చరర్. అది సైకాలజీ క్లాసు. విశ్వనాథంగారికి సైకాలజీ లెక్చరర్ గా ఆ కాలేజీలో మంచి పేరుంది. ఆయన క్లాసుకు విద్యార్థులు రెక్కలు కట్టుకు వాలిపోతారు. జీవితమంతా తన వృత్తికి, విద్యార్థులకు ధారబోసా డాయన.

ఒక్కక్షణం క్లాసంతా కలయజూసా రాయన. వెనుక బెంచీ నుండి సన్నగా పొగ పైకిలేస్తుంది. గబగబా అటు నడిచారు.

ఆఖరి బెంచీలో కూర్చున్నాడు రమేష్. అతని నోటిలో సిగరెట్ ఎర్రగా కాలుతుంది. అదే బెంచీలో వున్న అతని స్నేహితులు వరసగా మార్చి మార్చి అతే

సిగరెట్ తాగుతున్నారు.

శరీరంలోని రక్తం అంతా ముఖంలోనికి వచ్చేసినట్లు ఎర్రబడిపోయింది విశ్వనాధంగారి వదనం.

"క్లాసులో సిగరెట్స్ త్రాగుతున్నారా?" కోపంగా అన్నారాయన.

"బ్రౌన్ షుగర్ కూరిన సిగరెట్లు సార్ అవి" ముందు బెంచిలోని ఒక విద్యార్థి చెప్పాడు.

చెర్నున ఎలక్ట్రిక్ హంటర్‌తో కొట్టినట్లు ఉలిక్కి పడ్డారు విశ్వనాధంగారు.

బ్రౌన్ షుగర్....భయంకరమైన మత్తుపదార్థం. అది తీసుకుంటే ఏవేవో తెలియని లోకాలు కళ్ళముందు కన బడతాయి. దాని ప్రభావం మెదడుపై తీవ్రంగా వుం టుంది. చిత్ర విచిత్రమైన అనుభవాలు శరీరానికి కలుగు తాయి.

ఆ తర్వాత మళ్ళీ మళ్ళీ ఆ డ్రగ్ తీసుకోవాలని పిస్తుంది. మనసు బ్రౌన్ షుగర్ కోసం పరితపిస్తుంది. అలా కొన్ని రోజులకు ఆ మనిషి క్రషర్‌లో పెట్టిన చెరకు గడలా పిప్పి అయిపోతాడు.

ఆడపిల్లల వరసలో ఒక అమ్మాయి పకపకా నవ్వ డంతో ఉలిక్కిపడి అటు చూశారు విశ్వనాధంగారు.

ఆ అమ్మాయి విరగబడి నవ్వసాగింది. ఎవరో చక్కిలి గిలి పెడుతున్నట్లు పకపకా నవ్వుతుంది. ఆ అమ్మాయి చేతిలోని చిన్న ట్యూబ్‌ను చూస్తూనే గ్రహించారు ఆమె కూడా డ్రగ్ అడిక్ట్ అని.

"ఈ డ్రగ్స్ ఎక్కడ దొరుకుతున్నాయి?"

"కాలేజి ఎదురుగా వున్న కేంటీన్‌కి రోజూ ఈ సమ యానికి ఒక తెల్లబట్టలు వేసుకున్న మనిషి వస్తాడు

సార్. అతనే అమ్ముతున్నాడు!" ఎవరో చెప్పారు.

మరోసారి తృళ్ళిపడ్డారు లెక్చరర్. పట్టపగలు కాలేజి ముందు మాదక ద్రవ్యాలు అమ్మడమా? విపరీతమైన ఆశ్చర్యానికి లోనయ్యారాయన.

ఆ మేధావికి తెలియదు. ఈ దేశంలో చాలా కాలేజీల ముందు ఓపియం, కొకయిన్, బ్రౌన్ షుగర్ వంటి మాదకద్రవ్యాలు వేరుశనక్కాయలు అమ్మినట్లు అమ్ముతారని, వాళ్ళను ఈ దేశంలో పోలీస్ వ్యవస్థ ఏమీ చెయ్యలేదని.

రమేష్ గాజు కళ్ళను చూస్తూనే విపరీతమైన ఆందోళనకు గురయ్యారు విశ్వనాథంగారు. ఈ మాదకద్రవ్యాలను అరికట్టాలి. యస్! అరికట్టితీరాలి. ఇటీజ్ ఎ డెత్ వార్నింగ్. మన సంఘానికి ఇది డెత్ వార్నింగ్. ప్రిన్సిపాల్ రూమ్‌లో వున్న టెలిఫోన్ వైపు నడిచారు.

## 3

చెక్ పోస్టది. మామూలు చెక్ పోస్టుకాదు. పోలీస్ కాప్స్ అన్నీ అక్కడే వున్నాయి. ఒక ప్రక్కగా పోలీస్ జీపులు ఆగివున్నాయి.

రోడ్డును కవర్ చేస్తూ ఒక కర్ర గేటు వుంది. దాని ముందు ఇద్దరు పోలీస్ ఆఫీసర్స్ వున్నారు. కొంచెం అవతల పోలీస్ జవాన్లు నిలబడి వున్నారు. వాళ్ళ చేతుల్లో లోడ్ చేసిన రైఫిల్స్ వున్నాయి. సీను మొత్తం చాలా పగడ్బందీగా వుంది.

ఒక్కక్షణంలో సర్దుకున్నారు చార్లెస్, రోనాల్డులు. వాళ్ళ స్మగ్లింగ్ జీవితంలో ఇటువంటి సిట్యుయేషన్లు చాలాసార్లు ఎదుర్కొన్నారు.

వాన్ రెడ్ స్లో అయ్యింది. మెషిన్‌గన్ చేతిలోనికి

తీసుకున్నాడు రోనాల్డు.

వాన్ స్లో కావడంతో వాళ్ళను ఏమాత్రం అనుమా నించలేదు పోలీస్ కాప్స్. మామూలు పాసెంజర్స్‌గానే ఊహించారు. కొన్ని సెకండ్లలోనే వాళ్ళ ఊహ తారు మారు అయ్యింది.

వర్షపు చినుకుల్లా దూసుకువచ్చాయి బుల్లెట్స్. పులిని చూసిన లేళ్ళ మందలా చెల్లాచెదురై పోయారు పోలీసులు.

క్షణాలలో వాన్ స్పీడ్ పికప్ చేసింది. అదే సమ యంలో మెషిన్‌గన్ ఆగివున్న పోలీస్ జీపులవైపు తిరి గింది. మొత్తం జీపులన్నింటికి ఫ్రంట్ టైర్స్ ముక్కు ముక్కలయిపోయాయి.

అడ్డుగా వున్న కర్ర గేటును ముక్కలు చేస్తూ వాన్ ముందుకు సాగిపోయింది. తేరుకున్న పోలీసులు ఎదురు కాల్పులు జరిపేసరికి చాలాదూరం వెళ్ళిపోయింది.

"ఇంకా అంత స్పీడ్ ఎందుకు? ఆ పోలీస్ కుక్కలు మనల్ని అనుసరించడంలేదుగదా?" అన్నాడు రోనాల్డు.

అయినా స్పీడ్ తగ్గించలేదు చార్లెస్. అతనికెందుకో ప్రమాదం తొలగిపోలేదనిపిస్తోంది. కాసేపటికే అతని అనుమానానికి రూపం ఏర్పడింది.

వెనుకనుండి చెవులు చిల్లులుపడేటంతటి శబ్దం విన వచ్చింది. విండోనుండి తల బయటికిపెట్టి చూశాడు రోనాల్డు. కోడిపిల్లను తరిమే గ్రద్దలా వాన్‌ను అనుస రిస్తూంది ఒక హెలికాప్టర్.

అదేసమయంలో వాన్‌కు నాలుగు అడుగుల దూరంలో పెద్ద శబ్దమయ్యింది. వాన్ ముందు దట్టమయిన పొగ ప్రత్యక్షమయ్యింది.

యాక్సిలేటర్ మీది కాలుతీసి, బ్రేక్ గట్టిగా నొక్కాడు

చార్లెస్. కీచుమని రోదపెట్టాయి టైర్లు. రోడ్డుకు అడ్డం తిరిగింది వాన్.

ఆ కాస్త సమయంలో డ్రైవింగ్ సీటులోకి వచ్చేసాడు రోశాల్డు. ప్రక్కకు జరగాడు చార్లెస్. రోనాల్డు డ్రైవింగ్‌లో మంచి ఎక్స్‌పర్టు. ఆ పరిస్థితిలో అతిదే సరయైన డ్రయివర్.

మిషన్‌గన్ చేతిలోనికి తీసుకున్నాడు చార్లెస్. అదే సమయంలో మరో రెండు హేండ్‌బాంబులు పది అడుగుల దూరంలోపడి దారుణమైన శబ్దంతో పేలిపోయాయి.

వెంటనే వాన్ రివర్స్‌చేసి రోడ్డు క్రిందకు దింపాడు రోనాల్డు. మెయిన్ రోడ్డుకు ప్రక్కగా కంకర రోడ్డు ఒకటి వుంది. దానికి ఇరువైపులా ఎత్తైన చెట్లువున్నాయి. ఆ చెట్లలోనికి వెళ్ళగలిగితే హెలికాప్టర్‌నుండి తప్పించుకోవచ్చును.

మరో హేండ్‌బాంబ్ వాన్ వెనుకభాగానికి దగ్గరగా పడింది.

"బాస్టర్డ్స్....మన గురించి ఈ ఇండియన్ డాగ్స్‌కు పూర్తిగా తెలీదు" కసిగా పళ్ళు కొరికాడు చార్లెస్.

విండోనుండి మిషన్ గన్‌తో హెలికాప్టర్‌పై కాల్పులు జరిపాడు. వేగంగా ప్రయాణించే వానిలో నుండి పైన కదిలే టార్గెట్‌ను పడగొట్టే మొనగాడు ప్రపంచంలో లేడు.

"చార్లెస్!"ఆందోళనగా హెచ్చరించాడు రోనాల్డు.

అప్పటికే చాలా ఆలస్యమైపోయింది. హెలికాప్టర్‌లో నుండి వరదలా దూసుకువచ్చాయి బుల్లెట్లు. వాన్ ప్రక్క భాగంలో పెద్ద పెద్ద రంధ్రాలను ఏర్పరచడం ప్రారంభించాయి.

ఒక బుల్లెట్ విండో నుండి బయటకు వచ్చిన చార్లెస్ తలలో దిగిపోయింది. మరొకటి కంఠంలో దిగిపోయింది. డోర్ తెరుచుకోవడంతో అతని శరీరం క్రిందకు జారి పోయింది.

యాక్సిలేటర్ మరింతగా తొక్కిపట్టాడు రోనాల్డు. వింటినుండి వెలువడిన శరంలా ముందుకు దూకింది వాన్.

చార్లెస్ మరణించాడని అర్థమయింది రోనాల్డుకు. స్నేహితుని మరణానికి క్షణం బాధపడ్డా మరుక్షణం తేరుకున్నాడు.

దట్టమైన చెట్లలోకి వాన్ ప్రవేశించడంతో హెలి కాప్టర్ పైకిలేచింది. ఆ ప్రదేశమంతా ఎంతసేపు చక్కర్లు కొట్టినా వాన్ జాడ వారికి తెలియలేదు.

దట్టమైన చెట్లలోపు తర్వాత సన్నటి రోడ్డు తగిలింది. ఆ తర్వాత మళ్ళీ గుబురుగా చెట్లు మొదలైనాయి. అక్కడ ఒక ప్రక్కగా కనబడింది ఒక కొండ గుహ. చాలా నాచురల్ గా వుందది.

మరో ఆలోచన లేకుండా వాన్ లోనికిపోనిచ్చేశాడు రోనాల్డు. అందులో మోకాలు ఎత్తులో పిచ్చిమొక్కలు పెరిగి వున్నాయి. అది చూడగానే అక్కడ వాన్ ఎవ్వరూ చూడరని అతనికి నమ్మకం కలిగింది.

వాన్ లాక్ చేశాడు. అక్కడినుండి బయటకు కదిలాడు.

ఆ చెట్లలోపునుండి బయటకు రాగానే దూసుకు వచ్చాయి బుల్లెట్లు. అదిరిపడి వెనక్కి జంప్ చేశాడు రోనాల్డు.

హెలికాప్టర్ అక్కడే వుంది. రోనాల్డును గమనించ

గానీ అతనిపై ఫైరింగ్ జరిపారు దానిలో వున్న వాళ్ళు.

"బ్లడీ ఇండియన్ పోలీస్!" కసిగా తిట్టుకున్నాడు నారోల్డు.

రివ్వున సముద్రంవైపు పరిగెత్తాడు. పావురాయిని చూసిన డేగలా అతని వెంటబడింది హెలికాప్టర్. అతని పాదాల వెంబడే బుల్లెట్లు ఇసకలో దూరుకుపోతున్నాయి. ఎగిరి ఒక రాయి చాటుకు డైవ్ చేశాడు.

సరిగ్గా ఆ దేసమయంలో అతనిపైనుండి ఎగిరింది హెలికాప్టర్. వెల్లకిల్లా తిరిగి మిషిన్‌గన్‌ను హెలికాప్టర్ వైపు గురిపెట్టి ట్రిగ్గర్ ప్రెస్ చేశాడు రోనాల్డు. రివ్వున ముందుకు పోయిందది. ఆ కాస్త వ్యవధిలో సముద్రంలోకి డైవ్ చేశాడు. మళ్ళీ పైకి తేలలేదు. తేలితే బుల్లెట్లు మీదకు వచ్చేస్తాయని అతని భయం.

ఉన్నట్లుండి విసురుగా గాల్లోకి లేచింది హెలికాప్టర్. దాని అడుగుభాగంలో ప్రత్యక్షమయ్యాయి సన్నటి మంటలు. మిషన్‌గన్ బుల్లెట్లు దాని పెట్రోలు టాంక్‌ను బ్రద్దలు కొట్టాయి. తోక తెగిన గాలిపటంలా గింగిరాలు తిరగసాగింది. క్రింది భాగంలోని మంటలు పెద్దవై చెవులు చిల్లులుపడే శబ్దం చేస్తూ పేలిపోయిందా హెలికాప్టర్.

## 4

ధడాలున శబ్దం చేస్తూ విరిగిపడ్డాయి తలుపులు. అదిరి పడి అటు చూశారు విశ్వనాథంగారు, ఆయన భార్య. గుమ్మంలో నిలబడి వున్నాడొక దృఢకాయుడు.

ఆరడుగుల ఎత్తు, తెల్లగా వున్న మురికిపట్టిన శరీరం, ఎర్రబారిన కన్నులు, కోపంలో అదిరే ముక్కుపుటాలు.

చూస్తూనే అతనొక హంతకుడని తెలిసిపోతుంది.

"మామీద పోలీస్ రిపోర్టు ఇచ్చావటగా? స్టూడెంట్స్ అందరిని రక్షిస్తానని శపథాలు చేశావటగా? ఇప్పుడు ఆ స్టూడెంట్స్ నుండే నిన్ను నీవు కాపాడుకో" ఫ్యాక్టరీ సైరన్ మాదిరి వుందా దృఢకాయుడి కంఠం.

"నువ్వెవరూ?" అడిగారు విశ్వనాథం గారు.

"కరీం దాదా!" లోపలకు వస్తూ చెప్పాడతను.

కరీం దాదా వెనికే వచ్చారు కొంతమంది విద్యార్థులు. గాజు కళ్ళతో, శుష్క శరీరాలతో వున్న రమేష్‌ను అతని స్నేహితులను చూస్తూనే ఆందోళన చెందారు విశ్వనాథంగారు.

డ్రగ్ అడిక్ట్స్‌కు శరీరంపైన డ్రగ్ ప్రభావం పోయిన మరుక్షణమే నిస్సత్తువగా వుంటుంది. మళ్ళీ ఆ డ్రగ్ తీసుకోవాలనిపిస్తుంది. డ్రగ్ అందుబాటులో వుంటే ఫరవాలేదు. లేకపోతే శరీరం వారిమాట వినదు. తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురి అవుతారు.

ఆ చిత్రహింసనుండి బయట పడేందుకు ఏ పని చెయ్యమన్నా చేస్తారు. యువతులు వేశ్యలుగా మారడానికి కూడా ఏమాత్రం సందేహించరు. ఇక డ్రగ్ అడిక్ట్స్ అయిన యువకులు డబ్బుకోసం దొంగతనాలు, దోపిడీలు చేస్తారు. వారిచేత హత్యలు కూడా చేయించవచ్చును. కొద్ది మోతాదులో డ్రగ్ ఇస్తే చాలు.

ఇప్పుడు రమేష్ అతని స్నేహితులు వున్న పరిస్థితి అదే. కంగారుగా వారివైపు చూశారు విశ్వనాథంగారు.

జేబులోనుండి కొన్ని చాక్లెట్స్ తీశాడు కరీం దాదా. బ్రౌన్ షుగర్ నింపిన చాక్లెట్స్ అవి.

వాటిని చూడగానే చిన్నపిల్లల్లా కేరింతలు కొట్టారు

వాళ్ళు. కరీందాదా తల ఎగరేశాడు. ఎదుట వుంది తమ గురువని ఒక్క క్షణం కూడా ఆలోచించలేదు వాళ్ళు. విశ్వనాథంగారి కడుపులో మెత్తగా దిగిపోయాయి వాళ్ళ చేతుల్లోని పిడిబాకులు. బయటకు లాగి మళ్ళీ పొడిచారు రమేష్ అతని స్నేహితులు.

కెవ్వున అరవబోయింది విశ్వనాథంగారి భార్య. కరీందాదా చేతులలో తళతళలాడుతూ ప్రత్యక్షమయింది పన్నెండంగుళాల హంటింగ్ బ్లేడ్.

రివ్వునపోయి ఆమె కంఠంలో దిగిపోయిందది. అమాంతం వెనక్కి విరుచుకు పడిపోయిందామె.

నీళ్ళు నిండిన కళ్ళతో అటు చూశారు విశ్వనాథం గారు. నిలువెల్లా రక్తంతో తడిసి పూచిన మోదుగు చెట్టులా వుందాయన శరీరం. అలాగే భార్య శవం దగ్గరకు వెళ్ళబోయారాయన. సాధ్యం కాలేదు.

వికృతంగా నవ్వాడు కరీందాదా. "మాకు అడ్డురావడానికి పెద్ద పెద్దవాళ్ళే భయపడతారు. నీ వెంత? నీ బ్రతుకెంత? విద్యార్థులనందరినీ రక్షిస్తానన్నావుగా, ఇప్పుడు నిన్నెవరు రక్షిస్తారు?" కసిగా అడిగాడు.

అవును! ఎవరు రక్షిస్తారు? మాదకద్రవ్యాలతో నిర్వీర్యమై పోతున్న ఈ దేశ యువతను ఎవరు రక్షిస్తారు? హత్యలతో, దోపిడీలతో తల్లడిల్లే ఈ సమాజాన్ని ఎవరు రక్షిస్తారు?

## 5

"రూం నెంబర్ ఫోర్ జీరో. ఇట్ ఈజ్ ఫర్ యూ" ఒక్క అంగలో టెలిఫోన్ చేరాడు సింధూర్. రిసీవర్ చెవికి ఆనిస్తూనే వినబడింది మైకేల్ కంఠం.

"వెంటనే బయలుదేరి రాగలవా?" అడిగాడు

మైకేల్.

"అర్జెంటా?"

"అవును. నీకోసం ఒక పని ఎదురు చూస్తుంది."

"సరే వస్తున్నా!" రిసీవర్ హుక్ పై వుంచాడు సింధూర్.

తిరిగి తన రూం వైపు నడిచాడు. అది యూనివర్సిటీ హాస్టల్. పోస్టు గ్రాడ్యుయేషన్ వారికి సెలవులు ప్రారంభం కావడంతో చాలా తక్కువమంది స్టూడెంట్స్ మాత్రమే వున్నారు.

కారిడర్‌లో కొంతమంది విద్యార్థులు పోట్లాడుకుం టున్నట్లు మాట్లాడుకొంటున్నారు. ఒక నీగ్రో విద్యార్థి కారిడర్ స్తంభానికి ఆనుకుని సిగరెట్ త్రాగుతున్నాడు. అయితే ఆ సిగరెట్‌లో పొగాకు లేదని, హెరాయిన్ వుందని అతని అర్ధనిమీలిత నేత్రాలు చెప్పక చెబుతున్నాయి.

అది టిల్డు బ్లాక్. కేవలం ఫైన్ ఆర్ట్స్ స్టూడెంట్స్ కొరకు ప్రత్యేకించబడింది.

ఎవరి గదిలోనుండో లీలగా గిటార్ శబ్దం వినబడుతుంది. ప్రతీ సాయంత్రం అక్కడ ఏదో ఒక గదినుండి గిటార్, డ్రమ్స్ మొదలైన వాయిద్యాలు వినబడతాయి.

మెల్లిగా తన రూం చేరుకున్నాడు సింధూర్. టీపాయ్ పై ఆమ్లెట్, మరోప్రక్క బీరుతో నిండిన గ్లాసు వున్నాయి. బీర్ అంటే ప్రాణం ఇస్తాడు సింధూర్. ఎంత చలికాలమైనా అతడు బీరు త్రాగుతాడు. అది తప్ప యే ఆల్కహాలిక్ డ్రింక్ ముట్టుకోడు.

గ్లాసులోని బీరు ఒక్క గుక్కలో ఫినిష్ చేశాడు. మంచంక్రిందనున్న బీరుబాటిల్ తీసి అందులో మిగిలిన

కాస్త డ్రింక్ గ్లాసులోనికి వంపాడు.

ఒక టూరిస్టు ఏజన్సీ నుండి వచ్చిన పిలుపది. వచ్చే స్కాలర్ షిప్ పూర్తిగా సరిపోక, కొన్ని చిన్న చిన్న జాబ్స్ చేస్తున్నాడు సింధూర్.

అందులో ఈ టూరిస్టు ఏజన్సీకి గైడ్ గా పనిచేయడం ఒకటి.

ఖాళీ అయిన గ్లాసు టీపాయ్ పై వుంచి లేచాడు సింధూర్. గోడకు వున్న స్వెట్టర్ తీసుకుని తొడుక్కున్నాడు. డ్రాయర్ సొరుగునుండి చలికాలం ఉపయోగించే గ్లొవ్స్ తీశాడు.

బయటకు వచ్చి రూం తలుపులు వేశాడు. తాళం వేయబోతూ, ఒక్క క్షణం ఆగి మళ్ళీ లోపలకు వచ్చాడు. టీపాయ్ పై వున్న ఆమ్లెట్ తీసి నోట్లో కుక్కుకున్నాడు.

హాస్టల్ బయట స్కూటర్ పార్కింగ్ ప్లేస్ లో వున్న హీరో హోండా బయటకు తీశాడు. అతని ఫ్రెండ్ వినోద్ బైక్ అది. సెలవులకు వినోద్ వాళ్ళ ఊరు వెళుతుంటే పోట్లాడి మరీ బైక్ లాక్కున్నాడు సింధూర్.

వర్షం సన్నగా పూలజల్లులా పడుతుంది. గొర్రె పిల్లను మింగి కదలలేక పడున్న కొండచిలువలా వున్న రోడ్డుపై మోటార్ బైక్ వేగంగా పోనిచ్చాడు.

పగలు వచ్చిపోయే వాహనాలతో, హడావుడిగా తిరిగే ప్రజలతో గందరగోళంగా వుండే బజారు రాత్రి కావడంతో కాస్త ప్రశాంతంగా వుంటుంది. అందులోనూ ఇప్పుడు వర్షంపడుతూ, చలిగాలి వీస్తుండడంతో ఎక్వరూ లేరు.

సిటీ అలా వున్నప్పుడు చూడటం సింధూర్ కు చాలా ఇష్టం. సుషుప్తిలో మహా నగరం.

రోడ్డుపై ఒక మనిషి నిల్చుని ఆపమన్నట్లు చెయ్యి ఊపుతున్నాడు. దగ్గరగా పోనిచ్చి బ్రేక్ వేశాడు సింధూర్.

విపరీతంగా తాగాడని అతనిని చూస్తేనే తెలుస్తుంది. అతని శ్వాసనుండి ఆల్కహాల్ వాసన గుప్పుమంటుంది. ఎర్రబడిన అతని కన్నులు మత్తులో సోలిపోతున్నాయి.

"జగదాంబ సెంటర్ కు పోనీ" వెనుక కూర్చుంటూ చెప్పాడతను.

"మీరు వున్నది జ గ దా ం బ సెంటర్ లోనా?" చెప్పాడు సింధూర్.

"మీ టాక్సీవాళ్ళ దొంగవేషాలు నాకు తెలుసు. పోని.... పోనీ."

"అది కాదండి" ఏదో చెప్పబోయాడు సింధూర్.

వినిపించుకోలేదతను. ఆ మనిషి తనను వదలడని అర్థమైంది సింధూర్ కు.

స్పీడ్ గా మోటార్ బైక్ ను అక్కడే రెండు రౌండ్లు తిప్పాడు. ఆ తర్వాత బ్రేక్ వేసి చెప్పాడు.

"జగదాంబ సెంటర్ వచ్చింది దిగండి."

వెంటనే దిగిపోయాడామనిషి. జేబునుండి రెండు వందరూపాయిల నోట్లు తీశాడు.

"ఎక్కువగా త్రాగారా?" జాలిగా అడిగాడు సింధూర్.

"లేదు. స్నానం చెయ్యాలనిపించి బ్రాందితో స్నానం చేశాను. పోతే నీకో చిన్న సలహా. అంత వేగంగా ఎప్పుడూ బండితోలకు. యాక్సిడెంట్లు అవుతాయి" సీరియస్ గా చెప్పాడతను.

ఇంక ఒక్క క్షణం కూడా ఆగలేదు సింధూర్. వెనుక

నుండీ అతను పిలుస్తున్నా వినకుండా వేగంగా పోనిచ్చాడు.

అప్పటికే చాలా ఆలస్యం అయ్యింది. కాస్త దగ్గర దారినుండి వెళ్ళాలి. కాని ఆ గల్లీలు చాలా ప్రమాదకర మైనవిగా చెబుతారు.

అయినా బైక్ అటు తిప్పాడు సింధూర్. పచ్చి నెత్తురు తాగే గూండాలకు చేతివాచి కోసం చెయ్యి నరుక్కుపోయేంత కిరాతకులకు స్థావరాలు ఆ వీధులు. పట్టపగలే మామూలు పౌరులు ఎవ్వరూ అటువైపురారు.

బండి వేగంగా పోనిస్తున్నాడు సింధూర్. డేగ కళ్ళతో చుట్టూ జాగ్రత్తగా చూడసాగాడు. అతని శరీరంలో రక్తం వేగంగా ప్రవహిస్తుంది. అతని గుండె వేగంగా కొట్టుకుంటుంది. ఏ క్షణాన అయినా కొంత మంది మనుషులు తనను అటకాయించవచ్చు. వంటిమీది బట్టలతో సహా లాక్కోవచ్చును.

అయితే అటువంటి ప్రమాదమేది అతనికి ఎదురవ్వ లేదు.

అంతకు వెయ్యిరెట్లు భయంకరమైన ప్రమాదం ఎదురైంది.

ఒక సందులోనికి మోటార్ బైక్ పోనివ్వబోతూ చటుక్కున బ్రేక్ వేశాడు సింధూర్. ఎదురుగా కనిపిస్తున్న దృశ్యాన్ని చూస్తూనే అతని గొంతు ఎండి పోయింది. స్నానం చేసినట్లు వళ్ళంతా చెమటతో తడిసి పోయింది.

బిగ్గరగా అరవబోయాడు. కాని తడారిపోయిన అతని గొంతునుండి శబ్దం బయటకు రాలేదు.

# 6

సన్నగా వానతుంపరలు పడుతున్నాయి. పూలజల్లులా పడుతున్న ఆ వాన చినుకులమధ్య ఒక ముసలివాడు నడవలేక నడుస్తున్నాడు. చలిగాలికి వణుకుతూ అలాగే ఆ సన్నని వీధిలోకి ప్రవేశించాడు.

నిర్మానుష్యంగా వుందా వీధి. నగరం నడిబొడ్డున వున్న ఆ వీధిలోనికి పగలే యెవ్వరూ అడుగుపెట్టరు. రాత్రి కలలో కూడా ఆ వీధి పేరు పలవరించరు.

అటువంటి వీధిలోనికి యేదో సాధించడానికన్నట్లు నడవలేక నడుస్తున్నాడా వృద్ధుడు.

చాలా ఇరుకుగా వుందా సందు. అటు ఇటు ఎత్తైన పాతకాలపు భవనాలతో, వాటిమధ్య ఇరుక్కున్న రహదారితో వుందా సందు.

హఠాత్తుగా ఆ వృద్ధుని దారికి ఒక దృఢకాయుడు అడ్డుపడ్డాడు. వాలిపోతున్న కనురెప్పలు బరువుగా ఎత్తి అతని ముఖంలోనికి చూసాడా వృద్ధుడు.

“ఏం ముసలోడా! ఏడకుపోతున్నావ్?” కరకుగా అడిగాడా దృఢకాయుడు.

ఏదో గొణిగాడా వృద్ధుడు. తనలో తను మాట్లాడుకుంటున్నట్లు చిన్నగా ఏదో చెప్పాడు.

“ఖబరస్తాన్‌కు పోతాడేమో? పంపించెయ్ భాయ్” వృద్ధుడి కుడివైపునుండి మరో కంఠం వినబడింది.

మెల్లిగా తలతిప్పి చూసాడా వృద్ధుడు. ఎప్పుడు వచ్చారోగాని ఆ వృద్ధుడి వెనుక నిలబడివున్నారు నలుగురు వ్యక్తులు. వాళ్ళను చూడగానే వీధి గూండాలని తెలిసిపోతుంది. చాలా మొరటుగా వున్నారావ్యక్తులు.

“చెప్పవే! ఎక్కడికి?” మరింత కటువుగా అడిగాడు

ఇంకో వ్యక్తి.

"బ్రౌన్ ....బ్రౌన్ షుగర్ కావాలి." వణుకుతున్న కంఠంతో చెప్పాడా వృద్ధుడు.

ఒకరిముఖం ఒకరు చూసుకున్నారా అయిదుగురు.

"ఇక్కడ బ్రౌన్ షుగర్ దొరుకుతుందని ఎవరు చెప్పారు?" వృద్ధుడిని మొదట ఆటకాయించిన దృఢకాయుడు అడిగాడు. బదులు చెప్పలేదా ముసలివాడు. తన చేతిలోని గుడ్డసంచి విప్పి వారికి చూపించాడు. తెళతెళలాడే సరికొత్త కరెన్సీనోట్లు వున్నాయాసంచిలో.

"డబ్బు తెచ్చాను. దయచేసి సరుకు ఇవ్వండి" చెప్పాడా వృద్ధుడు.

ఆ డబ్బు చూడగానే తళుక్కున మెరిసాయి ఆ హీరోలకళ్ళు. అయినా వాళ్ళు తొందరపడలేదు.

"మా దగ్గరకు నిన్ను ఎవరు పంపారు?" తీక్షణంగా చూస్తూ తిరిగి ప్రశ్నించాడు.

"మీకు నాకు తెలిసినమనిషే." అన్నాడావృద్ధుడు. అతని కాళ్ళు చేతులు వణికిపోతున్నాయి. మోకాళ్ళపై కూర్చుండిపోయాడా వృద్ధుడు.

ఆ ముసలివాడి నోటినుండి తెల్లటి నురుగు రావడం మొదలుపెట్టింది. కళ్ళు పైకెత్తి చుట్టూవున్న వారివంక దీనంగా చూసాడు.

"ఎవరు పంపారు నిన్ను?" తిరిగి అదే ప్రశ్న వేసాడా దృఢకాయుడు.

"దీనదయాళ్"

"దీనదయాళ్? ఎక్కడవున్నాడు వాడు?"

"ఈ నగరంలోనే వున్నాడు. నేను డబ్బు తీసుకుని వెళితే ఇక్కడ దొరుకుతుందని చెప్పాడు."

ఆ మాటలతో తృప్తి చెందలేదా వృద్ధ కాయుడు. ఇంకేదో అడగబోయాడు.

"పోనీసాబ్! ముసలోడేగా ఇచ్చేద్దాం" ప్రక్క నున్న హీరో చెప్పాడు.

ఎందుకంటే డ్రగ్సుకు అలవాటు పడ్డవాని లక్షణాలు ఆ ముసలివాడిలో క్లియర్‌గా కనిపిస్తున్నాయి.

ఆ క్షణానికి అదే నిర్ణయానికి వచ్చాడా వృద్ధ కాయుడు. ఎడమప్రక్కవున్న వ్యక్తిని చూసి సైగ చేసాడు.

సమీపంగావున్న ఒక ఇంటిలోనికి వెళ్ళాడావ్యక్తి. కాస్సేపటికి చేతిలో చిన్న పాకెట్‌తో వచ్చాడు. ఆత్రంగా దాన్ని అందుకోబోయాడా వృద్ధుడు. ఇవ్వ లేదావ్యక్తి. ఎదురుగావున్న వృద్ధ కాయుడివైపు చూసాడు.

ఆ చూపుకి అర్థం తెలిసినట్లు తన చేతిలోని డబ్బు సంచి అతనికి అందించాడా వృద్ధుడు. ఆ వెంటనే ఆ వ్యక్తి చేతిలోని పాకెట్ అందుకున్నాడు. కొద్దిగా ఒకమూల చింపి కొంచెం పౌడర్ రెండువేళ్ళతో తీసి నాలుకపై పెట్టుకున్నాడు. అచ్చమైనసరుకు.

నెమ్మదిగా వెనుతిరిగాడా ముసలివాడు. నాలు గడుగులు కూడా వేయకముందే ఆగిపోయాడు. ఎదురుగా రోడ్డును కవర్ చేస్తూ నిలబడివుందో పర్సనాలిటి.

ఆరడుగుల రెండంగుళాల ఎత్తులో మర్రిచెట్టు మొదలులా గుండ్రంగావున్న ఆ పర్సనాలిటీని చూస్తూనే గొంతు తడారిపోయింది ఆ వృద్ధుడికి.

క్రిమినల్ వరల్డులో మోస్టు డేంజరస్ పర్సన్‌గా పిలవ బడే అతని పేరు కరీమ్. ఇండియన్ పోలీస్ రికార్డ్సులో

కరీమ్ దాదా పేరు అనేక నేరాలతో ముడిపడివుంది. కానిస్టేబుల్ నుండి పెద్ద పెద్ద పోలీస్ ఆఫీసర్స్ కూడా కరీమ్ దాదా పేరు చెబితే నిద్రపోరు. కరీమ్ దాదా ఏ వీధిలో అడుగుపెట్టితే ఆ వీధిలో దుకాణాలు వెంటనే మూతబడిపోతాయి. క్షణాలలో ఆ వీధి నిర్మానుష్యంగా మారిపోతుంది.

అతను అడుగుపెట్టిన చోట శవాలు గుట్టలు గుట్టలుగా పేరుకుంటాయి. అతని కంఠం వినబడ్డచోట ఆక్రందనలు, హాహాకారాలు కూడా వినబడతాయి.

అటువంటి కరీమ్ దాదా తనముందు నిలబడివున్నాడు.

"ఏం సురేష్ సాబ్! మా వాళ్ళదగ్గర సరుకు కొనడానికి వచ్చారా?" కూల్ గా అడిగాడు కరీమ్ దాదా.

ఆ వృద్ధుడు ఏమి మాట్లాడలేదు. కాని అక్కడికి కాస్త దూరంలో నిలుచున్న దృఢకాయుడు పరుగున వచ్చాడు.

"కరీమ్ దాదా! ఇతన్ని మన దీనదయాళ్ పంపా...."

అతనిమాట పూర్తి కాకుండానే ఐరన్ హామర్ లా వున్న కరీమ్ దాదా చెయ్యి మెరుపులా కదిలింది.

దెబ్బ వెంటనే గాల్లోకి లేచింది దృఢకాయుడి శరీరం. అతని నోటినుండి ఎర్రటి నెత్తురు వరదలా నేలపైకి జారింది.

"పోలీస్ పక్క ఆరు మైళ్ళ దూరంలోవున్నా పసిగట్టలేసిందిపోయి, మన మధ్యకువచ్చిన పోలీసువాడికి సరుకు ఇచ్చి పంపుతారా?" ఇనుపగోలుసులు రాసుకుంటున్నట్లు వుంది కరీమ్ దాదా కంఠం.

ఆ మాటలతో క్రిందపడ్డ దృఢకాయుడితో సహా చుట్టూవున్న హీరోల ముఖాలు నల్లగా మాడిపోయాయి. భయంతో వణికిపోతూ ఆ వృద్ధుడివైపు చూసారు. అతడు

పోలీస్ ఆఫీసరా? అయితే డ్రగ్స్‌కు అలవాటుపడ్డ వానిలా నటించాడన్నమాట. తామందరిని ఫూల్స్ చేసాడు. వృద్ధుడి వేషంలోవున్న సురేష్‌కు పరిస్థితి విషమించిందని అర్థమయ్యింది.

వెంటనే పైజామాజేబులో చెయ్యిపెట్టి రివాల్వర్ తియ్యబోయాడు.

అయితే అంతకన్నా కొద్దిక్షణాలముందే కదిలింది కరీమ్ దాదా చెయ్యి.

మెరుపు మెరిసినట్లూ అతని చేతిలో ప్రత్యక్షమయిందొక డాగర్. గాలిని చీల్చుకుంటూ వెళ్ళి సురేష్ కంఠంలో దిగిపోయిందది.

జేబులోనికి వెళ్ళిన సురేష్ చెయ్యి పూర్తిగా బయటకు రాకముందే అతని శరీరం వెనక్కు పడిపోయింది. పీక కత్తిరించబడ్డ కోడిపుంజులా గిలగిలా కొట్టుకున్నాడతను. కొద్దిసేపటిలోనే అతని శరీరంలో చలనం ఆగిపోయింది.

"కరీమ్‌దాదా!" సరిగ్గా ఆదేసమయంలో అరిచాడొక దృఢకాయుడు.

అతను చూస్తున్నవైపే చూసిన కరీమ్‌దాదా కనుబొమ్మలు ముడిపడ్డాయి.

సుమారు పాతిక సంవత్సరాల వయసున్న యువకుడు వున్నాడక్కడ. ఆ సందు చివర స్కూటర్‌పై కుడికాలు నేలకు ఆన్చి కూర్చునివున్నాడు.

కరీమ్‌దాదా తనవైపు చూడగానే స్కూటర్ వేగంగా వెనక్కు త్రిప్పాడు.

చటుక్కున జేబునుండి రివాల్వర్ తీసాడు కరీమ్ దాదా. అయితే అది పేలకముందే ఆ వీధిలో పోలీస్ బూట్లచప్పుడు మారుమ్రోగింది.

సుంద్రాయిపై కొట్టిన కుండ పెంకుల్లా చెల్లాచెదురై పోయారు కరీమ్‌దాదా అతని అనుచరులు. క్షణాలపైన ఆ ప్రదేశంనుండి మాయమైపోయారు.

పరుగున వచ్చిన పోలీస్ బలగానికి రోడ్డుపై అడ్డదిడ్డంగా పడివున్న సురేష్ శవం వికృతంగా కనబడింది.

7

టూరిస్టు ఏజన్సీ భవనం చీకటిలో మునిగి తేలుతుంది. ఆ బిల్డింగ్‌లో లైట్లు డిమ్ముగా వెలుగుతున్నాయి. డైరెక్టర్ రూం బయట వున్న సోఫాలో కూర్చున్నాడు సింధూర్. ఆ సోఫా ప్రక్కనే ఒక బల్ల వుంది. దాని పైన ఒక టైప్‌రైటరుంది.

ఆ బల్ల వెనుక ఒక కుర్చీ వుంది. ఆ కుర్చీలో ఒక అందాల భామ వుంది.

ఆమె నాజూకైన చేతివేళ్ళు ఆ టైప్ మిషన్‌పై చకచక కదులుతున్నాయి. మరో మనిషి అక్కడ కూర్చున్న ధ్యాసే ఆమెకు లేదు.

ఆ టైప్ సుందరి గురించి సింధూర్‌కు బాగా తెలుసు. సింధూర్ను ఎన్నిమార్లు చూసినా ఆమె చూడనట్లే ప్రవర్తిస్తుంది.

ఆమె స్వభావం బాగా తెలిసిన సింధూర్ ఆమెను ఎప్పుడూ ఆటపట్టిస్తూ వుంటాడు. కాని ఈ రోజు అతను ఇవేమి ఆలోచించే పరిస్థితిలో లేడు.

వచ్చేటప్పుడు దార్లో చూసిన హత్యే అతని కళ్ళముందు మెదులుతుంది.

డైరెక్టర్ గదినుండి బెల్ మ్రోత వినబడింది. టైప్ మిషన్ టకటక ఆగిపోయాయి. దాని ఓనరు లోపలకు నడిచింది.

కొన్ని క్షణాల తర్వాత బయటకు వచ్చిందామె. మొఖాన్ని భావరహితంగా పెట్టి, సోఫాలో, లైవ్ మిషన్‌లో చెప్పినట్లు చెప్పింది.

"డైరెక్టర్ పిలుస్తున్నారు."

లోనికి నడిచాడు సింధూర్. లోపల గదిలో డైరెక్టర్ మైకేల్, అతనితోపాటు ఒక విదేశీయుడు కూర్చుని వున్నారు.

మైకేల్ ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు సింధూర్. మైకేల్ ఒక ఫైల్ తెరిచి ఏదో కాగితం కొరకు తీవ్రంగా వెతుకుతున్నాడు. అతనెప్పుడూ యేదో ఒకదానిని వెతుకుతూనే వుంటాడు. అది పేపర్ కావచ్చు, పేపరు వెయిట్ కావచ్చు. తాను భారత ప్రధానికన్నా బిజీగా వున్నానని అందరికి తెలియాలన్నదే అతని కోరిక.

తన ప్రక్కనే కూర్చున్న విదేశీయుడి వంక చూశాడు సింధూర్. ఆ అమెరికన్ సింధూర్ వంకే పరీక్షగా చూస్తున్నాడు. నిర్లక్ష్యంగా చూపుకు చూపు బదులిచ్చాడు సింధూర్.

"మీకు గైడ్‌గా వ్యవహరించేది ఇతనే. సింధూర్! ఈయన పేరు రొనాల్డు. అమెరికన్. మన సిటీలో ఇతనికి నీవు గైడ్‌గా వ్యవహరించాలి" పరిచయాలు చేశాడు మైకేల్.

"నీకు సిటీ మొత్తం తెలుసా?" అడిగాడు రొనాల్డు.

"నా అరచేతిలో రేఖలంత బాగా తెలుసు" కుర్చీలో వెనక్కి వాలబడుతూ చెప్పాడు సింధూర్.

"ఈ క్షణంనుండి నీవు నా దగ్గరే వుండాలి. నీకయ్యే ఖర్చు మొత్తం నేను భరిస్తాను, నేను చెప్పిన చోటుకు నేను చెప్పిన సమయానికి నీవు తీసుకు వెళ్ళాలి. నాతో

పాటు నా హోటల్‌లోనే నీవుండాలి" రోనాల్డు చెప్తున్నది వింటూనే మైకేల్ వైపు చూశాను సింధూర్.

"మన ఏజన్సీ నీకు ఎప్పుడూ ఇచ్చేదానికి రెట్టింపు ఇస్తాం సింధూర్" చెప్పాడు మైకేల్.

"డబ్బు గురించి నీవు బాధపడవద్దు. నా పనవ్వగానే ఈ దేశం వదిలి వెళ్ళేటప్పుడు నీకు మరికొంత డబ్బు ఇస్తాను" చెప్పాడు రోనాల్డు.

తల వూపాడు సింధూర్. అంతలోనే తేలుకొండిలా చిన్న ప్రశ్న అతని మనసును తొలచసాగింది. రోనాల్డు ఈ దేశం చూడటానికి రాలేదా? ఏదో పనిమీద వచ్చాడా? ఏమిటది?

అడుగుదామని వున్నా అడగలేదు సింధూర్.

"నాకు ఒకగంట టైమ్ కావాలి. హాస్టల్‌కు వెళ్ళి వస్తాను" చెప్పాడు సింధూర్.

"సరే! సరిగ్గా గంటలో హోటల్ పారడైజ్ రూం నెంబర్ వన్ట్వోటికి రావాలి."

రోనాల్డు వద్ద, మైకేల్ వద్ద సెలవు తీసుకుని హాస్టల్ వైపు బయలుదేరాడు సింధూర్.

హాస్టల్ గేటు మూసివుంది. బయటనుండి వాచ్‌మెన్ పీటర్‌ను పిలిచాడు సింధూర్.

ఎవ్వరూ బదులు పలకలేదు. సంధూర్‌కు పీటర్ గురించి బాగా తెలుసు. వాడు హాస్టల్ విద్యార్థులపైన వార్డెన్‌కంటే, ప్రిన్సిపాల్‌కంటే బాగా అజమాయిషీ చేస్తాడు. అందులోను ఇలా ఆలస్యంగా హాస్టల్‌కు వస్తే వాడు ఒక దేశానికి మిలటరీ జనరల్ అయినంత ఫోజులో మాట్లాడతాడు.

అందుకే హాస్టల్ విద్యార్థులు వాడికి ముద్దుగా "అట్ట

ప్రిన్సిపాల్" అనే పేరు పెట్టారు.

చాలాసేపటి తర్వాత వచ్చి గేటు తీశాడు పీటర్. సగం నిద్రలో బయటకు వచ్చిన వాడి ముఖంలో చిత్ర విచిత్రమైన భావాలు కనబడుతున్నాయి.

"ఇంతసేపు ఎక్కడికి వెళ్ళారు?" అడిగాడు పీటర్.

బదులు చెప్పలేదు సింధూర్. జేబులోనుండి ఒక ఇరవై రూపాయలనోటు తీసి వాడి చేతికి ఇచ్చాడు.

"వార్డెన్ గారు గంటసేపటినుండి మిమ్మల్ని అడుగుతున్నారు."

అది అబద్ధమని సింధూర్‌కు తెలుసు. ఇంకో పది రూపాయిలనోటు తీసి వాడిచేతిలో పెట్టాడు. వెంటనే వంగి సలామ్ చేశాడు పీటర్.

"గదిలోనికి వెళ్ళి రెస్టుతీసుకోండి సాబ్!" ఆప్యాయంగా చెప్పాడు.

"మళ్ళీ నేను వెళ్ళిపోవాలి పీటర్. కొంతకాలందాకా రాను వార్డెన్‌కు ఆ విషయం చెప్పు."

మాట్లాడకుండా వెళ్ళి రిజిష్టర్ తెచ్చాడు పీటర్. అందులో పోస్టుగ్రాడ్యుయేషన్ వారికి సెలవులు కనుక తాను ఇంటికి వెడుతున్నట్లు వ్రాసి సంతకం చేశాడు.

రూంలోనికి వెళ్ళి ఎయిర్ బాగ్‌లో రెండుజతల బట్టలు సర్దాడు సింధూర్. తన రూంమేట్ వినోద్ వస్తే చూసేలా ఒక లెటర్ వ్రాసి టీపాయ్‌పైన పెట్టాడు.

ఆ తర్వాత విండో కిటికీ మూయబోతూ క్రిందకు చూసి ఆగిపోయాడు.

హాస్టల్ గేటు బయట చీకటిలో నిలబడి వున్నాడొక వ్యక్తి. మూసివున్న గేటుగుండా లోపలకు చూస్తున్నాడు.

వెంటనే రూంలోని లైటు ఆర్పివేసాడు సింధూర్. కిటికీ గుండి అతడిని జాగ్రత్తగా గమనించసాగాడు.

పార్కింగ్ ప్లేస్ వైపు చూస్తున్నాడా వ్యక్తి. తను స్టాండుతనిన హీరో హోండా వైపు తదేకంగా చూస్తున్నాడు.

అతడిని మరింత పరిశీలనగా చూసాడు సింధూర్. మరుక్షణం ఉలిక్కిపడ్డాడు. తను చూసిన హంతకులలో వీడు కూడా వున్నాడు.

అంటే....అంటే....వీళ్ళు తనను వెంటాడుతున్నారన్నమాట.

అవును! వీళ్ళు చేసిన హత్యకు తను ప్రత్యక్ష సాక్షి. కాబట్టి ఖచ్చితంగా తనను చంపాలనుకుంటారు.

కిటికీ తలుపుశబ్దం కాకుండా మూసివేసాడు. మంచం పైన పెట్టిన ఎయిర్ బాగ్ భుజాన వేసుకుని తలుపు తాళంవేసి బయటకు నడిచాడు సింధూర్.

అయితే వీధి గేటువైపు వెళ్లలేదు. వెనుక దారిగుండా బయటకు నడిచాడు.

యూనివర్శిటీ కాలనీ నుండి కాలినడకన పట్టణంలోనికి వెళ్ళాడు సింధూర్. రాత్రి పదిగంటల సమయం. పట్టణంలో కొంతభాగం నిద్రలో వుంది. లిక్కరు షాపులు మాత్రం తెరిచి వున్నాయి.

పారడైజ్ హోటల్ లోనికి ప్రవేశించాడు సింధూర్. రిసెప్షన్ వద్ద ఒక మధ్య వయస్కుడు కునికిపాట్లు పడుతున్నాడు.

శబ్దంకాకుండా మెట్లెక్కి పైఅంతస్థు చేరాడు.

ఒన్ ట్వంటీ నెంబర్ రూం వెదికి ఆ తలుపు మూని

కేకతో తట్టాడు సింధూర్. ఎవ్వరూ బదులు పలకలేదు.

"మిస్టర్ రోనాల్డ్" తలుపుపై తడుతూ తిరిగిపిల్చాడు సింధూర్.

తక్షణ తెరుచుకుంది తలుపు. లోపల మృత్యువు విలయతాండవం చేస్తుందని తెలియని సింధూర్ లోపలకు అడుగు పెట్టాడు. అతని వెనుకే తలుపు మూసుకుపోయింది.

## 8

"విద్యార్థి లోకం రోజు రోజుకు దిగజారిపోతుంది. ఇదివరకు అల్లరు చేయడం, రాగింగ్ చేసి ఇతర విద్యార్థులను ఏడిపించడం వంటి చిన్న చిన్న గొడవలు మాత్రమే విద్యార్థుల వైపునుండి వచ్చేవి. కాని ఇప్పటి పరిస్థితి అది కాదు."

ఒక్క క్షణం తన వుపన్యాసాన్ని ఆపి చుట్టూ వున్న వారిని పరీక్షగా చూసారు పోలీస్ కమీషనరు. అందరూ ఉదేకంగా వింటున్నారు. అక్కడ వున్న వారంతా పెద్ద పెద్ద రాంకులలోవున్న పోలీస్ ఆఫీసర్స్.

"ఓ.పియం, ఎల్.యస్.డి, హెరాయిన్ ముఖ్యంగా బ్రౌన్ షుగర్ మొదలైన మత్తుమందులు తీసుకోవటం, వాటి ప్రభావానికి లోబడి వారు రాక్షసకృత్యాలు చెయ్యడం సాధారణ విషయం అయిపోయింది. ప్రపంచ యువత ఆరోగ్యాన్ని పీల్చి పిప్పిచేస్తున్న బ్రౌన్ షుగర్ భారతదేశంలోకి ప్రవేశించింది. ఈ పరిస్థితి ఇలా కొనసాగవలసిందేనా?" ప్రశ్నించారు కమీషనర్ గారు.

ఒక పోలీస్ ఆఫీసర్ తక్షణ లేచి నించున్నాడు.

"మాదకద్రవ్యాలు స్మగ్లింగ్ జరగకుండా అనేక చర్యలు తీసుకున్నాం సార్. అయినా సురక్షితులైన

కొందరు దుర్మార్గులు వాటిని ప్రభుత్వాధికారులకు తెలియకుండా విద్యార్థులకు అందిస్తున్నారు. ఈ విషయంలో ఇన్ స్పెక్టర్ సురేష్ కొంత సమాచారం సేకరించాడు. దాని ప్రకారం ఆ వ్యక్తులను రెడ్ హేండెడ్ గా పట్టుకోడానికి ప్రయత్నించాం. కాని దురదృష్టవశాత్తు ఆ దుర్మార్గులు సురేష్ ను హత్యచేసి తప్పించుకున్నారు" చెప్పాడా పోలీస్ ఆఫీసర్.

"అయితే అదే సమయంలో ఇంకో చిన్న ఆధారం దొరికింది సార్. విశ్వనాథం లెక్చరరుగారు కాలేజి ముందు మాదకద్రవ్యాలు విక్రయిస్తున్న వ్యక్తిని పట్టిచ్చారు. ఇంటరాగేషన్ లో అతను ఇంకా భయంకరమైన విషయం చెప్పాడు. మాఫియాకు చెందిన ఐదుగు వ్యక్తులు అధిక మొత్తంలో బ్రౌన్ షుగర్ సానిక డ్రగ్ ఎక్స్ఛేంజర్స్ కు అందించబోతున్నారని తెలిసింది. వెంటనే ఎటాక్ చేశాం. పోలీస్ కాల్పుల్లో ఒక వ్యక్తి మరణించాడు. మరో వ్యక్తి సరుకుతో సహా తప్పించుకున్నాడు. అతనికోసం నగరమంతా వలపన్ని వుంచాము" ముగించాడు ఆఫీసర్.

"అదీ పరిస్థితి" అందుకున్నారు పోలీస్ కమీషనర్. "ఆ బ్రౌన్ షుగర్ విద్రోహుల చేతికి అందకూడదు. మాదకద్రవ్యాల మత్తులో దానవుల మాదిరి ప్రవర్తిస్తున్న విద్యార్థులను రక్షించాలి. ఈ మత్తుమందుల రవాణా ముఖ్య స్థావరం ఈ సిటీలోనే వున్నదని ఆధారాలు చెబుతున్నాయి. కాబట్టి మీరేం చేస్తారో, ఎలా చేస్తారో నాకు తెలీదు. కాని స్మాష్ ద డ్రగ్ రాకెట్"

కమీషనర్ గారి కంఠం శంఖారావంలా ఆ గదిలో ప్రతిధ్వనించింది.

# 9

అతనివైపు చూస్తూనే నిశ్చేష్టుడైపోయాడు రోనాల్డు. సన్నగా పీలగా వున్న ఆ వ్యక్తిని చూసికాదు రోనాల్డు భయపడేది.

ఆ క్రొత్త వ్యక్తి చేతిలో ఒక పెద్ద డమ్‌డమ్ రివాల్వర్ వుంది. అది ప్రేలితే ఏమవుతుందో రోనాల్డుకు బాగా తెలుసు.

అదే సమయంలో బాత్‌రూం తలుపు తెరుచుకుంది. మరో ఆగంతకుడు అక్కడ నిలబడి వున్నాడు. అతని చేతిలో మాగ్నమ్ వుంది. తల్చుకుంటే ఆ వెపన్ నుండి పన్నెండు బుల్లెట్లు వరసగా బయటకు వస్తాయి.

“మిస్టర్ రోనాల్డు! మాఫియా నిన్ను నమ్మి ఎంతో విలువచేసే సరుకు అప్పగించింది. కాని ఇన్ని రోజులు గడిచినా ఆ సరుకు విషయంపై నువ్వు రిపోర్టు పంపలేదు. ఆ సరుకు యేమయిందో వివరాలు తెలీలేదు. అంటే నువ్వు మాఫియాకు ద్రోహం తలపెట్టావని అర్థం అవుతుంది” రోనాల్డు ముఖంలోనికి చూస్తూ చెప్పాడు మాగ్నమ్ పట్టుకున్న వ్యక్తి.

“నో....నో! మాఫియాకు ద్రోహంచేసే అభిప్రాయం నాకు ఎంతమాత్రంలేదు” ఖంగారుగా చెప్పాడు రోనాల్డు.

“అలాగా!” హేళనగా నవ్వాడు రివాల్వర్ పట్టుకున్న వ్యక్తి. “నువ్వు, చార్లెస్ కలిసి మొత్తం సరుకు పది మిలియన్ల డాలర్లకు సరిపడా బంగారానికి బేరం పెట్టడం అబద్ధమా? ఆ బంగారంతో బ్రిటన్ పారిపోవడానికి ఏర్పాట్లు చేసుకోవడం అబద్ధమా?”

రోనాల్డుకు గొంతులో పచ్చివెలక్కాయ అడ్డంపడి

నట్లయ్యింది. చార్లెస్ తనూ కలిసి బంగారంతో పారి పోవాలనుకోవడం నిజమే. కాని ఆ విషయం మాఫియాకు ఎలా తెలిసింది?

"నీవు తెచ్చిన డ్రగ్స్‌ను చార్లెస్ కరీందాదాకు బేరం పెట్టాడు. అవసరం కొద్దీ కరీందాదా అందుకు ఒప్పుకున్నాడు. మాఫియా మిమ్మల్ని సరుకు అమ్మమంది వేరే పార్టీకి. మీరు బేరం పెట్టింది కరీందాదాకు. సరిగ్గా అప్పుడే మాఫియాకు అనుమానం కలిగింది. దాంతో మీ మొత్తం పథకం బయటపడింది."

"బంగారం మొత్తం మాఫియాకే అప్పగిద్దామనుకున్నాము. కాని దారిలో పోలీస్ ఎటాక్‌లో చార్లెస్ చనిపోయాడు. సరుకు వున్న వాన్‌ను ఒకచోట దాచి నేను తప్పించుకున్నాను. అందువల్ల రిపోర్టు చెయ్యలేదు."

"వాన్ ఎక్కడ దాచావు?"

"చెబితే నన్ను వదిలేస్తారా?"

"లేదు! నమ్మకద్రోహాన్ని మాఫియా క్షమించదు."

"అంటే?" గద్గద కంఠంలో అడిగాడు రోనాల్డు.

"అంటే.........నీ మరణశాసనంపై మాఫియా హై కమాండ్ సంతకం చేసేసింది మిస్టర్ రోనాల్డు" చెప్పాడు మాగ్నమ్ పట్టుకున్న వ్యక్తి.

"సరుకు దాచినచోటు చెప్తే సుఖంగా చస్తావు. లేకపోతే నీవు పుట్టినందుకు విచారిస్తూ చస్తావు" చెప్పాడు రెండో వ్యక్తి.

రోనాల్డు గుండె దడదడలాడింది. మాఫియా పద్ధతులు ఎంత క్రూరంగా వుంటాయో తనకు బాగా తెలుసు. ప్రపంచంలో ఎక్కడ దాక్కున్నా తనను చంపడానికి ఆ గాంగ్ ప్రయత్నిస్తుంది.

హఠాత్తుగా తలుపుపై చప్పుడు వినబడింది.

"మిస్టర్ రోశాల్లు!" ఎవరో పిలుస్తున్నారు.

రివాల్వర్ పట్టుకున్న వ్యక్తి మాగ్నమ్ పట్టుకున్న వ్యక్తికి సైగ చేశాడు. ఆ మాఫియా గూండా తలుపు తెరిచాడు. సింధూర్ లోపలికి వచ్చాడు. వెంటనే తలుపు మూసుకుపోయింది.

ఒక్క క్షణం తాను చూస్తున్నదేమిటో సింధూర్‌కు అర్థం కాలేదు.

"ఇతడు నీ పార్ట్‌నర్ కదూ?" అడిగాడు రివాల్వర్ వ్యక్తి.

రోశాల్లు బ్రెయిన్ చకచక పనిచేసింది. "వాన్ యెక్కడ వుందో అతనికి తెలుసు. అతడిని అడగండి" ఏమాత్రం తొణక్కుండా చెప్పాడు.

ఒక్క క్షణం రివాల్వర్ పట్టుకున్న మాఫియా బర్డు దృష్టి సింధూర్ పైకి మళ్ళింది. మామూలు వ్యక్తులకు ఒక్క క్షణం అంటే కనురెప్ప మూసి తెరిచే కాలం.

కాని రోశాల్లు వంటి ఆరితేరిన నేరస్థుడికి అద్భుతాలు చెయ్యడానికి ఒక్క క్షణం చాలు.

ఆ వ్యక్తి దృష్టి సింధూర్ పైకి మళ్ళిన మరుక్షణం కాటంకుకోబోయే త్రాచులా కదిలాడు రోశాల్లు. మెరుపులా పైకిలేచిన అతని కుడిచెయ్యి పిడుగులా రివాల్వర్‌ని తాకింది.

ఎడంచేత్తో ఆ వ్యక్తిని తనపైకి లాక్కున్నాడు. సరిగ్గా ఆ దేశసమయంలో మాగ్నమ్ గర్జించింది. దాని బుల్లెట్లు మాఫియా బర్డు వీపులో దిగబడ్డాయి. రోశాల్లు చేతులలో వాలిపోయాడతను. అతని శరీరాన్ని ఎత్తి మాగ్నమ్ పట్టుకున్న వ్యక్తి పైకి విసిరాడు. ఆ వెనుకే

తనూ పరిగెత్తాడు.

బిగుసుకున్న రోనాల్డు పిడికిలి గదాదండంలా అతని కడుపును తాకింది. పొట్ట చేతులతో పట్టుకుని ముందుకు వంగాడతను. కత్తిలా అతని మెడను తాకింది రోనాల్డు చెయ్యి.

బ్యూటిఫుల్ వన్ మాన్ ఫైట్! సుశిక్షితుడైన సైనికుడిలా అంతా టైం ప్రకారం చేసేశాడు రోనాల్డు.

నేలపై పడివున్న శవాలను పిచ్చిగా చూశాడు సింధూర్.

"చూడు మిస్టర్ సింధూర్! ఇక్కడ చూసిన విషయాలు నువ్వు ఇక్కడే మర్చిపోవాలి" కఠినంగా చెప్పాడు రోనాల్డు.

చివ్వున తలెత్తి అతని ముఖంలోనికి చూశాడు సింధూర్.

"నేను కొన్ని లక్షలు విలువచేసే వస్తువులు ఒక మోటారు వాన్‌తో సహా ఒకచోట దాచాను. ట్రాజడీ ఏమిటంటే నాకు మీ దేశం పూర్తిగా కొత్త. ఆ వాన్ యెక్కడ దాచానో నాకే తెలీడంలేదు. ఆ వాన్ ఆచూకీ చెప్పమని వీళ్ళు నావెంట పడ్డారు" ఒక్క క్షణం ఆగి మళ్ళీ అన్నాడు రోనాల్డు.

"నీవు నాకు సహాయం చేయాలి సింధూర్. నీకు ఈ సిటీ అంతా బాగా తెలుసుకదా? ఆ వాన్‌ను కాచ్ చెయ్యడంలో నాకు సహాయం చెయ్యాలి."

సింధూర్ మాట్లాడకుండా అలాగే నిలబడ్డాడు.

"వాన్‌లో సరుకు నాకు దొరికిన మరుక్షణం నీకు పదిహేను వేలు ఇస్తాను. సరేనా!"

పదిహేను వేలు! సింధూర్ మనసు ఊగిసలాడసాగింది.

కాని ఒక స్మగ్లర్‌కు సహాయపడటం దేశద్రోహంకాదా?

"ఇరవై వేలిస్తాను సింధూర్! నువ్వు కేవలం వాన్ వున్న ప్రదేశం గుర్తిస్తే చాలు" చెప్పాడు రోనాల్డు.

వెంటనే ఒప్పుకున్నాడు సింధూర్. ఆ స్మగ్లర్ చేసే నేరాల్లో తాను భాగం పంచుకోవడం లేదుకదా! కేవలం ఆ ప్రదేశాన్ని లొకేట్ చేస్తే చాలు ఇరవై వేలు తన స్వంతం అవుతాయి.

అదే....తను తీసుకున్న ఆ నిర్ణయమే తనను అష్ట కష్టాల పాలు చేస్తుందని ఆ క్షణాన సింధూర్‌కు తెలియదు.

# 10

"సిటీ శివార్లలో అమర్‌నాథ్ కేవ్స్ వున్నాయి. అవునా?" సింధూర్ ముఖంలోకి చూస్తూ అడిగాడు రోనాల్డు.

"అవును. అవి శిధిల గుహాలు. ఆ ప్రాంతం సముద్రానికి దగ్గరగా వుంటుంది. అక్కడికి మెయిన్ రోడ్డు వున్నా, ఆ గుహాలు వున్న ప్రదేశం అడవిలా వుంటుంది. మనుష్యులు తిరగడం తక్కువ" గబగబ చెప్పాడు సింధూర్.

"ఆరోజు సముద్రతీరంనుండి ఆ గుహలను చేరడానికి మెయిన్ రోడ్డుపైన ప్రయాణించాను" తన చేతిలోని సిటీ మాప్‌లో చూపుడు వేలితో చూపిస్తూ చెప్పాడు రోనాల్డు.

"దారిలో పోలీస్ ఎటాక్ జరిగింది. ఆ కంగారులో మెయిన్ రోడ్డు వదలి ప్రక్కనున్న చెట్లలోపులోనికి వెళ్ళాను. ఆ చెట్లలోనే మోటారు వాన్ వుంచాను. మనం అక్కడికి చేరాలి."

నిస్పృహగా తల విదిలించాడు సింధూర్.

రొనాల్డు చెప్పిన సముద్రతీరం నుండి అమర్ నాథ్ కేవ్స్ రెండువందల కిలోమీటర్లు దూరంలో వున్నాయి. ఆ మెయిన్ రోడ్డుకు అటు ఇటూ దట్టమైన చెట్లు వున్నాయి. పులులు, సింహాలు లేకపోయినా ఆ ప్రాంతమంతా అడవిలానే వుంటుంది.

అటువంటిచోట వాన్ వెదికి పట్టుకోవాలి. అసాధ్యం కాకపోయినా అంత సులభం కూడా కాదు.

సింధూర్ ఆలోచనలు చదువుతున్నట్లు అతని ముఖం లోనికి చూస్తూ కూర్చున్నాడు రొనాల్డు.

అదే సమయంలో గది బయటనుంచి ద్వారానికి అమర్చివున్న కాలింగ్ బెల్ గర్రుమంటూ శబ్దం చేసింది.

ఒక్కసారిగా వులిక్కిపడ్డాడు రొనాల్డు. అంత కంటే రెట్టింపు కలవరపడుతూ తలుపువైపు చూశాడు సింధూర్. అంతకుముందే రొనాల్డు చంపిన మాఫియా బాయ్స్ శవాలు బాత్ రూమ్ లో వున్నాయి. వచ్చింది ఎవరో? ఏమిటో?

లేచి వెళ్లాడు రొనాల్డు. తలుపుకున్న కీహోల్ నుండి బయటకు చూసాడు.

రూం సర్వీస్ బాయ్.

"రొనాల్డుసార్ .... మీకోసం ఒక వ్యక్తివచ్చి మీకు వెంటనే అందించమని యీ కవరుఇచ్చి వెళ్ళాడు...." ఒక నీలంరంగు కవరు రొనాల్డు చేతిలో పెట్టి చెప్పాడు రూమ్ బాయ్.

ఆ కవరు తీసుకుని వెంటనే తలుపు మూసేసాడు రొనాల్డు. కనుబొమ్మలు ముడివేస్తూ కవరుని చించాడు. లోపల చిన్న కాగితం వుంది. నీట్ గా నాలుగే నాల్గు లైన్లు వ్రాయబడివున్నాయి దానిమీద.

"మిస్టర్ రోనాల్డు!

మేము మీ శ్రేయోభిలాషులం. మీ సరుకుకు సరైన వెల చెల్లించడానికి మేము సిద్ధంగా వున్నాము. చార్లెస్ చనిపోయాడు కనుక ఆ డబ్బు మీకు అందజేయగలము. ఇష్టమైతే వచ్చి యడారా పార్కు ఏరియాలో సెకండ్ క్రాస్ స్ట్రీట్, నెంబరు ఎయిటీత్రీ బిల్డింగ్‌లో మమ్మల్ని కలవండి."

ఇంతే వుందా మెసేజ్. క్రింద సంతకం కూడా లేదు.

నుదురు రుద్దుకుంటూ మంచంపైన కూర్చున్నాడు రోనాల్డు. మరణించిన చార్లెస్ మాదక ద్రవ్యాలు అమ్మడంలో ఆరితేరినవాడు. ఇండియాలో ప్రతిపార్టీ అతనికి తెలుసు. ప్రస్తుతం ఉన్న సరుకు కరీందాదా అనే రౌడీకి బేరంపెట్టాడు. తనను కాంటాక్టు చేసేది ఆ పార్టీయేనా? కావచ్చు! కాకపోవచ్చును.

తనను చంపడానికి మాఫియా చేసే కుట్ర కావచ్చును. ప్రమాదాలతో తలపడడానికి సిద్ధపడే వెళ్ళాలి.

వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు రోనాల్డు. మృత్యువుతో అనుక్షణం పోరాడటం రోనాల్డు స్వభావం.

# 11

యడారాపార్కు.... చాలా పెద్దపార్కు. దానికి చుట్టూవున్న ఏరియాను యడారాపార్కు ఏరియాగా పిలుస్తారు.

సెకండ్ క్రాస్ స్ట్రీట్ మొదట్లో రోనాల్డు, సింధూరాలు టాక్సీ దిగేసరికి అర్ధరాత్రి దాటింది. నిర్మానుష్యంగా వున్నాయి ఆ రోడ్లు అన్నీ.

కాలినడకన ఇంటినెంబర్లు చూసుకుంటూ ముందుకు సాగారు. రోడ్డుకు కొంచెం అవతల వుంది నెంబరు

ఎయిటీత్రీ బిల్డింగ్.

మెట్లెక్కి పైకి వెళ్ళారు. లోపల పెద్దహాలు. నిర్మానుష్యంగా వుంది.

లోపలకు వెళ్ళిపోయిన సింధూరును చటుక్కున ఆపాడు కోనాల్డు. జేబునుండి మాగ్నమ్ బయటకు తీసాడు. చనిపోయిన మాఫియా బాయ్ ఆయుధమది.

కనుచివరలనుండి హాలునంతా పరిశీలిస్తూ లోపలకు అడుగు పెట్టాడు కోనాల్డు.

అతని వెనుకే లోపలకువచ్చి హాలునంతా పరీక్షగా చూసాడు సింధూర్. ప్రమాద చిహ్నలేవి అతని కళ్ళకు కనిపించలేదు.

అయితే ఇద్దరూ హాలుమధ్యకు వచ్చిన మరుక్షణం కనబడింది ఒక చిన్న కదలిక.

"సింధూర్" గట్టిగా అరిచి గాలిలోకి డైవ్ చేసాడు కోనాల్డు. అతనికన్నా ఒకక్షణం ముందే జాగ్రత్త పడ్డాడు సింధూర్.

ఆ గదిలో సడన్ గా ప్రత్యక్షమయిన ఇద్దరు దృఢకాయుల చేతులోని రివాల్వర్లు భయంకరంగా గర్జించాయి.

బుల్లెట్లు కోనాల్డు నిలబడిన ప్రదేశంలో చిల్లులు పొడిచాయి. ఆ తర్వాత రివాల్వర్లు వుపయోగించే అవకాశం వారికి రాలేదు.

బాణంలా వెళ్ళి ఒక వ్యక్తి మోకాళ్ళమీద తలతో పొడిచాడు. సింధూర్ బాలెన్స్ తప్పి వెల్లకిలా పడిపోయాడా వ్యక్తి. సింధూర్ కాలు శరవేగంతో అతని తలను తాకింది. స్పృహతప్పి తలవాల్చేశాడు.

సరిగ్గా అదే సమయంలో రెండవ వ్యక్తిని పడ

గొట్టాము రోనాల్డ్.

ఇంతలో హాలుకు ఒక చివరగావున్న గది తలుపులు తెరుచుకున్నాయి.

గిర్రున అటు తిరిగాడు సింఘూర్. క్రిందపడిన వ్యక్తిని మాగ్నమ్‌తో కవరుచేస్తూనే అటు చూసాడు రోనాల్డు.

ఆ గదిలోనుండి సన్నగా, పొడవుగా వానపాములా వున్న ఒక వ్యక్తి బయటకువచ్చాడు.

"మిస్టర్ రోనాల్డు!" అన్నాడు.

"నేనే!" ముందుకు వచ్చాడు రోనాల్డు.

"లోపలకురండి మిస్టర్ రోనాల్డు! మేము మీ స్నేహితులమే. శత్రువులంకాదు." లోపలకు దారి తీసాడు వానపాము.

అతని వెనుకే లోపలికి నడిచారు రోనాల్డు, సింఘూరులు.

"మిస్టర్ రోనాల్డు! చార్లెస్ డ్రగ్స్ అమ్మజూపింది మాకే. అనుకోకుండా జరిగిన పోలీస్ ఎటాక్‌లో చార్లెస్ చనిపోయిన సంగతి మాకు తెలుసు. ఇక ఇప్పుడు ఏం చేస్తారు? ఆ డ్రగ్స్ మాకు అప్పగించగలరా? లేక వేరే పార్టీని వెదుక్కోమంటారా?" అడిగాడు వానపాము.

సిగరెట్ కాలుస్తూ శ్రద్ధగా వింటున్న రోనాల్డు అటూ ఇటూ ఇబ్బందిగా కదిలాడు.

"నాకు రెండురోజులు టైంకావాలి."

"తీసుకోండి. కాని సరుకుమాత్రం ఖచ్చితంగా మాకు అప్పగించాలి. టరమ్స్ మామూలే. మీరు అప్పగించే మాల్‌కు సరిపడా బంగారం మేము ఇస్తాము.

మమ్మల్ని కాంటాక్టు చెయ్యాలంటే ఏ రోజైనా రాత్రి పదిగంటలనుండి పన్నెండు గంటలలోపు రోజి

ళ్లేట రండి. అక్కడ మా మనిషి మిమ్మల్ని కాంటాక్ట్ చేస్తాడు" చెప్పాడు వానపాము.

'ఢన్'మన్న రివాల్వరు మోతతో ఆ బిల్డింగ్ దద్దరిల్లింది.

మెరుపులా లేచాడు కోనాల్డు. మాగ్నమ్ సిద్ధంగా పట్టుకని బయటికి పరుగుతీసాడు.

బయట హాల్లో అడ్డదిడ్డంగా పడివున్నాడు సింధూర్ చేతిలో దెబ్బతిన్నవ్యక్తి. అతని గొంతులో దిగబడి వుందో హంటింగ్ నైఫ్.

మరి రెండో వ్యక్తి ఏడి? అనుమానంతో బయటకు పరుగుదీశాడు.

మెట్లమీద ఎదురయ్యాడు రెండో వ్యక్తి. అతని నుదిటి పైన మూడో నేత్రంలా చిన్నరంధ్రం కనిపిస్తుంది.

చెవులు చిల్లులుపడేలా వినబడిన రివాల్వరు మోత భవనంలోనుండి. గిర్రున వెనుతిరిగి లోపలికి పరిగెత్తాడు కోనాల్డు.

లోపల నేలపై నెత్తుటి మడుగులో తేలుతున్నాడు వానపాము. అతని గుండెలపైన నయాపైసంత రంధ్రాలు రెండువున్నాయి. వాటినుండి కారిన రక్తం నేలపై వరదలావుంది. ఆ గదిలో సింధూరు లేడు.

"హోలీ షీట్!" మాగ్నమ్ నేలకేసి కొడుతూ అరిచేడు కోనాల్డు.

## 12

తలపై ఎవరో సమ్మెటలతో బాదుతున్నట్లనిపించి కళ్ళు తెరిచాడు సింధూర్. ఒక్కసారిగా కళ్ళు జిగేల్ మన్నాయి.

ముఖంపైకి ఫోకస్ చేయబడుతుంది ఒక పెద్ద ఫ్లడ్

లైట్. దానిని చూడలేక వెంటనే కళ్ళు మూసు కున్నాడు.

"కళ్ళు తెరిచాడు. లైట్ ఆఫ్ చెయ్యండి" ఎవరిదో కీచుగొంతుక వినిపించింది.

సింధూర్ కళ్ళపైకి ఫోకస్ చెయ్యబడిన లైటు ఆఫ్ చెయ్యబడింది. కళ్ళు తెరిచి చుట్టూ చూసాడు సింధూర్.

మొత్తం ఐదుగురు వ్యక్తులు వున్నారు అతనిచుట్టూ. చూడగానే రఫ్ పర్సనాలిటీలుగా తెలిసిపోతారు.

వారికి కొంచెం దూరంగా వున్నాడొకవ్యక్తి. సింధూర్ తనవైపు చూడగానే చిన్న చిరునవ్వు నవ్వాడు "మిస్టర్ ....నీ పేరు?" ప్రశ్నించాడావ్యక్తి. అతని కంఠ స్వరం కీచుగా పీలగావుంది. మనిషికితగ్గ కంఠంకాదది.

"సింధూర్"

"ఏం చేస్తున్నావ్?"

"పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థిని"

"మరి రౌడీలతో ఎందుకు తిరుగుతున్నావు?"

"సిటీ చూపిద్దామని...."

హాండ్‌స్టిక్‌తో సింధూరు తలపైన లాగిపెట్టి కొట్టాడొకవ్యక్తి..

సింధూరుకళ్ళు బైర్లు కమ్మసాగాయి. అతి ప్రయత్నం మీద తలఎత్తి చూసాడు.

"మిస్టర్ సింధూర్! నీవు చాలా చిన్నవాడివి. మేము పెట్టే హింసలు భరించడం నీవల్లకాదు. అడిగిన ప్రశ్నలకు సూటిగా జవాబులు ఇవ్వడం నీ ఒంటికి చాలా మంచిది."

"అడగండి. నాకు తెలిసినంతవరకు నిజమే చెబు తాను." చెప్పాడు సింధూర్.

"రౌడీలతో నీకు ఎలా పరిచయమయ్యింది?"

"నేను పాకెట్ మనీ కొరకు చిన్న చిన్న జాబ్స్ చేస్తుంటాను. అందులో గైడ్ జాబ్ ఒకటి. ఇంటర్ నేషనల్ టూరిస్టు ఏజన్సీ తరఫున రోనాల్డుకు గైడ్ గా నియమించబడ్డాను." ఆయాసపడుతూ చెప్పాడు సింధూర్.

"హేళనగా నవ్వాడు కీచుగొంతు వ్యక్తి. "మరి రోనాల్డుతో కలిసి మాఫియా మనుష్యులిద్దరిని ఎందుకు చంపావు?"

"నేను చంపలేదు. నేను అతని రూమ్ కు వెళ్ళేసరికి రోనాల్డ్ మీ మనుష్యులను చంపేసాడు. అందులో నా ప్రమేయం ఏమాత్రం లేదు."

తలపైన మరో దెబ్బ పడింది. దెబ్బ తగిలినచోట నే తగలడంతో సింధూర్ నరాలు జివ్వుమన్నాయి. తలపైన చిన్న గాయం ఏర్పడి రక్తం వెలువడింది. అతని ముఖం నిండా స్వేద బిందువులు ఆవిర్భవించాయి.

"అంతర్జాతీయ మార్కెట్ లో ఎంతో విలువవున్న డ్రగ్స్ రోనాల్డ్ చేతికి గుడ్డిగా అప్పగించి దెబ్బతింది మా గాంగ్. అవి తిరిగి రాబట్టుకోవాలి. దాంతో బాటే మాఫియాను మోసం చేసినందుకు రోనాల్డ్ కు మరణశిక్ష విధించాలి. నా అనుచరులను రోనాల్డ్ వద్దకు పంపే ముందు ఒక మైక్రోఫోన్ వాళ్ళ దుస్తులలో అమర్చాను."

ఒక్క క్షణం ఆగి చిటికె వేశాడు కీచుగొంతువ్యక్తి. మరుక్షణం ఎక్కడినుండో మాటలు వినిపించసాగాయి.

"ఇతడు నీ పార్టనరుకదూ?" కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

"వాన్ ఎక్కడవుందో అతనికి తెలుసు. అతడిని అడగండి." రోనాల్డ్ కంఠస్వరం గట్టిగా వినబడింది.

మళ్ళీ చిటిక వేసాడు కీచుగొంతు వ్యక్తి. అవేమాటలు మళ్ళీ రిపీట్ అయ్యాయి.

“డ్రగ్స్‌వున్న వాన్ ఎక్కడుందో నీకు తెలుసునని రోనాల్డ్ మా మనిషితో అన్నాడు. విన్నావుగా! ఇప్పుడు చెప్పు ఆ వాన్ ఎక్కడుంది?”

విపరీతమైన ఆందోళన సింధూర్ మనస్సును ఆక్రమించింది. ఆ రోజు రివాల్వరు పట్టుకున్న వ్యక్తి దృష్టిని మళ్ళించేందుకు రోనాల్డు అలా అబద్ధం చెప్పాడు. ఆ అబద్ధమే ఈ రోజు తన మెడకు వురిత్రాడులా చుట్టుకుంటుంది.

సింధూర్ ముఖం మీద పడింది ఒక దెబ్బ. “చెప్పు వాన్ ఎక్కడుంది?” కఠినంగా అడిగాడు కీచుగొంతు వ్యక్తి.

“నాకు నిజంగా తెలీదు.”

మరోక దెబ్బ.... సింధూర్ పెదవులు చిటికి రక్తం నోటికి వుప్పగా తగిలింది.

“మీకు నన్ను హింసించి ప్రయోజనం లేదు. రోనాల్డ్ తీసుకు వెళ్ళమన్న చోటుకి తీసుకు వెళ్ళడమే నా డ్యూటీ. ఆ మోటారువాన్ ఎక్కడవుందో నాకు తెలీదు” పళ్ళు బిగించి చెప్పాడు సింధూర్.

ఒక్కసారిగా అతని శరీరంపై నాట్యం చేసాయి ఐదు చేతికర్రలు. బాధతో మెలికలు తిరిగి పోయాడు సింధూర్.

తను నిజం చెప్పినా వాళ్లు నమ్మరు. తెలిసీ తెలియక ఈ గాంగ్‌వార్‌లో చిక్కుకుపోయాడు తను.

“మిస్టర్ నిజం చెప్పు. వాన్ ఎక్కడుంది?” తన ప్రశ్నను మరోసారి రిపీట్ చేసాడు.

“నాకు తెలీదు, తెలీదు” సహనం అంతరించిపోయిన

సింధూర్ పెద్దగా అరిచాడు.

అంతే! పదినిముషాలు ఆగకుండా సింధూర్ శరీరంతో ఆడుకున్నారా వ్యక్తులు.

సింధూర్ శరీరం అంతా రక్తంతో నిండిపోయింది.

“వీడికి నిజంగానే తెలీదేమో?” అన్నాడొకవ్యక్తి.

తల అడ్డంగా వూపాడు కీచుగొంతువ్యక్తి, “వీడు చెప్పే కథలు నమ్మదగినవిగా లేవు. ఇంకోసారి ప్రయత్నించి చూద్దాం, బంధించి వుంచండి”

“మరి రోనాల్డు....?”

“నో మిస్సి, వాడు ప్రపంచంలో ఏ మూల దాక్కున్నా సరే కిల్ హిమ్ ఫస్టు. కాకపోతే చంపే ముందు డ్రగ్స్ ఎక్కడ దాచాడో చెబుతాడేమో ప్రయత్నించండి.”

## 13

తలుపు గెంటుకుని లోపలకు ప్రవేశించాడా దృఢకాయుడు. మదించిన మత్తగజంలా భూమి అదిరేలా అడుగులు వేస్తూ వచ్చాడు.

లోపల గదిలో ఒక పెద్ద బల్ల వుంది దానిపై ఒక పెద్ద లైటు వెలుగుతుంది. టేబుల్ లాంప్ కాంతి సూటిగా గుమ్మంవైపు ప్రసరిస్తుంది.

“వెల్ కమ్ కరీమ్ దాదా!” టేబుల్ లాంప్ వెనుక చీకటిలోనుండి వినబడిందొక కంఠం.

కరీమ్ దాదా కన్నుపొడుచుకు చూసినా ఆ చీకటి ఆకారాన్ని చూడలేకపోతున్నాడు. టేబుల్ లాంప్ అతనికా అవకాశాన్నివ్వడంలేదు.

“ఎందుకో పిలిపించారట” వినయంగానే అన్నాడు

కరీమ్‌దాదా. కాని అతని కంఠస్వరంలో కరుకుదనమే ముక్కుటిల ధ్వనించింది.

"ఈమధ్య నీలో చురుకుదనం తగ్గిపోతుందేం కరీమ్ దాదా! ఏ పనీ ఒక క్రమపద్ధతిలో జరపడంలేదు" మెత్తగా అడిగాడా వ్యక్తి.

మాట్లాడలేదు కరీందాదా. ఇంకోమనిషి ముందయితే అలా వొంపిలా నిలబడేవాడు కాదు. కాని తనముందున్న మనిషి విషయం వేరు. ఆ వ్యక్తి ముఖంలో తనకు తెలియక పోయినా కనురెప్పల కదలికలతో చుట్టూ వున్న సమాజాన్ని శాసించగల సమర్థుడని తెలుసు.

"డ్రగ్స్ లేక విద్యార్థులు అల్లాడిపోతున్నారటకదా?" మళ్ళీ వినబడిందా కంఠం.

విడమర్చి చెప్పాడు కరీందాదా. డ్రగ్స్ కోసం తాను చార్లెస్‌ను కాంటాక్టు చెయ్యడం, పోలీస్ ఎటాక్ జరిగి చార్లెస్ మరణించడం, ఆ తర్వాత రోనాల్డ్‌ను కాంటాక్టు చెయ్యడం వరకు వివరంగా, ఓపిగ్గా చెప్పాడు.

"రోనాల్డ్‌తో మాట్లాడటానికి వెళ్ళిన నీ అనుచరులు ఏమయ్యారు కరీందాదా?"

నిశ్శబ్దంగా నిలబడిపోయాడు కరీందాదా. కొన్ని క్షణాల తర్వాత ఆ వ్యక్తి మళ్ళీ చెప్పాడు.

"నీ అనుచరులు మాఫియా గాంగ్ చేతుల్లో చచ్చిపోయారు. నీ వాళ్ళను మాఫియా ఎందుకు ఎటాక్ చేసిందో తెలుసా?"

మాట్లాడలేదు కరీందాదా. వందమందిని పట్టిచేతులతో ఎదిరించమన్నా. ఇళ్ళను తగలబెట్టమన్నా వెనుకా ముందు చూడకుండా చేసేస్తాడు కరీందాదా. ఒక్క క్షణం మెదడుకు పనికల్పించమంటే మాత్రం ....

ఆ విషయం కూడా బాగా తెలుసా వ్యక్తికి. అందుకే తిరిగి తనే చెప్పసాగాడు,

"సింధూర్ తెలుసా? నువ్వు సురేష్ అనే పోలీస్ ఆఫీసర్‌ను హత్య చేస్తుండగా చూసిన ప్రత్యక్ష సాక్షి. గుర్తున్నాడా?"

తల వూపాడు కరీమ్‌దాదా. ఆ స్టూడెంట్ పేరు సింధూర్ అని ఇప్పుడే తెలిసింది. కాని ఆ కుర్రాడి రూపం మాత్రం తనకు బాగా గుర్తే.

"ఆ కుర్రవాడు ఇప్పుడు కోనాల్డు రైట్ హాండ్. చార్లెస్ చనిపోయిన తర్వాత కోనాల్డు డ్రగ్స్ వున్న వాన్‌ను ఎక్కడో దాచాడు. ఆ ప్రదేశం కోనాల్డుతో పాటు సింధూర్‌కు కూడా తెలిసి వుండాలి. అందుకే మాఫియా సింధూర్‌ను మాయం చేసింది. కోనాల్డు స్వతహాగా నేరస్థుడు. అతడినుండి రహస్యాన్ని బయట పెట్టించడం అంత తేలిక కాదు. సింధూర్ ఒక అర్డినరీ పర్సన్, అతనితో మాట్లాడించడం తేలిక. అందుకే మాఫియా కోనాల్డు బదులు సింధూర్‌ను పట్టుకుంది" అగాడా వ్యక్తి.

అప్పటికే కరీందాదా పెద్ద బుర్రకు తను చేయవలసిన దేమిటో అర్థమైంది. సింధూర్‌ను పట్టుకోగలిగితే, అతని నోరు తెరిపించడం తనకొక పెద్ద పని.

సింధూర్ నోరు విప్పాడా, కోటిరూపాయల విలువ గల మాదక ద్రవ్యాలు తమ స్వంతం అవుతాయి. పైసా పెట్టుబడి లేకుండా కోటిరూపాయలు.

కరీమ్‌దాదా ముఖంలోకి గొప్ప వెలుగు వచ్చేసింది. అతనివైపే చూస్తున్న ఆ వ్యక్తి తృప్తిగా నిట్టూర్చాడు.

"కరీందాదా! ఈ పని నీవు చేయగలిగితే సగం వాటా

నీకు ఇచ్చేస్తాను. ఎంతమంది మనుషులను వినియోగిస్తావో, ఎన్ని రక్తపుటేర్లు ప్రవహింపచేస్తావో, నాకు తెలీదు. ఆ కుర్రాడు వాన్ యెక్కడుందో చెప్పాలి. అంతే!”

యాభై లక్షలు....కరీందాదా నరనరాల్లో రక్తం వేడిగా పరుగులు పెట్టసాగింది. ఆనందంగా వెనుతిరిగాడు.

బయటకు వెళ్తున్న కరీమ్‌దాదాను చూసి నవ్వుకున్నాడా చీకటి వ్యక్తి. ఏనుగులాంటి కరీమ్‌దాదాను కూడా లొంగదీసే అంకుశం తన దగ్గర వుంది. అది డబ్బు.

ఒక అమాయకుడిపైన బిగుసుకుంటున్న ఉచ్చు మరింత గట్టిగా బిగించబడింది.

## 14

భరింపరాని బాధతో తల పగిలిపోతున్నట్లనిపించి కళ్ళు తెరిచాడు సింధూర్. కళ్ళు మసకలుకమ్మి అస్పష్టంగా కనిపించింది తను ఉన్న జైలుగది. మెల్లిగా లేచి కూర్చున్నాడు.

ఒళ్ళు పచ్చిపుండయిపోయింది. చెయ్యి కదిపినా, కాలు మెదిపినా కళ్ళముందు రంగురంగుల వలయాలు ప్రత్యక్షమవుతున్నాయి.

మెల్లిగా గోడను పట్టుకుని లేచి నిలబడ్డాడు. అడుగులో అడుగు వేస్తూ ఇనుపవూచల తలుపు దగ్గరకుపోయి, బయటకు తొంగిచూశాడు.

అదే వరండా. తనను చితకకొట్టిన ఇంటరాగేషన్ రూమ్ కొద్దిదూరంలో కనిపిస్తుంది. సింధూర్ మనసులో ఆ బిల్డింగ్ ప్లాన్ గిరున తిరగసాగింది. ఆ గది గోడలను పరిశీలనగా చూశాడు. పాతకాలపు రాళ్ళ గది.

ఏదో అనుమానం సింధూర్ మనస్సును పురుగులా

దోలచసాగింది. గబగబా అవతలి గోడ దగ్గరకు వెళ్లాడు. గోడకు చెవి ఆనించి అలాగే నిశ్శబ్దంగా వుండిపోయాడు.

కాస్సేపటికి వినబడింది అస్పష్టమైన హోరు. అంటే.. అంటే తన సిటీకి చాలా దూరంగా సముద్రతీరంలో వున్నాడన్నమాట.

సడన్ గా గుర్తుకు వచ్చింది. ఎప్పుడో బ్రిటిష్ వారి కాలంలో అధికారులకోరకు ఒక బిల్డింగ్ కట్టబడింది. సిటీకి దూరంగా వున్న పాడుబడ్డ బిల్డింగ్ను ఆ తర్వాత ఎవ్వరూ పట్టించుకోలేదు. ఈ బిల్డింగ్ చూడాలని తను చాలాసార్లు అనుకుని రాలేకపోయాడు.

ఆ బిల్డింగ్ ఈ మాఫియా గాంగ్ చేతిలో పడినట్లుంది.

ప్లేటునిండా అన్నం నింపుకుని అక్కడికి వచ్చాడొక వ్యక్తి. నల్లని పాంటు, కోటు వేసుకున్నాడు. తలపైన టోపి పెట్టుకున్నాడు. చేతిలో రైఫిల్ని గోడకు చేరవేసి ప్లేటు లోపలకు గెంటాడు.

"నన్ను ఏం చేస్తారు?" అడిగాడు సింధూర్.

"అన్నంతిను. ఆ తర్వాత దెబ్బలుతిందువుగాని."

"ఆ వాన్ ఎక్కడ వుందో నిజంగా నాకు తెలీదు."

"అయితే నీ ఖర్మ. నీవు చచ్చి శవంగా మారితేగాని మా బాస్ ఆ మాట నమ్మడు" వెనుకకు వెళ్ళిపోతూ చెప్పాడతను.

గోడకు శేరబడి అలాగే నిలబడిపోయాడు సింధూర్. సో, తను చనిపోవడం ఖాయం. కాదు అంటే వీళ్ళను ఎదిరించాలి. సరదాగా ఆడుతూ, పాడుతూ తిరిగే స్టూడెంట్ తను. హత్యలు, దోపిడీలు సినిమాల్లో చూడటమేగాని మామూలుగా ఎరుగడు.

ఆఫ్కోర్స్...సరదాకోసం కంగ్ఫూ నేర్చుకున్నాడు

కాని వీళ్ళు రివాల్వర్సుతోనూ, రైఫిల్సుతోను దెబ్బలాడుతున్నారే? ఎలా?

ఏదో ఒకటి చెయ్యాలి. తనను మళ్ళీ చిత్రహింసలు పెట్టేలోగా తప్పించుకోవాలి. లేదా వాళ్ళచేతిలో చనిపోవాలి. ఎస్కేప్ ఆర్ డై.

కొద్ది దూరంలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు ఇంతక్రితం అన్నం తెచ్చిన వ్యక్తి. తనకు స్పెషల్ గా కాపలా వున్న గార్డు కాబోలు. ఆ గార్డును చూడగానే సింధూర్ మదిలో ఒక ప్లాను మెదిలింది.

చొక్కా విప్పి గదిలో ఒక మూల వేశాడు. ఒంటిపైన రక్తం చారలు కట్టాయి. ఒకసారి ఒంట్లో మిగిలివున్న శక్తిని అంచనా వేసుకున్నాడు.

"హెల్ప్.... హెల్ప్.... హెల్ప్" బిగ్గరగా అరవసాగాడు.

ఉలిక్కిపడి లేచాడా గార్డు. రైఫిల్ పట్టుకు పరుగున వచ్చాడు.

"నా గదిలోకి ఏదో వచ్చింది. దానిపైన చొక్కా వేశాను. ప్లీజ్, ఒక్కసారి వచ్చి చూడండి" దీనంగా అన్నాడు సింధూర్.

"గోడకు ఆనుకుని నిలబడు. కదలకు" హెచ్చరించాడు గార్డు ఆ బర్వాక్ తలుపులు తెరిచాడు.

శరీరాన్ని స్టడీ చేసుకున్నాడు సింధూర్. యస్! కదలాలి. తన కదలికల వేగంపైనే తను బ్రతికేది, లేనిది ఆధారపడి వుంది.

రైఫిల్ని ముందుకు చాపి లోపలకు వచ్చాడు గార్డు మెల్లిగా చొక్కావైపు వెళ్ళాడతను.

గాలికంటే వేగంగా కదిలాడు సింధూర్. ఆ గార్డు

వదుంతే బలంగా తన్నాడు. విసురుగా వెళ్ళి గోడకు తగులుకున్నాడా గార్డు.

చటుక్కున చెయ్యి మడిచి ఆ గార్డు మెడపై పొడిచాడు సింధూర్. ధబ్‌మంటూ నేలమీదకు తన ముందుకు జారిపోయాడతను.

ఆ క్షణంలోనే సింధూర్ ఎడమపాదం లైట్నింగ్ వేగంతో కదిలింది. ఫట్‌మంటూ ముఖం అదిరిపోతుండగా ఎగిరి అవతలపడ్డాడు గార్డు. పడ్డవాడు మళ్ళీ లేవలేదు.

గబగబా చొక్కా వేసుకుని బయటకు వచ్చాడు. వరండాలో ఇంక గార్డులు లేరు. ముందుకు కదిలాడు సింధూర్.

ఆ బిల్డింగ్ బయట ఒక రేకుల షెడ్ వుంది. ఆ షెడ్ ముందు ఒక గార్డు వున్నాడు. అతని ప్రక్కన ఒక మెషిన్‌గన్ వుంది. అక్కడినుండి బయటపడాలంటే ఆ గార్డును పడగొట్టాలి.

ఎరను సమీపించే పెద్దపులిలా మెల్లగా ఒక్కొక్క అడుగు వేసుకుంటూ ఆ గార్డును సమీపించాడు. ఏ మాత్రం అలికిడి అయినా ఆ గార్డు చెయ్యి మెషిన్‌గన్‌పై పడుతుంది. మెషిన్‌గన్ అతని చేతికి దొరికాక ఇక ఫైటింగ్ అనవసరం. కళ్ళు మూసుకుని దైవప్రార్థన చేసుకోవడమే మంచిది.

తలవంచుకుని కూర్చున్నాడా గార్డు. ఇంక మూడడుగుల దూరంలో వుంది. తల ఎత్తలేదా గార్డు. మరో అడుగు వేశాడు సింధూర్. ఇంక రెండడుగులు. అలాగే వున్నాడా గార్డు. గుండెలు దడదడలాడుతుండగా మెషిన్‌గన్ వైపు చెయ్యిచాపాడు సింధూర్. ఇంతలో..

ఆ రేకుల షెడ్డు వెనుక వున్న ఒక వేటకుక్క

శత్రువు వాసన పసిగట్టింది. పిశాచిలా వికృతంగా అరుస్తూ బాణంలా దూసుకు వచ్చిందది.

చటుక్కున తలఎత్తాడు గార్డు సింఘూర్‌ను చూసి పెద్దగా అరుస్తూ పిడికిలి బిగించి విసిరాడు. అంతకంటే ముందే సింఘూర్ చెయ్యి కదిలింది. వెనక్కి తూలాడు గార్డు.

కోరలను బయటపెట్టి సింఘూర్ పైకి ఎగిరిందా వేట కుక్క. చటుక్కున మెషిన్ గన్ తీసి బలంగా దాని వైపు విసిరాడు సింఘూర్.

రివ్వున గాల్లోకి ఎగిరిన కుక్క అదే వేగంతో నేల కూలింది.

గిర్రున ప్రక్కకు తిరిగి గార్డు ముఖం పై బాదాడు. ఎగిరి వెనక్కి పడ్డాడు గార్డు.

అదే సమయంలో బిల్డింగ్ లోనుండి బయటకు పరుగున వచ్చారు మాఫియా బాయ్స్. వాళ్ళలో వున్న కీచు గొంతు వ్యక్తిని గుర్తుపట్టాడు సింఘూర్.

అందరి చేతుల్లోను రివాల్వర్స్ వున్నాయి. సింఘూర్ వైపు కాల్పులు సాగించారు వారు.

చేతిలోని మిషిన్ గన్ వారివైపు గురిపెట్టాడు. దాని మెకానిజం యేమాత్రం అతనికి తెలీదు. పెద్ద ప్రయత్నం లేకుండానే బుల్లెట్లు వరదలా ముందుకుపోయాయి.

ఎగిరిపడుతున్న ఆ గన్ ని....కదలకుండా పట్టుకోవడం సింఘూర్‌కు చాలా కష్టమయ్యింది. బుల్లెట్లు మాఫియా బాయ్స్ కాళ్ళముందుపడి కందిరీగల్లా ఎగిరాయి. అదిరిపడి బిల్డింగ్ వైపు పరిగెత్తారు వాళ్ళంతా.

మెస్ తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళాడు సింఘూర్. లోపల కనబడిన వస్తువులను చూసి బిగిసి

పోయాడు.

మిషన్ గన్స్, స్టెన్ గన్స్, నాటు బాంబులు, టైం బాంబులు, గన్ పౌడరు, రకరకాల మారణాయుధాలు వున్నాయక్కడ.

తలుపు సందునుండి బయటకు చూశాడు సింఘూర్. కొద్ది దూరంలో నిలబడి తర్జనభర్జనలు పడుతున్నారు మాఫియా బాయస్.

రేకుల షెడ్ లోనికి కాల్పులు జరిపే ధైర్యం వాళ్ళకు లేదు.

"బ్లడి ఇడియట్స్! కట్టేసికొట్టడం కాదురా........ ఇప్పుడు చూడండి నా తడాఖా!" అనుకుంటూ వెనక్కు తిరిగాడు సింఘూర్.

అవతల ప్రక్క పెద్ద కిటికీ వుంది. దాని తలుపును మిషన్ గన్ స్టాకుతో విరగకొట్టి బయటకు తొంగి చూశాడు.

ఎవ్వరూ లేరు. మళ్ళీ లోపలకు చూశాడు. టైం బాంబ్స్ వున్నాయి. కాని వాటిని ఎలా యాక్టివేట్ చెయ్యాలో తనకు తెలీదు. హేండ్ గ్రనేడ్స్ వున్నాయి కాని పొరపాటున చేతిలో పేలితే........

తెగించి గ్రనేడ్స్ తీసుకున్నాడు. కిటికీలోనుండి బయటకు చూశాడు కొద్దిదూరంలో వున్న ప్రహరీ గోడవైపు పరిగెత్తాడు.

సింఘూర్ ప్రహరీ గోడపైకి చేరేసరికి మాఫియా హీరోలు రేకుల షెడ్ ప్రక్కనుండి మూసుకువస్తున్నారు.

ఎడమచేతిలోని హేండ్ గ్రనేడ్స్ ప్యూజులు నోటితో లాగి వరుసగా విసిరాడు సింఘూర్.

గొల్లుమన్నారు మాఫియా హీరోలు. వారి అరుపులను

మరుగుపరుస్తూ పెద్దపెద్ద శబ్దాలతో ఆ ప్రదేశం దద్దరిల్లి పోయింది.

ఏమాత్రం ప్రయత్నించకుండానే సింధూర్ శరీరం గాల్లోకి లేచింది. నేల ఎనిమిది అడుగుల లోతున వుంది. తల్లక్రిందులుగా పడ్డాడు. తల పగలలేదు. కాని వడి కాలు బెణికింది.

అయినా సరే లేచి నిల్చున్నాడు సింధూర్. అలాగే కుంటుకుంటూ దూరంగా పరిగెత్తాడు. అలా పోవడమే అతని ప్రాణాలను రక్షించింది.

ఫెటపెటార్భాటాలతో అంటుకుంది రేకుల షెడ్. భూకంపం వచ్చినట్లో, అగ్నిపర్వతం ప్రేలినట్లో తయారైంది ప్రాంతం.

వెనుతిరిగి చూడకుండా ముందుకు పరిగెత్తాడు సింధూర్. అడ్డం వచ్చిన రాయిపైనుండి ఎగిరి క్రింద వున్న సముద్రంలోనికి డైవ్ చేశాడు.

సముద్రంలోపడే ఆఖరి క్షణాల్లో కనబడిందతనికి నామరూపాలులేకుండా పోతున్న ఆ పాత భవనం.

# 15

నిశ్శబ్దంగా వుందా భవనం. దాని చుట్టూ కన్ను పొడుచుకున్నా కనబడనంత చీకటి పేరుకుని వుంది.

జాగ్రత్తగా మేడమెట్లవైపు నడిచిందా అమ్మాయి. ఆ మెట్లదగ్గర ఆగింది. చేయబోయే సాహసం గుర్తుకు రాగానే ఆమె గుండె వేగం పెరిగింది. గట్టిగా ఊపిరి పీల్చుకుంది.

ఒకసారి తల ఎత్తి చూసింది. ఆఖరి మెట్టుకు ఎదురుగా వుంది తలుపు. మెల్లిగా మెట్లు ఎక్కసాగింది. ఆమె వేసే అడుగులవల్ల శబ్దం రాకుండా అరంగుళం

ముందంవున్న ఎర్రటి కార్పెట్ చప్పుడుని మింగేస్తుంది. జాగ్రత్తగా ఒక్కొక్క మెట్టే యెక్కసాగింది.

చివరి మెట్టుమీద ఆగి ఓసారి క్రింద హాల్లోకి చూసింది. ఆ తర్వాత తలుపువైపు నడిచింది. తాళం వేసి వుంది.

మామూలుగా తీసే తాళం కాదది. కంప్యూటరు నెంబరింగ్‌తో పనిచేసే సిస్టమ్. డోరుపైన అంకెలు వున్నాయి. సరియైన కాంబినేషన్ నొక్కితేనే తలుపు తెరుచుకుంటుంది.

చూపుడు వేలుతో చకచకా ఆ నెంబర్సు నొక్కిందా అమ్మాయి.

"క్లిక్"మన్న శబ్దంతో తాళం తెరుచుకుంది. మెత్తగా చప్పుడుకాకుండా తలుపు తెరుచుకుంది.

అక్కడే ఆగి చూసింది. లోపల చీకటిగా వుంది. కుడికాలు పెట్టబోయి, ఏదో అనుమానం వచ్చి చటుక్కున తీసుకుంది. టార్చిలైటు వెలిగించి లోనికి చూసింది. అంతే ఒక్కసారిగా ఆమెకు విపరీతమైన భయం కలిగింది.

అక్కడ.... ....

సరిగ్గా గుమ్మానికి యెదురుగా నేలమీద కాళ్ళు తుడుచుకొనే తివాచి వుంది.

మామూలు తివాచికాదు రబ్బరుది. ఆ రబ్బరుతివాచి పైన సన్నటి సూదులు పైకి గుచ్చబడి వున్నాయి. వాటి మొనలు లేత ఎరుపురంగులో వున్నాయి. విషం. ఆర్సెనిక్ స్నేక్ వినమ్.

జాగ్రత్తగా గదిలోనికి దూకిందా అమ్మాయి. గది లోనికి ప్రవేశించి ఎలక్ట్రిక్ స్విచ్ వేసింది. గదంతా కాంతిలో నిండిపోయింది. టార్చిలైట్ ఆర్పి హేండ్

బాగ్‌లో వేసుకుంది.

ఆ గది పరిశీలనగా చూసిందా అమ్మాయి. చాలా విశాలంగా వుంది. గదినిండా గోడలకు రకరకాల తైల వర్ణ చిత్రాలు వ్రేలాడుతున్నాయి.

ఓ గోడవారకి ఆనించి పుస్తకాల రేక్ వుంది. ఆ రేక్ నిండా రకరకాల పుస్తకాలు. దానికి కొంచెం ప్రక్కగా గోడపైన భారతదేశ వర్ణచిత్రం వుంది.

ఆ చిత్రపటంవైపు కదిలిందా అమ్మాయి. కొద్ది క్షణాలు తటపటాయించింది. ఆ తర్వాత ఆ చిత్రపటాన్ని ప్రక్కకి తొలగించింది. దాని వెనుకగోడలో బిగించబడి వుంది ఒక స్టీల్ లాకరు.

ఆ లాకరుకున్న డయల్‌ని కుడిచేతి చూపుడువ్రేలితో కొన్ని సంఖ్యలు డయల్ చేసింది. వెంటనే లాకరు తలుపు తెరుచుకుంది.

చిన్న చిరునవ్వు తళుక్కున మెరిసిందామె పెదవులపై. తను సాధించింది. దాదాపు అసాధ్యమైన కార్యాన్ని సాధించింది. ఆ లాకరు తెరుకుంటే రాష్ట్రంలో డ్రగ్స్ రాకెట్ మూతపడ్డట్టే.

గబగబా ఆ లాకరులోని డాక్యుమెంట్స్ తీసుకుని తన హేండ్‌బాగ్‌లో వేసుకుంది. ఆ తర్వాత లాకరు యథాప్రకారం మూసి వేసింది.

ఇక ఈ పద్మవ్యూహం నుండి బయటపడటమే మిగిలింది. కాని అదంత తేలిక కాదని ఆమెకు తెలుసు.

## 16

ఆకాశాన పశ్చిమదిశగా మేఘమాలికలు ఎర్రగా వెలుగుతున్నాయి. అన్నీ రక్తరాగ రంజితాలే. వాటి అంచులు మాత్రం సూర్యకిరణాలు సానపట్టినట్లు వెండి

తీగల్లా మెరుస్తున్నాయి. వెలుగే తప్ప వేడిలేని భాను కిరణాలు విరిగి పడుతున్న సముద్రాల కెరటాల వంపులలో ముఖం దాచుకుంటున్నాయి.

నీళ్ళోడుతున్న శరీరంతో ఒడ్డు చేరాడు సింధూర్. తను ఎక్కడ వున్నాడో తెలీలేదు. చుట్టూ చూశాడు. అదో కొత్త ప్రదేశం.

కాలు కలుక్కుమంది. ప్రొద్దుటి ఫైటింగ్ లో కుడి కాలు బెణికింది. అప్పటినుండి సముద్రంలో అలాగే ఈదడంవల్ల ఉప్పునీటికి కాలు సలుపుతుంది.

అలాగే ముందుకు కదిలాడు సింధూర్. చీకటి పడే లోగా షెల్టరు వెదుక్కోవాలి.

ఎదురుగా కనబడుతున్న చెట్లవైపు నడిచాడు. కొంతదూరం నడవగానే ఎదురైందా దృశ్యం.

ఎదురుగావున్న చెట్ల మొదళ్ళకు ఎవరో చిల్లులు పొడిచినట్లు వున్నాయి, వాటిని చూస్తూనే సింధూర్ కనుబొమ్మలు ముడిపడ్డాయి.

పరిసరాలను జాగ్రత్తగా గమనిస్తూ ముందుకుసాగాడు. సుమారు అరగంట తర్వాత ఫలించిందతని కృషి. గుబురుగా పెరిగిన నాగజెముడు పొదలవెనుక ఒక కొండ గుహ వుంది.

సడన్ గా చూస్తే ముందు నాగజెముడు పొదలు కనబడతాయి. పరీక్షగాచూస్తే తప్ప వాటివెనుక వున్న గుహ కనబడదు.

లోపలకు వెళ్ళాడు సింధూర్. మోకాలులోతు పిచ్చి మొక్కలతో నిండి వుందా ప్రదేశం. వాటి మధ్య వుంది తనను ఎన్నో కష్టాలపాలు చేసిన మోటారువాన్. దానిని చూడగానే బిగ్గరగా కేకలు వేయాలనిపించిం

దగని!.

దగ్గరకు వెళ్ళాడు సింథూర్. అతను భయపడినట్లు తలుపులు లాక్ చేసి లేవు. లోపలవున్న చెక్కపెట్టెలలో ఒకదానిని పగలగొట్టి చూసాడు.

డ్రగ్స్ వున్నాయి వాటిలో. ఓపియం, సిగరెట్లలో కూరిన బ్రౌన్‌షుగర్, ఇంజెక్షన్స్ బాటిల్స్‌లో యల్. యస్. డి, చిన్న చిన్న పాకెట్స్‌లో తెల్లటి పౌడర్ కూడా వుంది. రాష్ట్రం మొత్తాన్ని నాశనం చేయడానికి ఆ సరుకు చాలు. వాన్ లోపల లాక్ చేసివుంది. గబగబా వైర్లు తెంపి తిరిగి కనెక్ట్ చేశాడు సింథూర్.

వాన్ బయటకుతీసి బ్రేక్ చేశాడు. దానిని మెయిన్ రోడ్డుపైకి తెచ్చేసరికి బాగా చీకటి పడిపోయింది. అదృష్టవశాత్తు హెడ్‌లైట్లు పనిచేస్తున్నాయి. వేగం పెంచాడు సింథూర్. వెంటనే పోలీసులకు ఆ వాన్ హాండోవర్ చెయ్యాలి.

కొద్ది దూరంలో రోడ్డు ప్రక్కగా నిలబడి వున్నాడొక మనిషి. లిఫ్టు ఇవ్వమని సైగ చేస్తున్నాడు. కారు హెడ్‌లైట్ల వెలుగులో ఆ మనిషిని గుర్తుపట్టాడు సింథూర్.

వాచ్‌మన్ పీటర్. తమ హాస్టల్ వాచ్‌మన్ పీటర్ అక్కడ నిలబడి వున్నాడు. అతని సమీపంగా ఆపాడు సింథూర్.

“ఊరు వెళ్ళిపోతానని చెప్పి ఇక్కడేం చేస్తున్నారు బాబు?” అడిగాడు పీటర్.

“అత్తవారింటికి వెళ్ళొస్తున్నారా!” నవ్వుతూ అన్నాడు సింథూర్.

“కాని నీ మాంగారు నీ వెనకాలే నిల్చున్నాడు

బాబు.”

వాడి మాటలకు అదిరిపడి వెనక్కు తిరిగాడు సింధూర్. వానికి ఇటువైపు నిలబడి వున్నాడు కరీమ్ దాదా. సింధూర్ తనవైపు చూడగానే వికారంగా నవ్వాడు.

కంగారుగా వాన్ స్టార్టు చెయ్యబోయాడు సింధూర్. ఈలోగానే కరీమ్‌దాదా చెయ్యి అతని ముఖాన్ని తాకింది. తీవ్రమైన బాధను సూచిస్తూ ఒక మూలుగు సింధూర్ నోటినుండి వెలువడింది. స్పృహ కోల్పోయాడతను.

కోటి రూపాయలు విలువచేసే వాన్‌ను తన అధీనంలోకి తీసుకున్నాడు కరీమ్‌దాదా.

## 17

ముఖంమీద చల్లటినీళ్ళు పడేసరికి కళ్ళు తెరిచాడు సింధూర్.

నేలపై పడివున్నాడతను. అతనికి కాస్త దూరంలో పెద్ద బల్లఒకటి వుంది. దానినుండి కాంతి సూటిగా అతనిపై పడుతుంది. దాహంతో ఎండిపోయిన పెదవులను నాలుకతో తడుపుకోవడానికి విఫలప్రయత్నం చేశాడు.

చుట్టూ చూశాడు. అసలైన హీరోలంతా అక్కడే వున్నారు. కరీమ్‌దాదా అతని అనుచరులు, పీటర్ నిలబడి తనవైపే చూస్తున్నారు.

“హల్లో మైడియర్ యంగ్ యాడ్వెంచరర్! ఎలావుంది? మా ఆతిథ్యం బాగుందా?” వికటమైన నవ్వుతో కూడిన పలకరింపు వినబడింది.

టేబుల్ వెనుక వుందో శాస్త్రి. చీకటిలో ఆకారం

పూర్తిగా కనబడటంలేదు. కరీమ్‌దాదా వైపు తిరిగిందా ఆకారం.

"కరీమ్‌దాదా! కాస్త లేటయినా పని బాగా పూర్తి చేసావు. నీ పారితోషికం తీసుకో!" ఒక సూట్‌కేసు కరీమ్‌దాదవైపు విసిరిందా ఆకారం.

ఆ సూట్‌కేసును ఆప్యాయంగా గుండెలకు ఆనించుకున్నాడు కరీమ్‌దాదా.

"నేను కష్టపడిం దేమీలేదు సార్! వాడంతట వాడే నా రూట్‌లోనికి వచ్చాడు." చెప్పాడు కరీమ్‌దాదా.

"సూట్‌కేస్ తెరిచి బహుమతి సరిచూసుకో దాదా." చీకటిలోనుండి వినబడ్డాయా మాటలు.

కరీమ్‌దాదా మనసులో కూడా బలంగా వుందా కోరిక. వెంటనే సూట్‌కేసు ఓపెన్ చేశాడు. మూత తెరిచిన మరుక్షణం అతనివైపు డైవ్ చేసింది ఒక చిన్న పాము.

చూడ్డానికి చిన్నగా వున్నా ఆ పాము విషసర్పాలన్నింటిలో ప్రమాదకరమైంది. సూటిగా కరీమ్‌దాదా నుదిటిపై స్ట్రయిక్ చేసింది ఆ మిన్నాగు. భయంతో వెర్రిగా అరిచాడు దాదా. తల వెనక్కి లాక్కునే లోగా అతన్ని కాటువేసిందా మిన్నాగు.

కరీమ్‌దాదా చేతులలో సూట్‌కేసు జారిపోయింది.

"సారీ దాదా! యా ఛైంక్షలు నీకు ఇస్తే బిజినెస్‌లో నాకు పోటీ అవుతావ్. వ్యాపారంలో పోటీ నేను భరించలేను." ఆ చీకటి మనిషి చెప్పాడు.

తన అనుచరులు సాయం వస్తారేమోనని చూశాడు దాదా. కాని వాళ్ళు కదలలేదు. వాళ్ళంతా అమ్ముడై పోయారని చాలా ఆలస్యంగా గ్రహించాడు దాదా. ఒక

జీవితకాలం లేటుగా.

తన కళ్ళముందరి బీభత్సాన్ని చూస్తూనే వున్నాడు సింధూర్. అయితే అతని మెదడు వేరే విషయం గూర్చి తీవ్రంగా ఆలోచిస్తుంది.

ఆ చీకట్లో వున్న మనిషి ఆ టేబిల్ పై దేన్నో వెదుకుతున్నాడు. మాట్లాడుతున్నా, తనవైపు చూస్తున్నా వెదుకుతూనే వున్నాడు. ఏం వెదుకుతున్నాడు? కోటు జేబుల్లోను, టేబుల్ పైన వుండే వస్తువు ఏమిటి? అసలు నిజంగా వెదుకుతున్నాడా? లేక అది అతని అలవాటా? అలవాటే అయితే అటువంటి అలవాటువున్న మనిషి తనకు తెలిసి ఒక్కరే వున్నాడు.

ఆ మనిషి.... .... ....

## 18

బంగ్లా ఆవరణముందు నిలబడి జాగ్రత్తగా పరిశీలించాడు రొనాల్డ్. బయట ఎవరూ వున్నట్లు లేరు.

చిన్న కొండమీద వుంది ఆ బంగ్లా. ఆ చుట్టుపక్కల మరి ఇళ్ళులేవు. అతి జాగ్రత్తగా ప్రహరీ గోడపైనుండి లోనికి దూకి బిల్డింగ్ ని సమీపించాడు రొనాల్డ్.

మూడు అంతస్థుల బిల్డింగ్ అది. రెండవ అంతస్థులో లైట్లు వెలుగుతున్నాయి. ఓరగా తెరిచివున్న ముఖ ద్వారంలో నుంచి లోపలకు వెళ్ళాడు. జీరో వాట్సు బల్బు ఒకటి వెలుగుతుంది. నిశ్శబ్దంగా అడుగులు వేస్తూ మెట్లు ఎక్కాడు.

మెట్ల వెందట, స్టూల్ పై కూర్చుని వున్నాడొక వ్యక్తి. అటువైపు తిరిగి కూర్చున్నాడు. పిల్లిలా అడుగులు వేస్తూ అటు నడిచాడు రొనాల్డు. "ఎవరది?" ఆఖరి నిము

వంలో చటుక్కున లేచి నిల్చుంటూ అరిచాడా వ్యక్తి.

ఆఖరి రెండు పెట్లు ఒక్క గొంతులో దూకి అతన్ని సమీపించాడు రోనాల్డు.

బలమంతా వుపయోగించి గొంతుమీద గుద్దాడు. చిన్నగా అరుస్తూ అలాగే విరుచుకుపడ్డాడా వ్యక్తి.

"ఏరా పిలిచావా?" లోపలినుండి ఇంకో వ్యక్తి బయటకు వచ్చాడు. రోనాల్డును చూస్తూనే మీదకు లంఘించాడు.

రోనాల్డు చేతిలో మాజిక్ చేసినట్లు ప్రత్యక్షమయ్యింది మాగ్నమ్.

సైలెన్సర్ అమర్చబడ్డదాని బారల్ చిన్నగా మూలిగింది. మొదలు నరికిన చెట్టులా కూలిబడిపోయాడా వ్యక్తి.

లోపలకు నడిచాడు రోనాల్డ్. మొదటి గది ఖాళీగా వుంది. కాని తర్వాత గదిలో దృశ్యాన్ని చూస్తూనే గుమ్మంచాటున ఆగిపోయాడు రోనాల్డు. లోపల...

సింధూర్ కొంతమంది వ్యక్తుల మధ్య నిలబడి వున్నాడు. అతనికి కొంచెం దూరంలో నేలపై పడి వున్నాడు ఒక వృద్ధ కాయుడు. బహుశ చనిపోయి వుండవచ్చును.

సింధూర్ మాట్లాడే మాటలు జాగ్రత్తగా వినసాగాడు రోనాల్డు.

# 19

"ఏం సింధూర్! భయపడ్డావా?"

"ఎందుకు మైకేల్? ఒంటికంటే భయం గాలిపోసున్న వేళాలు ఈ నాలుగురోజుల్లో చాలా చూసాను."
చెప్పాడు సింధూర్.

"పోల్చుకున్నావన్న మాట!" అన్నాడు టూరిస్టు ఏజన్సీ డైరెక్టర్ మైకేల్.

"గుర్తుపట్టాను. కాని ఈ బిజినెస్‌లో నన్ను ఎందుకు ఇరికించావో అర్థంకాలేదు." అడిగాడు సింధూర్.

"కొన్నాళ్ళనుండి డ్రగ్స్ రహస్యం తెలుసుకోవడానికి నా మనుష్యు లెవరినైనా పెడదామనుకున్నాను. కాని ఈ రౌడీలను గైడ్స్‌గా కొన్నాళ్ళు నమ్మరు. మొదటి చూపులోనే వాళ్ళను రఫ్ కారెక్టర్స్‌గా గుర్తిస్తారు. అందుకే నిన్ను దింపాను." టేబుల్ వెనుకనుండి లైట్లు వెలుగులోనికి వస్తూ చెప్పాడు మైకేల్.

"ఇక పీటర్ ఎప్పటినుండో నా అనుచరుడు. మీ హాస్టల్‌లో విద్యార్థులకు మాదకద్రవ్యాలు సప్లయ్ చేసేది వాడే."

మాట్లాడకుండా నిల్చున్నాడు సింధూర్. కథ అటు తిరిగి చివరికి ఇక్కడ తేలింది. బాగానే వుంది. మరి ఇప్పుడు తన నేం చేస్తాడు? బ్రతకనిస్తాడా?

సింధూర్ మనసులో ఆలోచనలు చదివినట్లు నవ్వాడు మైకేల్.

"పీటర్ వీడిని జాగ్రత్తగా బంధించి వుంచు. వాడు తప్పించుకున్నాడా మన పీకలమీదకు వస్తుంది" చెప్పాడు సిగరెట్ వెలిగించుకుంటూ.

నాలుగు చేతులు సింధూర్‌ను వెడరెక్కలు విరిచి పట్టుకున్నాయి. బలి పశువును ఈడ్చుకు వెళ్ళినట్లు సింధూర్‌ను అక్కడనుండి ఈడ్చుకు పోయారు.

## 20

వాన్‌లోవున్న సరుకును సంతృప్తిగా చూసాడు మైకేల్. వెనుక నిల్చున్న అనుచరులకు సైగ చేశాడు.

వాన్‌లోని సరుకునంతా అవుట్‌హౌస్‌లో పెట్టించాలని అతని అభిప్రాయం.

లెక్క ప్రకారం అతని అనుచరులు వచ్చి వాన్‌లో చెక్క పెట్టెలు భుజానికెత్తుకోవాలి కాని ఒక్కడు కూడా ముందుకు రాలేదు. ఆశ్చర్యంతో వెనుతిరిగాడు మైకేల్.

అతని అనుచరులు వరసగా నిలబడి వున్నారు. చేతులు తలల పైన పెట్టుకుని భయంగా చూస్తున్నారు, తను కూడా వాళ్ళు చూస్తున్న వైపు చూశాడు.

రోనాల్డు నిలబడి ఉన్నాడక్కడ, అతని చేతిలో మాగ్నమ్ ఆకలిగా చూస్తుంది. మైకేల్ తనవైపు చూడగానే నిశ్శబ్దంగా నవ్వాడు. కంగారుగా కోటు జేబులో చెయ్యి పెట్టాడు మైకేల్. నిర్దాక్షిణ్యంగా ఫైర్ చేశాడు రోనాల్డు. మైకేల్ భుజంలో దిగిపోయింది బుల్లెట్.

ఆశ్చర్యంతో, భయంతో మైకేల్ కళ్ళు పెద్దవయ్యాయి.

“పిచ్చివేషాలు వేయకు మైకేల్! బుల్లెట్ నీ తలలో దిగబడుతుంది. ఆ చెక్క పెట్టె ఓపెన్ చెయ్యి!” మాగ్నమ్ గురిపెడుతూ హెచ్చరించాడు రోనాల్డు.

అతి కష్టంపైన ఓపెన్ చేసాడు మైకేల్. “హెరాయిన్ పాకెట్ తియ్యి!” కరుకుగా చెప్పాడు రోనాల్డు. తీసాడు మైకేల్.

“ఆ ప్యాకెట్ చింపి నోట్లో పెట్టుకో! ఊ క్విక్!” కదలలేదు మైకేల్. రోనాల్డువైపు దీనంగా చూశాడు. అస్సలు కరగలేదు రోనాల్డు. మైకేల్ అనుచరుడివైపు చూశాడు. ఆ చూపు తీక్షణతకు భయపడుతూ ముందుకు వచ్చాడా వ్యక్తి. సైగ చేసాడు రోనాల్డు. కొద్దిక్షణాలు

తటపటాయించాడా వ్యక్తి.

మాగ్నమ్ ఆ వ్యక్తి నుదుటికి గురిపెట్టాడు రోనాల్డ్. ఇక ఏమాత్రం సందేహించలేదు ఆ వ్యక్తి. గింజుకుంటున్న మైకేల్ నోటిలోకి హెరాయిన్ ఒంపేశాడు.

మైకేల్ శారీరక శక్తినిమించిన మోతాదులో హెరాయిన్ అతని శరీరంలో ప్రవేశించింది. కొద్దిసేపటిలోనే రియాక్షన్ ప్రారంభమయింది.

డోసు అధికం కావడంతో మనిషి నిలువెల్లా ఊగిపోసాగాడు. నిముషానికొకసారి వెక్కిళ్ళు రాసాగాయి. నోటినుండి తెల్లటి నురుగు అతని కోటుపైకి కారసాగింది. కుప్పకూలిపోయాడు మైకేల్.

ఏ డ్రగ్స్ బిజినెస్‌తో ఈ దేశ యువతను నిర్వీర్యం చేసి కోట్లకు కోట్లు సంపాదించాలని కలలు కన్నాడో అదే మహమ్మారికి బలి ఇవ్వబడ్డాడు మైకేల్.

మైకేల్ అనుచరులను అవుట్‌హౌస్‌లో పెట్టి బయట గొళ్ళెం పెట్టాడు రోనాల్డ్. ఆ తర్వాత వాన్ లాక్ చేసి ఆ బిల్డింగ్ బయటకు నడిపాడు.

కాని మెయిన్ గేటు దాటకుండానే కలిగింది అవరోధం. బంగ్లా బయట రోడ్డుపై కుప్పలు తెప్పలుగా వున్నారు పోలీసులు.

మెయిన్ గేటు దాటిన మరుక్షణం వాన్ ఆపుతారు. అలాగని బంగ్లాలో వుండటానికి లేదు కాస్సేపటిలో ఖచ్చితంగా వాళ్ళే లోపలకు వస్తారు.

ఏమాత్రం సందేహించలేదు రోనాల్డ్ యాక్సిలేటర్ అదుక్కుంటూ తొక్కేశాడు.

# 21

విశాలంగావుందా గది. కాని ద్వారంమాత్రం ఒకటే వుంది. ఆ ద్వారంముందే కాపలా కూర్చున్నాడు పీటర్.

ఆ గదికున్న విండో దగ్గరకు నడిచాడు సింధూర్. పై అంతస్తులో వున్నాడు తను. ఆ కిటికీనుండి క్రిందకు దూకితే తల పగలడం ఖాయం. పీటర్‌ను మోసం చెయ్యడం సాధ్యమవుతుందా?

తలుపు దగ్గరకు వెళ్ళి కీహోల్ నుండి బయటకు చూశాడు. అక్కడే కూర్చుని సిగరెట్ పీలుస్తున్నాడు పీటర్. వాడిచేత తలుపులు తెరిపించడం కష్టం. మళ్ళీ వెనుకకు విండో దగ్గరకు వచ్చాడు.

సడన్‌గా పైనుండి క్రిందకు ఒక తాడు పడింది విండోలో తలపెట్టి పైకిచూశాడు సింధూర్. ఎవ్వరూ కనిపించలేదు తాడు చేత్తోలాగి చూశాడు రాలేదు చాలా గట్టిగా వుంది.

జాగ్రత్తగా విండోలో కూర్చుని రెండు చేతులతో తాడు గట్టిగా పట్టుకున్నాడు సింధూర్. ఒక్కసారి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు. తాను చెయ్యబోయేది దారుణమైన సాహసమని తెలుసు. పైన తాడు సరిగ్గా కట్టకపోయినా, తాడు మధ్యలో తెగిపోయినా నలభై అడుగుల క్రిందవున్న నేలపై పడి దారుణంగా చనిపోవలసి వుంటుంది.

అంతేకాదు, కుడికాలు బెణకడంతో అది పూర్తిగా సహకరించడం లేదు. క్రింద పెదవి తెగి ఇంత లావున ఉబ్బివుంది. తలపై గాయం విపరీతంగా సలుపుతుంది. ఈ రకమైన శారీరక స్థితిలో తను పైకి వెళ్ళగలడా? వెళ్ళితీరాలి.

ఆ గదిలోవుంటే తను ప్రతీకా చచ్చినట్లే.

తాడు పట్టుకుని మెల్లగా పైకి ఎక్కసాగాడు సింఘూన్. అతడు పైకి జరుగుతుంటే గాల్లో అతని శరీరం అటూ ఇటూ ఊగసాగింది. ఒక్కసారి కూడా తలత్రిప్పి కిందకు చూడలేదు సింఘూన్.

పైన గోడ అంచు దాకా వెళ్ళాక ఆగాడు. ఇక అక్కడేవుంది అసలు కిట్ తాడు వదిలి గోడ అంచు పట్టుకోవాలి. ఏమాత్రం తేడా జరిగినా ఫలితం వేరే ఆలోచించనక్కరలేదు.

కుడిచేతిని చాపి గోడ అంచు అందుకున్నాడు. ఆ వెంటనే ఎడమచేతితో అందుకున్నాడు. మెల్లిగా శరీరాన్ని గోడపైకి చేర్చి లోపలకు చూశాడు. బంగ్లా పై భాగం అది చాలా విశాలంగా వుంది.

అక్కడ నిలబడివుంది ఆ తాడు అందించిన అమ్మాయి నవ్వుతూ సింఘూర్ వైపు చూస్తుంది.

ఆ అమ్మాయిని చూస్తూనే కొయ్యబారి పోయాడు. అతని పెదవులు అప్రయత్నంగా ఒక పేరును ఉచ్చరించాయి.

## 22

రైఫిల్ నుండి వెలువడిన తూటాలా ముందుకు దూకింది వాన్. దృష్టంతా డ్రైవింగ్ పైనే కేంద్రీకరించాడు రోనాల్డు.

భంగుతాగిన ఏనుగులా గుడ్డిగా దూసుకువస్తున్న మోటార్ వాన్ను చూస్తూనే ఎలర్ట్ అయ్యారు పోలీసులు. దాని టైర్లు బ్లాస్టు చెయ్యాలని ప్రయత్నించారు.

రోనాల్డు చేతిలో స్టీరింగ్ విష్ణుచక్రంలా తిరిగింది. కకావికలై పోయారు పోలీసులు. అడ్డువచ్చిన ఒక పోలీస్

జీపును డాష్ కొట్టి తలక్రిందులు చేశాడు రోనాల్డు. విపరీతమైన వేగంతో ముందుకు సాగింది వాన్.

కొంతమంది పోలీస్ ఆఫీసర్లు రోనాల్డును వెంబడించారు మరికొంతమంది బంగ్లాలోనికి వెళ్ళారు.

తన వెనుక వస్తున్న పోలీస్ బలగాన్ని చూసి ఏమాత్రం భయపడలేదు రోనాల్డు. అడ్డం వచ్చిన వాహనాలను అదరగొడుతూ అదే వేగంతో ముందుకు సాగాడు.

పోలీస్ హెడ్ క్వార్టర్సుకు రోనాల్డు విషయం మెసేజ్ అందచేయబడింది రోనాల్డును ఆపే ప్రయత్నాలు వెంటనే ప్రారంభమయ్యాయి.

తన వెనుకే వస్తున్న పోలీస్ జీపులను చూస్తూ ఆలోచనలో పడ్డాడు రోనాల్డు. వాటిని ఎలాగైనా వదిలించుకోవాలి.

హఠాత్తుగా ఎదురయ్యింది ఒక పెద్ద వంతెన. ఒక కాలువపై కట్టబడింది. వంతెనదాటితే పోలీస్ జీపులను ఈజీగా తప్పించుకోవచ్చును వేగం ఏమాత్రం తగ్గించలేదు రోనాల్డు.

అయితే వంతెనపైకి వచ్చిన మరుక్షణం అదిరిపడ్డాడు ఆ వంతెనపై రోడ్డును పూర్తిగా బ్లాక్ చేస్తూ ఆగివుందో లారీ. దానికి కాస్త దూరంలో నిలబడివున్నారు కొంతమంది పోలీసులు.

వాన్ బ్యాక్ చెయ్యాలని బ్రేక్ నొక్కాడు రోనాల్డు నో యూజ్ బ్రేక్స్ ఫెయిలయ్యాయి.

ఏ పరిస్థితికి జంకని రోనాల్డు నుదుటిపై స్వేద బిందువులు ఆవిర్భవించాయి. ఆలోచించడానికి కాని, తిరిగి రియాక్టు కావడానికి కాని ఏమాత్రం అవకాశం ఇవ్వకుండా తరుముకు వచ్చేసింది మృత్యువు.

లారీని సమీపించిన ఆఖరి క్షణాలలో స్టీరింగ్ పిచ్చిగా తిప్పాడు గోన్సాల్వ్స్. టైర్లు కీచుమని రొద చేసాయి కంట్రోల్ తప్పి వంతెన గోడలను గుద్దుకుంది.

గోడ విరిగింది ఆ గార్ లోనుండి పిల్లి మొగ్గలు వేస్తూ కాలువలోకి డైవ్ చేసింది వాన్. దిగంతాలు దద్దరిల్లేలా అరిచాడు గోన్సాల్వ్స్.

## 23

“చెప్పు సుందరి!”

ఎదురుగా నిలబడ్డ అమ్మాయిని చూస్తూనే గొణిగాడు సింధూర్.

ఆ అమ్మాయి కనుబొమ్మలు అందంగా ముడిపడ్డాయి “అదేం పేరు? నా పేరు శైలజ” చెప్పింది సింధూర్ దగ్గరకు వస్తూ.

మైకేల్ దగ్గర పనిచేసే లేడి టైపిస్టు ఆ అమ్మాయి. మరి తనకు సహాయం చెయ్యడం ?

సింధూర్ ఆలోచనలకు నవ్వింది శైలజ. “రాష్ట్రం లోని డ్రగ్ రాకెట్ కు, మైకేల్ టూరిస్టు ఏజన్సీకి ఏదో సంబంధం వుందని మా పోలీస్ డిపార్టుమెంట్ అనుమానించింది. దానిపై పూర్తి వివరాలు తెలుసుకోవ డానికి నేను మైకేల్ సెక్రటరీగా వచ్చాను. మొదట్లో నీకూ ఈ వ్యవహారంలో భాగస్వామ్యం వుందేమోనని అనుకున్నాము. కాని ఆ తర్వాత నీవు అమాయకుడవని తేలింది.”

“ఈ స్మగ్లింగ్ వెనుక వున్నది మైకేల్!” శైలజ మాటలకు అడ్డువస్తూ చెప్పాడు.

“ఆ విషయం నాకు తెలుసు. మైకేల్ ఆఫీసునుండి రాష్ట్రంలో డ్రగ్ రాకెట్ కు సంబంధించిన పూర్తి

ఆధారాలు సంపాదించాను. ఈ బంగ్లాను చుట్టుముట్టమని పోలీస్ హెడ్ క్వార్టర్స్ కు మెసేజ్ కూడా ఇచ్చాను. ఈపాటికల్లా ఈ బంగ్లా పోలీసుల ఆధీనంలో వుంటుంది.

అదే సమయంలో మెట్లదగ్గర చప్పుడయ్యింది.

పీటర్ .... ...యస్! పీటరే అయివుండాలి. చుట్టూ చూశాడు సింఘూర్ బంగ్లా పైభాగమంది ఒక్కటే దారి. ఆ మెట్ల వెంబడి పీటర్ వస్తున్నాడు.

ఒక వాటరు టాంక్ వుంది. ఆ బంగ్లా అంతటికి వాటరు సప్లయ్ అక్కడినుండే జరుగుతుంది. కాని అక్కడ ఎంతసేపు దాక్కోగలరు?

శైలజ చెయ్యిపట్టుకుని అటు పరిగెత్తాడు సింఘూర్.

సరిగ్గా వాళ్ళు వాటర్ టాంక్ వెనుకకు చేరిన సమయంలో పీటర్ పైకి వచ్చాడు. వాడి చేతిలో ఒక పెద్ద కత్తి వుంది. దానిని వూపుకుంటూ నాలుగుమూలలూ చూశాడు.

పైనుండి క్రిందకు వ్రేలాడగట్టిన తాడు వాడి దృష్టిలో పడింది. అటు నడిచాడు.

"సింఘూ! వాడిచేతిలో రివాల్వరు లేదుగా. వెళ్ళి ఒక చెయ్యి చూడు" సింఘూర్ చెవిలో గుసగుసలాడింది శైలజ.

"ఇంకా నయం. వాడి చేతిలో కత్తి చూశావా ఎలా వుందో? నన్ను పట్టుకుని ఖైమా చేస్తాడు."

"సిగ్గులేకపోతే సరి! ఆడపిల్లలను ఏడిపించడాన్కి తప్ప మనం ఇంకెందుకు పనికిరామనుకుంటాను" వెక్కిరించింది శైలజ.

"నేను ఆడపిల్లల్ని ఏడిపిస్తానా?"

"ఏం నన్ను మైకేల్ ఆఫీసులో అ స్తమానూ ఆట పట్టించే వాడివి కావా?"

"మైగాడ్! నువ్వు ఆడపిల్లవా?" ప్రపంచంలోకెల్లా వింతయిన విషయం విన్నట్లు ఫోజు పెట్టాడు సింధూర్.

ఆ మొహం చూడగానే ఒళ్ళు మండిపోయింది శైలజకి చటుక్కున అతని కాలరు బిగించి పట్టుకుంది.

"శాంతి; శాంతి; ఇప్పుడు మనం తేల్చవలసింది పీటర్ సంగతి!" రాజీకొచ్చేశాడు సింధూర్.

అక్కడ టార్పాలిన్ నేలపై పరిచి వుంది. దానికి అ చివర పీటర్ నిలబడి వున్నాడు. ఈ చివర సింధూర్ వైపు వుంది.

శైలజ ముఖంలోనికి చూశాడు సింధూర్. అప్పటికే సింధూర్ ప్లాన్ గ్రహించేసింటావె. నవ్వుతూ లేచి నిల్చుంది.

వాటరుటాంకు వెనుకనుండి బయటకువచ్చిన ఇద్దరిని చూస్తూనే పీటర్ పెదవులపైకి వికృతమైన నవ్వు వచ్చేసింది.

కత్తి రెండు చేతులతో పట్టుకుని పీకలా అడుగులు వెయ్యసాగాడు.

హఠాత్తుగా నేలపైకి వంగి టార్పాలిన్ చేతులతో పట్టుకున్నాడు సింధూర్ శైలజలు "గోవిందా! గోవిందా" అంటూ గట్టిగా లాగేశారు.

పీటర్ వెల్లకిలా పడతాడని వాళ్ళ ఊహ. అయితే దేవుళ్ళందరిలోను వెంకటేశ్వరస్వామి మోస్టు పవరుఫుల్ గాడ్.

వాళ్ళు క్రింది టార్పాలిన్ కదలడంతో వెనక్కు తూలాడు పీటర్. వెనుక వున్న పిట్టగోడ అతన్ని ఆప

తెగిపోయింది. మూడు అంతస్థుల బంగ్లాపైనుండి క్రిందకు జారిపోయాడు పీటర్.

భయంతో వాడు అరిచిన అరుపు గాలిలో అలలు అలలుగా వ్యాపించింది.

పరుగున పిట్టగోడ దగ్గరకు వచ్చి క్రిందకు చూసింది శైలజ. నేలపై వికృతంగా పడి వుంది పీటర్ శవం.

బంగ్లా ఆవరణ అంతా పోలీసులతో నిండిపోయింది. మైకేల్ అనుచరులను వరసగా వాన్‌లో ఎక్కించేస్తున్నారు.

అది చూస్తూనే పట్టరాని సంతోషంతో పెద్దగా అరిచింది శైలజ. వెనుక వున్న సింధూర్‌ను గట్టిగా పట్టేసుకుంది.

ముందు బిత్తరపోయాడు సింధూర్. అంతలోనే ఇది కూడా చేతకాదా? అంటుందేమోనని తను కూడా ఇంకా గట్టిగా వాటేసుకున్నాడు.

— అయిపోయింది —

సీరియల్

# రాక్షసహేల

వాణిశ్రీ

(గత సంచిక తరువాయి)

"యస్....యస్....! కిరణ్ అదృష్టవంతుడు లెండి. జాబ్ చెయ్యాల్సిన అవసరంగాని, బిజినెస్ చెయ్యాల్సిన అవసరంగూడా ఏమీ లేదు. దర్జాగా ఖర్చుపెట్టుకుంటూ జల్సాచేసినా తరగని ఆస్తివచ్చి పడింది. అత్తగారి తరఫున లెండి" అన్నాడు గోవిందరాజులు నవ్వుతూ.

"అలాగా! ఏ వూరు మీ అత్తారిది?" ప్రశ్నించాడు అవతారకృష్ణ.

"ఆనందపురం. ఆ వూరి జమీందార్లు మా అత్తగారు" చెప్పాడు కిరణ్.

కొన్నిక్షణాలు అవతారకృష్ణలో కలిగిన కలవరం, సంచలనం గమనించాడు కిరణ్.

"ఆనందపురమా?" తనలోతను అనుకున్నట్లు మెల్లిగా గొణిగాడు అవతారకృష్ణ.

"గోదావరి జిల్లా!"

"అలాగా!" అన్నాడు అతను తొట్రుపాటు కనిపించనీయకుండా వుండడానికి ప్రయత్నిస్తూ.

"మీరెప్పుడైనా మా వూరు వచ్చారా?" కిరణ్ అతన్ని క్రీగంట గమనిస్తూ అడిగాడు.

"నేనా? " గొంతులో కంగారు కనిపిస్తోంది.

"అబ్బే లేదు. మాది గుంటూరు జిల్లా. గోదావరి జిల్లాలో పెద్దగా టచ్ లేదు. హైదరాబాద్ అంటారా? కొట్టిన పిండి" చెప్పాడు అవతారకృష్ణ.

"నాకెవరూ పెద్దవాళ్ళు లేరు సార్! మా నాన్న చనిపోయారు. ఇక నా మిసెస్ చిన్నతనంలో నే వాళ్ళ అమ్మ, నాన్నలని కొందరు దుర్మార్గులు మర్డర్ చేశారు?"

అవతారకృష్ణ వులిక్కిపడ్డాడు.

"మర్డర్ చేశారా? ఎవరు చేశారు? ఎందుకు?" ఆతృత కనిపించింది అతని కంఠంలో.

"ఎందు కేమిటి సార్? డబ్బు! బంగారం కోసం మర్డర్ చేశారట...."

"అయ్యో పాపం."

"ఎంత దుర్మార్గులో చూడండి. డబ్బు, బంగారం దోచుకుని వదిలెయ్యవచ్చుగా! ప్రాణాలు తీశారు రాక్షసులు."

"ప్రాణాలు తియ్యకపోతే తర్వాత గుర్తుపడతా రేమోనని భయం. అందుకే హత్య చేసి వుంటారు" అన్నాడు గోవిందరాజులు.

"అంతే....అంతే జరిగివుంటుంది సార్!" అన్నాడు కిరణ్.

"హత్య చేసినవాళ్ళు దొరికారా?" అన్నాడు అవతారకృష్ణ.

"దొరకలేదు సార్! దొరికితే వదిలిపెడతారా. చంపి పారేసి వుండేవాళ్ళు కదూ! ఇంకేం దొరుకుతారు లెండి. ఇరవై ఏళ్ళ క్రితం జరిగిన వ్యవహారం" అన్నాడు కిరణ్.

అవతారకృష్ణ రిలీఫ్‌గా వూపిరి పీల్చుకున్నాడు.

"ఇప్పుడేం వర్క్ చేస్తున్నారు?" ప్రశ్నించాడు

అవతారకృష్ణ.

"చిన్న వర్కులెండి. క్వారీనుంచి డామ్‌సైట్‌కి మెటల్ చేర్చడం" చెప్పాడు కిరణ్.

"చిన్న చిన్న వర్కుల్తోనే మొదలుపెట్టాలిలెండి. అనుభవం వస్తుంది. ఏ కంట్రాక్టరయినా చిన్న చిన్న వర్కుల్తోనే స్టార్టుచేస్తాడు. తర్వాత ఇంప్రూ చెయ్యొచ్చు" అన్నాడు అవతారకృష్ణ.

గోవిందరాజులు బాయ్‌ని కేకేసి ఏదో చెప్పాడు.

కొద్దిసేపటి తర్వాత బాయ్ అక్కడ ఒక ఫోల్డింగ్ టేబుల్ వేశాడు. బీర్ సీసాలు, గ్లాసులు తెచ్చాడు. ప్లేటులో జీడిపప్పు సర్వ్ చేశాడు.

అవతారకృష్ణ రెండు గ్లాసులు నింపాడు. మూడో గ్లాసులో పొయ్యబోతూ వుంటే కిరణ్ వారించాడు.

"ఐయామ్ సారీ సర్ ఐ విల్ టేక్ కూల్ డ్రింక్" అన్నాడు.

"అలవాటు లేదా?....లేకపోతే అదే అలవాటై పోతుంది. ఈ లైన్లో డ్రింక్ లేకపోతే వుండలేం. పగలంతా ఎండలో తిరిగి అలసిపోతాం కదండీ. కాస్త రిలీఫ్‌గా వుంటుంది మందు పుచ్చుకుంటే" చెప్పాడు అవతారకృష్ణ.

"అఫ్‌కోర్స్!" నవ్వాడు కిరణ్.

"ఇప్పుడిప్పుడేగా బిజినెస్‌లో పడింది. ముందు ముందు పుచ్చుకుంటాడు లెండి. ఇంకా కుర్రాడేగా!" అన్నాడు గోవిందరాజులు.

"అందులోను కొత్తగా పెళ్ళయినవాడిని" అని నవ్వాడు కిరణ్.

"అందడీ అసలు సంగతి. తాగి వస్తే వైఫ్ దగ్గరికి

రానివ్వదేమో?" అని నవ్వాడు అవతారకృష్ణ.

ముగ్గురూ అలా కబుర్లు చెప్పుకుంటూ చాలాసేపు కూర్చున్నారు. బాయ్ బీర్ సీసాలు సర్వ్ చేస్తూనే వున్నాడు. కిరణ్ రెండుసార్లు ఆపిల్ జ్యూస్ తెప్పించుకున్నాడు.

టైమ్ తొమ్మిదైంది.

గుడ్ నైట్ చెప్పుకుని విడిపోయారు.

"ఇంత ఆలస్యమైందేం ఈ రోజు?" క్యాజువల్ గా అడిగింది విజయ.

"అవతారకృష్ణ పరిచయమయ్యాడు" క్లబ్ లో" చెప్పాడు కిరణ్.

"ఈజిట్?"

"యస్."

"ఎలా?"

"ఇ.ఇ. గోవిందరాజులు ఇంట్రడ్యూస్ చేశాడు. వాళ్ళిద్దరూ మందుకొడుతూ కూర్చున్నారు."

"నువ్వు బుద్ధిమంతుడిలా కూర్చున్నావు! యామ్ ఐ కరక్టే?" నవ్వింది విజయ.

"నేనింకా చెడిపోలేదులే!" అని నవ్వాడు కిరణ్.

డిన్నర్ తీసుకుంటూ క్లబ్ లో తాము మాట్లాడుతున్న విషయాలన్నీ చెప్పాడు. విజయ ఆలకిస్తూ మధ్యమధ్యలో ప్రశ్నలు వేస్తూ వుంటుంది. రోజూ అదే కాలక్షేపం.

"వాడికి వాళ్ళబావ చిరంజీవిరావు అండ బాగా వుంది. వాళ్ళిద్దరికీ చెడిపోతే మన పని సులభం అవుతుంది" చెప్పాడు కిరణ్.

"వాళ్ళిద్దరికీ చెడడం అంటే మాటలా? ఎప్పట్నుంచో కలిసి ఇక్కడ వుంటున్నారు. పైగా బావా

బామ్మర్దులు.”

“అదే చిక్కు వచ్చింది. అన్నదమ్ములైతే తేలిగ్గా విడగొట్టవచ్చుగాని, బావాబామ్మర్దుల్ని అంత తేలిగ్గా చీల్చలేం” అన్నాడు కిరణ్.

“లెటజ్ ట్రై!”

“సరే మరొక రూట్ కూడా ఆలోచించి పెట్టాను.”

“వాట్?”

“అవతారకృష్ణకి ఫాతిమా అని ఒక కీప్ వుంది. దానికొక తమ్ముడున్నాడు. బేవార్స్‌గాడులే. వాణ్ని మన చదరంగంలో పావుగా వుపయోగపడొచ్చు.”

“ఎలా?”

కిరణ్ చెప్పాడు.

# 16

ఉదయం ఎనిమిదింటికి కిరణ్ ఫియట్ కారు అవతార కృష్ణ ఇంటి పోర్టికోలో ఆగింది.

ఆయన ఇంకా స్నానం చేయాలేదనీ, విజిటర్స్ రూమ్‌లో కూర్చోమని కబురు చేశాడు.

కిరణ్ విజిటర్స్‌లో రూమ్‌లో కూర్చున్నాడు. పని మనిషి కాఫీ ట్రేలో తెచ్చి టీపాయ్ ముందు పెట్టింది.

అరగంట తర్వాత వచ్చాడు అవతారకృష్ణ

“సారీ మిస్టర్ కిరణ్.”

“దట్సాల్ రైట్ సర్. నేనే చాలా ఎర్లీగా వచ్చాను.”

“వాటీజ్ ద మేటర్! ప్రొద్దున్నే వచ్చారు?” అడిగాడు అవతారకృష్ణ.

“మీ హెల్ప్‌కోసం వచ్చాను సర్.”

“నా హెల్పా? భలేవారే? నేనేం చెయ్యగలను?”

"మీరు సీనియర్ కంట్రాక్టర్. నేను జూనియర్ని. ఐ వాంట్ యువర్ గైడెన్స్" చెప్పాడు కిరణ్.

అవతార కృష్ణ పెదవులమీద చిరునవ్వు మెరిసింది.

"వాటీజ్ దెట్! చెప్పండి. ఏం కావాలి మీకు?"

"నేను మరీ ఒంటరివాడినై పోయాను. నాకు బ్రదర్స్ లేరు. బ్రదరిన్లాస్ కూడా లేరు. రాత్రి మీకు అంతా చెప్పాను."

"యస్....యస్... !"

"ఒక్కడ్నే అన్ని పనులూ చూసుకోవాలంటే కష్టంగా వుంది. ఐ వాట్ టూ ఇంప్రూవ్ దిస్ బిజినెస్. నాకు నమ్మకమైన మనిషి కావాలి. వర్కుల్లో కాస్త అనుభవం వున్న వ్యక్తి అయితే చాలు."

అవతారకృష్ణ ఆలోచనలో పడ్డాడు.

"ఎవరున్నారబ్బా! ప్రస్తుతానికి ఎవరూ లేరే!" అన్నాడు.

అతను అలా అంటాడని కిరణ్ ముందే ఊహించాడు.

"మీ ద్వారా అయితే కాస్త నమ్మకంగా వుంటుందనే ఐడియాతో వచ్చాను. ఇక లేకపోతే సుబ్బిరెడ్డి గారిని అడగాలి" అన్నాడు కిరణ్.

సుబ్బిరెడ్డి మరొక బడా కంట్రాక్టర్. అవతార కృష్ణ గ్రూప్ కీ సుబ్బిరెడ్డి గ్రూప్ కీ చుక్కెదురు.

"పెద్దపులి లాంటి వాడొకడున్నాడు. వాడిని మీరు భరించగలరా? అని ఆలోచిస్తున్నాను" సాలోచనగా అన్నాడు అవతారకృష్ణ.

"వాడు పెద్దపులైతే నేను రింగ్ మాస్టర్ లా ఆడిస్తాలెండి" అని నవ్వాడు కిరణ్.

"దట్సాల్ రైట్. మీదగ్గరకి పంపిస్తాలెండి. ఈవినింగ్

ఇంట్లో వుంటారుగా?" అన్నాడు అవతారకృష్ణ.

"వుంటాను. థ్యాంక్యూ వెరీమచ్"

"నో మెన్షన్"

"ఇల్లు చాలా పెద్దది. ఇంట్లో ఎవరూ కనిపించడం లేదేం? వూరెళ్ళారా?"

"లేదు అబ్బాయి లిద్దరూ స్టడీస్ కి వెళ్ళిపోయారు. నా మిసెస్ కిచెన్‌లో వుంది. ఇక మా అమ్మాయి ఒక్కతే ఇంటర్ చదువుతోంది."

అతను చెప్తూ వుండగానే సుభాషిణి "డాడీ!" అంటూ వచ్చేసింది.

కిరణ్‌ని చూసి ఒక్కక్షణం వెనక్కి తగ్గింది.

"ఫరవాలేదు రామ్మా! హీ ఈజ్ మిస్టర్ కిరణ్" అన్నాడు.

"హాయ్! అంకుల్" అంది సుభాషిణి

"హాయ్! బేబీ...." అన్నాడు కిరణ్.

ఆమెను పరిశీలనగా చూశాడు.

పద్దెనిమిది సంవత్సరాలుంటాయి ఆమెకు. పొడుగ్గా వుండడంవల్ల ఇంకా ఎక్కువ వయస్సు వున్న అమ్మాయిలా కనిపిస్తోంది. అవతారకృష్ణ పోలికలు ఏమీ లేవు. ఆపోజిట్‌గా వుంది. పచ్చటి శరీరం, కళ గల ముఖం. ముక్కు సొంపైనదిగా అందంగా వుంది. ఖాకీరంగు జీన్స్ పాంట్‌లో, ఆదేరంగు షర్ట్ టక్ చేసింది. రెండు జడలు మధ్యకు ముడిచి కట్టింది. ఒకచేతికి నలుపురంగు వాచీ, మరొక చేతికి రెండు బంగారు గాజులు వున్నాయి.

ఆమెలో యేదో లోపం కనిపించింది అతనికి. ఆలోచించగా అర్థమైంది. ముఖానికి బొట్టు, తలలో పూలు లేవు ఆమెకు.

కిరణ్ ఆమెను ఒకసారి తమ ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. సుభాషిణి 'సరే' అంది.

కిరణ్ అతనికి 'థాంక్స్' చెప్పి బయల్దేరాడు.

అతనికి తెలుసు అవతారకృష్ణ ఎవర్ని పంపుతాడో.

వాడి పేరు యూసఫ్. అవతారకృష్ణ ప్రియురాలు ఫాతిమా తమ్ముడు. కంపెనీలో అతనిదే పెత్తనం. ఈ మధ్య మరీ ఎక్కువైంది. కుర్రాడు వ్యసనాలకి అలవాటు పడ్డాడు. బావగారు ఇచ్చే జీతం చాలడంలేదు. గీతానికి అలవాటు పడ్డాడు. సిమెంట్ స్టీల్ చాటుగా అమ్మకోవడం మొదలుపెట్టాడు.

అతనికి ఈ విషయం తెలిసినా కోప్పడి వూరుకుంటున్నాడు గాని ఏమీ చెయ్యలేకపోతున్నాడు. వాడ్ని తొలగిస్తే ఫాతిమాకు కోపం వచ్చి అలుగుతుందనిభయం. కక్కలేక మింగాలేక వాడిని ఎలా వదిలించుకోవాలో అర్థంకాని పరిస్థితిలో వున్నాడు. ఇప్పుడు వాడికి ఏదో చెప్పి పీడా వదిలించుకుంటాడు.

కిరణ్ వూహించినట్లే సాయంకాలం ఆరుగంటలకు యూసఫ్ వచ్చి కలుసుకున్నాడు.

"నన్ను అవతారకృష్ణగారు పంపించారు సార్!" అన్నాడు యూసఫ్.

కిరణ్ తలవూపి వివరాలు అడిగాడు. యూసఫ్ చెప్పాడు. నెలకు తొమ్మిదివందలు జీతం ఇచ్చే ఏర్పాటు చేసుకుని అతన్ని వర్కుస్లోకి తీసుకున్నాడు కిరణ్.

అప్పటికి కిరణ్ దగ్గర నాలుగు లారీలు వున్నాయి. ఎనిమిదిమంది డ్రైవర్లు, క్లీనర్లు వున్నారు. క్వారీనుంచి ముమ్మరంగా మెటల్ సప్లయ్ జరుగుతోంది.

నెలరోజులు గడిచేసరికి యూసఫ్ ఎండిపోయాడు.

తొమ్మిదివందలు జీతం వాడికి పదిరోజులు రాలేదు. అమ్ముకోవడానికి సిమెంట్, స్టీల్ లేదు.

"సార్! నాకు జీతం సరిపోవడంలేదు" అన్నాడు యూసఫ్ ఒకరోజు వచ్చి.

"ఒక్కడికి తొమ్మిదివందలు చాలడం లేదా?" ఆశ్చర్యం నటించాడు కిరణ్.

యూసఫ్ సమాధానం చెప్పలేదు.

చిరునవ్వు నవ్వాడు.

"ఇప్పుడు బిజీలో వున్నాను. చీకటిపడ్డాక ఇంటికి వస్తే తీరికగా మాట్లాడతాను" అన్నాడు కిరణ్.

యూసఫ్ వెళ్ళిపోయాడు.

రాత్రి ఏడుదాటిన తర్వాత ఇంటికి వచ్చాడు యూసఫ్.

కిరణ్ లాన్‌లో గార్డెన్ ఛైర్‌లో కూర్చున్నాడు. టీపాయ్ మీద ఆపిల్ బ్యాక్ బాటిల్ ఐసుపాట్, గ్లాసులు వున్నాయి. మరొక చైర్ ఖాళీగా వుంది.

యూసఫ్ దగ్గరగా వచ్చి విష్ చేశాడు.

"రా ...రా....కూర్చో!" అన్నాడు కిరణ్.

"వద్దు సార్!..." మొహమాటపడ్డాడు యూసఫ్.

"ఫరవాలేదు. ఇది ఆఫీసుగాదు ఇల్లు. ఆఫీసులో నేను బాస్ నువ్వు మేస్త్రీవి. మంచి, మర్యాద అక్కడ వుండాలి. నైట్ ఫ్రెండ్స్‌లా వుండాలి. కూర్చో."

కిరణ్ మాటలు అతన్ని ఇంప్రెస్ చేశాయి.

యూసఫ్ ఛైర్‌లో ఇబ్బందిగా కూర్చున్నాడు.

"యూసఫ్ నువ్వెంతకాలం నుంచి అవతారకృష్ణగారి దగ్గర పనిచేస్తున్నావ్?"

"తొమ్మిదేళ్ళనుంచి సార్!"

"ఈ కాంట్రాక్ట్స్‌లో బాగా లాభం సంపాదించాడా?"

"బాగా ఏమటి సార్! దోపిడీ అనుకోండి."

"అంత లాభంగా వుంటుందా? నాకేం కనిపించడం లేదే! నాలుగు లారీలు సరికొత్తవి కొన్నాను. ఏడెనిమిది లక్షలు పెట్టుబడి పెట్టాను. ఇంటి దగ్గర్నుంచి డబ్బు తెప్పించడమే సరిపోతోంది."

యూసఫ్ నవ్వాడు.

"మీరు ఇలా సూటిగా చేస్తే ఏం మిగలదు సార్!"

"మరేం చెయ్యాలి?"

"దీనికి కొన్ని సీక్రెట్స్ వున్నాయి సార్!"

"అలాగా!" అన్నాడు కిరణ్.

పనిమనిషి వచ్చి టీపాయ్ క్లీన్ చేసింది. కిరణ్ ఆమెకు ఒక స్లిప్ మీద ఏదో రాసి, వందకాగితం అందించాడు. కొద్దిసేపట్లో ఆమె సంచిలోనుంచి ఫుల్ బాటిల్ బ్రాందీతీసి టీపాయ్‌మీద పెట్టింది. ప్లేటులో జీడిపప్పు సర్దింది.

కిరణ్ బాటిల్ ఓపెన్ చేసి గ్లాసులో పోసి ఐసు క్యూబ్స్ వేశాడు.

"తీసుకో యూసఫ్" అన్నాడు

యూసఫ్ అదంతా ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఈయన ఎంత మంచివాడో అనుకున్నాడు. ఒక్కసారిగా కిరణ్ అంటే ప్రేమ పెరిగిపోయింది.

"సార్!....మీరు?"

"నాకు అలవాటు లేదులే. కూల్ డ్రింక్ తీసుకుంటాను" అన్నాడు నవ్వుతూ.

యూసఫ్ గ్లాసు ఎత్తి సిప్ చేశాడు.

అవతారకృష్ణ ఎట్లా లాభం సంపాదిస్తాడో తనకు తెలిసిదంతా చెప్పాడు యూసఫ్.

"సిమెంట్, స్టీల్ తెగ అమ్ముకుంటాడు సార్! అడ్డొచ్చిన వాళ్ళందరికి లంచాలు ఇస్తుంటాడు."

కిరణ్ వింటూ కూర్చున్నాడు.

"మీరుగూడా బాగా సంపాదించొచ్చు సార్?"

"ఎలాగయ్యా! మనకి సిమెంట్, స్టీల్ లేదుగా!" అన్నాడు కిరణ్.

"ఎక్కడ మార్గాలు అక్కడుంటాయి సార్! మనం మెటల్ సప్లయ్ చేస్తున్నాం. అక్కడ ఇన్‌చార్జి ఇంజనీర్లు నోట్ చేసుకుని రికార్డు చేస్తున్నారు. మనం ఎంత మెటల్ తోలితే అంతకే బిల్స్ ఇస్తున్నారు."

"ఎన్ని లోడ్‌లు తోలితే అంతకేకదా బిల్స్ పే చేసేది?"

"మీరు వూఁ......అనండి. నేను మాట్లాడతాను. అక్కడ వాళ్ళు మిమ్మల్ని కదపడానికి భయపడుతున్నారు."

"ఏం?"

"ఏమో సార్!"

"ఇందులో లాలూచీ వ్యవహారం ఏవుంటుంది?" ప్రశ్నించాడు కిరణ్.

"ఎందుకు వుండదు సార్? మనం రోజుకి వంద లోడులు మెటల్ తోలుతాము. మనం లాలూచీ పడితే అక్కడ రికార్డుచేసే ఇంజనీరు రెండువందల లోడ్స్ రికార్డు చేస్తాడు" చెప్పాడు యూసఫ్.

"ఇటువంటివి నావల్లకాదయ్యా!" అని నవ్వాడు కిరణ్.

"లేకపోతే మీ కేం లాభంలేదు సార్!" ఖండితంగా చెప్పాడు యూసఫ్.

"నేను లాభంకోసమే చెయ్యడం లేదులే. ఏదో కాలక్షేపంగా వుంటుందని మొదలుపెట్టాను. టౌన్‌లో కంటే ఇక్కడ హాయిగా వుందయ్యా! చుట్టూ కొండలు, అడవి, నది. ప్రశాంతంగా వుంది వాతావరణం."

యూసఫ్ తల వూపాడు.

"ఇప్పుడు చెప్పు? నీకు జీతం సరిపోవడంలేదా?"

"అవును సార్!"

"ఒక్కడివేగా?"

"అవుననుకోండి. నాకు ఇదుగో ఈ అలవాటు వుంది" గ్లాసు చూపించి నవ్వాడు యూసఫ్.

"నేనొకటి అడుగుతాను ఏమనుకోవుగదా!" అన్నాడు కిరణ్.

"అమ్మమ్మా!....అడగండి సార్! నేనేం అనుకోను" యూసఫ్ మాటలు ముద్ద ముద్దగా వస్తున్నాయి.

"మీ అక్కయ్యని అవతారకృష్ణ రెండో పెళ్ళి చేసుకున్నాడా?" ప్రశ్నించాడు కిరణ్.

యూసఫ్ పకపక నవ్వాడు.

"ఇది అడగడానికి మీరింత ఇదవుతున్నారా? ఇది అందరికీ తెలిసిన సంగతే! మా అక్కని పెళ్ళిచేసుకో డానికి వాడేం పిచ్చోడా సార్!" వుంచుకున్నాడు అంతే."

"మీ అక్కకు పెళ్ళి కాలేదా?"

"అయింది సార్! మా బావ డ్రైవరుగా పనిచేసే వాడు వాడి దగ్గరే. మా అక్క తిరుగుళ్ళు మొదలు పెట్టింది. దానికి ఖరీదైన చీరలు, షోకులు కావాలి

ఎక్కడ్నుంచి వస్తాయి మరి? మా బావకి తెలిసి దీన్ని వదిలి ఎటో పోయాడు. వాడి అడ్రెసు లేదు. తర్వాత ఏవుంది ఇది దుకాణం పెట్టింది. ఎట్లా కుదిరిందోగాని అవతారకృష్ణ పర్మినెంట్ గా వుంచుకున్నాడు. దానికేం లెండి దర్జాగా వుంది. దానికి కోరిన చీరలు, నగలు చేయిస్తాడు. కాకి ముక్కుకి దొండపండు అంటారే అట్లా వుంటుంది వాళ్ళిద్దరికీ. ముసలోడికి పడుచుపిల్ల. ఇల్లు కట్టించి ఇచ్చాడు. అడిగినప్పుడు డబ్బిస్తాడు. అయితే ఏం సార్ అది ఇప్పటికీ చాటుమాటు తిరుగుళ్ళు మాన లేదు. ఎట్లా మానుద్ది లెండి. ముసలోడి దగ్గర సుఖం ఏవుంటుంది?"

యూసఫ్ తన అక్క గురించి నిజాయితీగా చెప్తుంటే కిరణ్ కి కొంచెం ఆశ్చర్యం వేసింది. తాగినవాడు అబద్ధం చెప్పడంటారు ఇదే నేమో? అనుకున్నాడు.

"సరే ఆ గొడవ అపు. మీ అదృష్టంకొద్దీ అవతార కృష్ణగారు బ్రతకడానికి మంచి మార్గమే చూపించాడు. అయితే నువ్వు దాన్ని సద్వినియోగం చేసుకోవాలి. డబ్బు సంపాదించి వెనకేసుకోవాలి. ముందు ముందు సుఖపడొచ్చు."

"ఏం చెయ్యాలి సార్? నాకొచ్చేది జీతమే గా? తిన డానికి సరిపోతోంది. వెనకేసుకునేది ఏవుంది నా బొంద!"

"బాగా ఆలోచించు. మీ అక్క చేతిలో అవతార కృష్ణ వున్నాడు. మీ అక్క నీ చేతిలో వుంది. మీ అక్కద్వారా ఆయనకి చెప్పించు. నీకు 'సి' క్లాస్ కంట్రాక్టర్ గా రిజిస్ట్రేషన్ చేయించమను. కొద్దిగా పెట్టుబడి పెడితే నువ్వు తారాజువ్వలా దూసుకుపోతావు.

లక్షలు సంపాదిస్తావు. ఎందుకంటే నీకు బోలెడు అనుభవం వుంది కాబట్టి."

కిరణ్, యూసఫ్‌ని జాగ్రత్తగా గమనించాడు. తన మాటల ప్రభావం అతనిమీద బాగా పనిచేసింది. అతని కళ్ళు మెరిశాయి. కొన్ని నిముషాలు సేపు ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

"నిజమే సార్! నేనెప్పుడూ ఇలా ఆలోచించలేదు. లేకపోతే ఎప్పుడో ఈ పని చేసి వుండేవాడిని. ఈ పాటికి లక్షలు సంపాదించేవాడిని" అన్నాడు యూసఫ్.

"ఇప్పటికైనా మించిపోయిందిలేదు. వెంటనే ప్రయత్నించు. అయితే నేనీ సలహా ఇచ్చినట్లు ఎవరికీ తెలియకూడదు" చెప్పాడు కిరణ్.

"అమ్మమ్మ ... దేవుడులాంటి వారు సార్ మీరు. మీమీద చెప్తానా?" అని యూసఫ్ దండాలు పెడుతూ, తూలుకుంటూ వెళ్ళిపోయాడు.

## 17

ఆ గది స్వర్గంలా వుంటుంది అవతారకృష్ణకి.

లేబర్ కాలనీకి కొంచెం దూరంలో ఫాతిమాకోసం కట్టించాడు ఆ బిల్డింగ్.

నది ఒడ్డునే అందంగా కనిపిస్తుంటుంది. అందరూ దాన్ని బృందావనం అంటారు.

చుట్టూ కాంపౌండ్ వాల్. గోడచుట్టూ కొబ్బరి చెట్లు. ఆవరణలో పూలమొక్కలు. అహ్లాదకరంగా వుంటుంది.

రాత్రి ఎనిమిది దాటిన తర్వాత ఆ ఇంట్లో పనిమనిషి కూడా వుండదు. అల్సేషన్ కుక్క కాపలా కాస్తూ వుంటుంది.

క్లబ్ నుంచి పరాసరి అక్కడికి వస్తాడు అవతార కృష్ణ. ఆ గదిలోకి వెళ్ళిన మరుక్షణం అతనికి అలసట మాయమైపోతుంది. నూతనోత్సాహం వస్తుంది. ఫాతిమా అడుగుపెట్టాక స్వర్గంగా మారుతుంది.

అవతారకృష్ణ అప్పుడే స్నానంచేసి వచ్చాడు.

సోఫాలో కూర్చున్నాడు.

ఫాతిమా అతని ప్రక్కనే ఆనుకుని కూర్చుంది. టీపాయ్‌మీద వున్న జానీవాకర్ విస్కీని గ్లాసులోకి వంచి ఐస్‌క్యూబ్స్ వేసి అతని పెదవులకు అందించింది.

అతను మత్తుగా చూస్తూ ఒక్కొక్క గుటకే వేస్తున్నాడు. అప్పుడప్పుడు నోటికి జీడిపప్పు పలుకులు అందిస్తోంది. ఆ స్వర్గంలో అన్ని పనులూ ఆమే చేస్తుంది. అతని చేతులు ఆమె శరీరంమీద ఆడుకుంటాయి.

ఎ.సి. చల్లగా తగులుతోంది.

గోడమీద ఉమర్ ఖయ్యాం మధు పాత్రలోకి అర్ధనగ్నంగా వున్న సాకీ మధువు ఒంచుతోంది. ఆ చిత్రం అంటే అతనికి యెక్కడలేని ఇష్టం. అది తప్ప మరొక చిత్రం వుంచనియ్యడు.

ఫాతిమా అందం క్షణక్షణానికి పెరిగిపోతున్నట్లుగా వుంది అతనికి. పెగ్గులు గొంతులోకి జారేకొద్దీ ఆమె రంభలా, ఊర్వశిలా, మేనకలా, రకరకాలుగా కనిపిస్తూ వుంటుంది.

అతను దోమతెరలు దించిన బెడ్‌మీదకు చేరాడు. ఫాతిమాను మీదకు లాక్కున్నాడు. క్రీమ్ కలరు నైటీ నెమ్మదిగా తొలగించాడు. ఆమె నగ్న శరీరం బంగారు రంగులో మెరుస్తోంది. ఎత్తు గుండెలు అతనికి పిచ్చెక్కించేస్తున్నాయి. ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళుగా ఆమె

సౌందర్యాన్ని ఆరాధిస్తున్నా అతనికి మోజు తగ్గడం లేదు. ఆమె అందం నిత్యనూతనంగా కనిపిస్తోంది అతనికి. అదే అతనికి ఆశ్చర్యంగా గూడా వుంది.

ఆ రసవత్తరం ఘట్టంలో ఫాతిమా పెదవి విప్పింది.

"యూసఫ్‌ని ఎవరి దగ్గరికో పంపించేశారటగా?"

"ఆఁ....నీకు చెప్పలేదా నేను" అన్నాడు.

"వుహూఁ...."

"చెప్పాననుకున్నాను."

"చెప్పలేదు. ఎందుకు పంపించారు?" అంది ఫాతిమా.

"వాడి మంచికోసమే. కిరణ్ అని కొత్తబిచ్చగాడొకడు వచ్చాడ్లే. వాడికి ఏం తెలియదు. కాంట్రాక్టులు చేద్దామని వచ్చాడు. ఒక ఇ.ఇ. వాడిని రంగంలోకి దించాడు. ఏదెనిమిది లక్షలు పెట్టుబడి పెట్టాడు అప్పుడే. లాభం కనబడడంలేదు. ఏం చెయ్యాలో వాడికి తెలియదు. అనుభవంలేదు. నా దగ్గరకొచ్చాడు అనుభవం వున్న కుర్రాడిని చూసిపెట్టమని. మనవాడు గదా అని యూసఫ్‌ని పంపించాను. బాగా సంపాదించుకోవచ్చులే."

"వాడిప్పుడు అక్కడ పని చెయ్యనంటున్నాడు."

"ఏం?" అడిగాడు అవతారకృష్ణ.

"జీతం తప్ప పైన పైసా దొరకడం లేదంట" అంది ఫాతిమా.

అవతారకృష్ణకి చిరాకు కలిగింది.

"వెళ్ళగానే దొరుకుద్దా! కొన్నాళ్ళు ఓపికపట్టాలి. ఇప్పుడు వాడు మెటల్ కంట్రాక్టు తీసుకున్నాడు. ముందు ముందు ఒక బ్లాక్ కంట్రాక్టు తీసుకుంటాడు. డబ్బున్నవాడు గూడా. అప్పుడుయేమైనా సంపాదించు

కోవచ్చు."

"ఏమో! వాడు ససేమిరా అక్కడ చెయ్యనంటు న్నాడు."

"మరేం చేస్తాడంట?"

"వాడే కాంట్రాక్టు చేస్తాడంట" చెప్పింది ఫాతిమా.

అవతారకృష్ణ అదిరిపడ్డాడు.

"చాలా అనుభవం వుందిగదా వాడికి. మీరు వాడిని కాంట్రాక్టరుగా రిజిస్ట్రేషన్ చేయించండి. నెమ్మదిగా పైకి వస్తాడు" గోముగా అంది ఫాతిమా.

అతనికి నిషా దిగిపోయింది దెబ్బకి.

"బద్మాష్ వెధవ. వాడు కంట్రాక్టరా? నేను రిజి స్ట్రేషన్ చేయించాలా? తాగుబోతు వెధవ. లుచ్ఛా! నేను రేపు వాళ్ళో తలెత్తుకొని తిరగాలా లేదా?"

అతను రెచ్చిపోయాడు.

"కంట్రాక్టరు అంటే అంత చీప్ అనుకుంటున్నావా? అసలు వాడికేం తెలుసని? వాడిని నమ్మి నేను లక్షలు పెట్టుబడి పెట్టాలా? యేదో నీ ముఖంచూసి వాడిని చేరనిచ్చాను. ఏదో పనిచేసుకుంటూ బతుకమను. మరో సారి పిచ్చి పిచ్చి మాటలు మాట్లాడావంటే నేను మనిషిని కాను."

అవతారకృష్ణ ఆగ్రహమూర్తె పోయాడు.

ఫాతిమా ముఖం కోపంతోను, అవమానంతోను ఎర్ర బడిపోయింది. అంత ఎగిరిపడవలసిన విషయం యేమిటో ఆమెకు అర్థం కాలేదు.

అతను కోపంగా డ్రెస్ చేసుకుని విసురుగా వెళ్ళి పోయాడు.

ఫాతిమా వారించలేదు.

'రేపు వాడే వస్తాడు రక్కులా' అనుకుంది.

మర్నాడు యూసఫ్ అక్కడికి వచ్చాడు.

ఫాతిమా విచారంగా వుంది. ఆమె ముఖం చూసే కని పెట్టాడు వ్యవహారం చెడిపోయిందని.

అతను అన్నమాటలు యథాతథంగా తమ్ముడికి చెప్పింది ఫాతిమా.

'అంటే తను బాగుపడడం వాడికి ఇష్టంలేదు. జీవి తాంతం పనీ, పాటా చేసుకుని వాడి కాళ్ళ దగ్గర పడుండాలి.'

అవతారకృష్ణ అంతరంగం యూసఫ్‌కి తెలిసిపోయింది. ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. అవతారకృష్ణ అక్క చెప్పినట్లు వింటాడని, తనను కంట్రాక్టర్ చేస్తాడనీ కలలు కన్నాడు.

అన్నీ గాలిలో కొట్టుకుపోయాయి ఒక్క దెబ్బతో.

యూసఫ్‌కి పిచ్చెక్కిపోయింది.

సరాసరి బ్రాందీ షాపుకి వెళ్ళి ఒంటరిగా కూర్చుని తాగడం మొదలుపెట్టాడు. బాగా తలకెక్కింది నిషా. తూలుకుంటూ రోడ్డుమీదకు వచ్చాడు. కాళ్ళు తడబడు తున్నాయి. ఒక్కొక్క అడుగే వేసుకుంటూ నడుస్తు న్నాడు.

అది మార్కెట్ ఏరియా. కిరాణా, ఫ్యాన్సీ స్టోర్సు, హోటల్స్, కూరగాయలు, పళ్ళకొట్లు అన్నీ అక్కడే వున్నాయి. జనం యెక్కువగా తిరుగుతుంటారు.

యూసఫ్‌కి తెలిసినవారెవరో పలకరించాడు ఎందు కురా అంతగా తాగావని.

అంతే!

అంతసేపూ అతని అంతరంగంలో బుసలు కొడుతున్న వుక్రోషం ఒక్కసారిగా బైటకు తన్నింది. వరదలో నదిలా వుప్పొంగింది. వినేవాడు దొరకగానే వాక్ప్రవాహం మొదలైంది.

అవతార కృష్ణని బూతులు తిట్టసాగాడు. యూసఫ్ అక్కని అతను వుంచుకున్న సంగతి జయపూర్ కాలనీలలో అందరికీ బహిరంగ రహస్యమే. అందుకే దానికి ఎవరూ ప్రాధాన్యత యివ్వలేదు, పట్టించుకో లేదు. ఇద్దరికీ ఏదో చెడివుంటుంది. అందుకే ఏదో వాగుతున్నాడని వూరుకున్నారు.

అయితే అదే సమయంలో అవతార కృష్ణ, భార్య, కూతురుతో షాపింగ్ కి వచ్చాడు. కూతురు పుట్టినరోజుకి బట్టలు కొనాలని జయ షోరూమ్ ముందు కారు ఆపాడు. అతనే స్వయంగా కారు నడుపుకుంటూ వచ్చాడు. డ్రైవరు లేడు. కారు దిగి డోర్ మూసి ప్రక్కకు తిరిగే సరికి దర్శన మిచ్చాడు యూసఫ్.

యూసఫ్ కళ్ళలో పడ్డాడు అవతారకృష్ణ. అసలే కోతి కల్లు తాగింది, పైగా తేలు కుట్టింది అన్నట్లుగా తయారయ్యాడు యూసఫ్.

బజార్లో పట్టుకుని బండ బూతులు తిట్టాడు. టౌన్ లో ప్రముఖ కంట్రాక్టర్ని ఒక అనామకుడు నిలవేసి బూతులు తిట్టడం అందరికీ వింతగా వుంది, థ్రిల్లింగ్ గా కూడా వుంది. ఎక్కడి వాళ్ళక్కడ నిలబడి చోద్యం చూస్తున్నారు.

అవతార కృష్ణ, భార్య, కూతురు వాడి బూతుల పంచాంగం వినలేక చెవులు మూసుకుని షాపులోపలికి వెళ్ళిపోయారు.

అతను నిర్ఘాంతపోయి చూస్తూ వుండగా యూసఫ్ రెచ్చిపోతూ ముందు, ముందుకి వస్తున్నాడు. కక్కాలేక మింగాలేక నిలబడిపోయాడు అవతార కృష్ణ. వీడు ఇంతగా తెగిస్తాడని కలలో గూడా వూహించలేదు.

వాడి తిట్లు ఇక సహించలేకపోయాడు. కొంచెం దగ్గరికి రానిచ్చి చొక్కా పట్టుకుని చెప్పుతీసి ఎడా, పెడా వాయించాడు. యూసఫ్ చొక్కా పర్రున చిరిగి నేలమీద పడిపోయాడు. పడినవాడిని లేవకుండా కాళ్ళతో ఇష్టం వచ్చినట్లు తన్నాడు. యూసఫ్ లేవ లేకపోయాడు.

"చంపుతా! పొడుస్తా! పేగులు తీస్తా!" అని అరవడం తప్ప ప్రతిఘటించలేకపోయాడు.

సాయంకాలానికి టౌన్లో అందరూ ఈ విషయమే చర్చించుకుంటూ కాలక్షేపం చేశారు.

కిరణ్ హుషారుగా వచ్చాడు.

"విజయా! మన మొదటి ప్లాన్ సక్సెస్." అన్నాడు.

"యూసఫ్ విషయమేనా?" అడిగింది విజయ.

"యస్" అన్నాడు.

"ఏం జరిగింది?"

"మనం అనుకున్నట్లే జరిగింది. యూసఫ్ తాగి అవతార కృష్ణని తిట్టాడు. ఆయనగారు చెప్పు తీసుకుని వాయించాడు. వీడు చంపుతా, పొడుస్తా అని కేకలు పెట్టాడు. ఇదంతా మార్కెట్లో జరిగింది. వందల మంది జనం నోరెళ్ళబెట్టుకుని చూశారు" అన్నాడు కిరణ్.

విజయ మనసు తేలికైంది.

"వాటీజ్ నెక్స్ట్ ఐటమ్?" నవ్వుతూ అడిగింది.

"ఒక వారం ఆగు. అవతార కృష్ణ పాఠ్ తింటాడు" అన్నాడు కిరణ్.

# 18

క్లబ్‌లో పేకాడుతున్నాడు అవతార కృష్ణ.

బాయ్ వచ్చి "సార్! మీకు ఫోన్ వచ్చింది" అన్నాడు.

అతను టెలిఫోన్ వున్న ఆఫీస్ రూమ్‌లోకి వెళ్ళాడు. రిసీవర్ టేబుల్ మీద పెట్టివుంది కుర్చీలో కూర్చుని రిసీవర్ అందించాడు.

"హల్లో...." అన్నాడు అవతార కృష్ణ.

"అవతార కృష్ణగారేనా?"

"ఆఁ.... నేనే మాట్లాడుతున్నా! ఎవరు మీరు?"

"నేను ఎ. రామన్నని. మీ ఫ్రెండ్‌ని."

"ఎ. రామన్నా?" అవతార కృష్ణకి జ్ఞాపకం రావడం లేదు. ఎవడో వీడు? అని విసుక్కున్నాడు.

"జ్ఞాపకం రావడం లేదా?"

"వుహూఁ...."

"సర్లే తర్వాత నెమ్మదిగా జ్ఞాపకం చేసుకుందువు గాని, ముఖ్యమైన విషయం ఒకటి చెప్పాలని ఫోన్ చేశాను."

"ఏ విషయం?"

"వస్తున్నా! మీ అమ్మాయి సుభాషిణి విషయం?"

"మా అమ్మాయి విషయమా?"

"యస్. మీ అమ్మాయి ఇంటర్ చదువుతోంది కదూ?"

"అవును. ఏం?"

"ఏంలేదు. నువ్వేమో మీ అమ్మాయి ఇంటర్ ఫస్టు క్లాస్‌లో ప్యాసై మెడిసన్ చదవాలని అనుకుంటున్నావు. కాని ఆ అమ్మాయి ఇంటర్ థర్డు క్లాసులో గూడా ప్యాసై గట్టెక్కేలాలేదు."

"ఏం?"

"ఏవుంది? చదువు చట్టుబండలు చేసి రాకేష్ అనే వాడితో ప్రేమాయణం నడుపుతోంది. సినిమాలు, షికార్లు.... నీ కింకా తెలియదేమో?"

"రాకేష్ ఎవడు?"

"హెల్తు ఆఫీసరు దక్షిణామూర్తి తమ్ముడు."

అవతారకృష్ణ పళ్ళు పట.... పట కొరికాడు.

'ఇంకొక విషయం. రాకేష్ మీ కులంవాడు కాదు. హరిజన్."

అతని నోరు ఎండిపోయింది ఎ. రామన్న చెప్పేది వింటూ వుంటే.

"కాబట్టి జాగ్రత్తపడు. నా పేరు ఇంకా గుర్తు రాలేదా?"

"వుహూఁ రాలేదు. నాకు ఫ్రెండ్‌ని అంటున్నావ్? ఏ వూళ్ళో? ఈ వూరేనా?"

"అన్ని వూళ్ళు నావే. నా పూర్తి పేరు అకాశ రామన్న."

ఫోన్ క్లిక్‌మంది.

అతను రిసీవరు విసిరికొట్టాడు.

గుండె మండిపోతోంది. తన కూతురు ఆఫ్ట్రాల్ ఒక హరిజన కుర్రాడితో తిరగడమా? ఛీ.... తన ప్రెస్టేజ్ యేమైపోతుంది? అనుకున్నాడు.

పేకాటమీద మనసు నిలవలేదు.

కారెక్కి డ్రైవరుతో ఇంటికి పోనివ్వమన్నాడు.

అతను అంత త్వరగా ఇల్లు చేరడం చాలా అరుదు. అతని భార్య ఆశ్చర్యపోయింది. ధుమధుమలాడుతున్న అతని ముఖం చూసి యేదో కొంప మునిగింది అనుకున్నది.

"అమ్మాయి ఎక్కడ?" ప్రశ్నించాడు ఇంట్లోకి వస్తూనే.

"ఇంకా రాలేదు."

"ఎనిమిది కావొస్తుంటే ఇంకా రాకపోవడం యేమిటి?"

"రోజూ తొమ్మిదింటికిగదా వచ్చేది" అంది భార్య.

"ఏం?"

"ట్యూషన్‌కి వెళ్ళివస్తుందిగదా!"

"వూఁ...." అని తల వూపాడు.

"ఏం? ఎందుకు అడుగుతున్నారు?" అందామె గాబరాగా.

"చెప్తాను దాన్ని రానీ!" అని హాల్లోనే పెద్ద పులిలా అటూ ఇటూ పచార్లుచేశాడు. బుర్రగోక్కున్నాడు. వాచీ చూశాడు. తొమ్మిది కావాలంటే ఇంకా గంట పైముంది. అప్పటి వరకూ తను పచార్లుచేస్తూ వుండాల్సిందేనా? అనుకున్నాడు.

"ఎక్కడ అది ట్యూషన్‌కి వెళ్లేది?"

"రామశాస్త్రి మాష్టారింట్లో!"

"డ్రైవరుకి తెలుసా? ఆ పంతులు ఇల్లు?"

"వూఁ...." అంది ఆమె.

కారెక్కి రామశాస్త్రి ఇంటికి పోనివ్వమన్నాడు. అదృష్టవశాత్తు అక్కడే వుంది సుభాషిణి.

అతని మనసుకొంత తేలికయింది.

ఆకాశరామన్న గాడు చెప్పింది గాలి కబుర్లేమో అని గూడా అనుమానించాడు.

"ఏం లేదు మాస్టారూ! ఇటు కొంచెం పనుండివచ్చాను. అమ్మాయికి ట్యూషన్ చెప్పడం అయిపోయిందేమో చూద్దామని వచ్చాను" అన్నాడు అవతారకృష్ణ.

"ఫరవాలేదు తీసుకెళ్ళండి అమ్మాయిని. ఎటూ వచ్చారుగా! చెప్పడం అయిపోయింది" అన్నాడు రామశాస్త్రి.

సుభాషిణికి యేమీ అర్థంకాలేదు. తన గురించి యేనాడూ పట్టించుకోని తండ్రి ట్యూషన్ మాస్టారింటికి రావడం యేమిటి? ఆయనకి ఏం అనుమానం వచ్చింది?

ఆమె మనసులో రాకేష్ మెదిలాడు.

'కొంపదీసి అతని సంగతి యేమైనా తెలిసిందా?'

'నాన్సెన్స్!" అనుకుంది విసుగ్గా.

"అమ్మాయ్ రాకేష్ ఎవడు?"

పిడుగులు పడ్డట్టుగా అడిగాడు అవతారకృష్ణ.

"రాకేషా? ఎందుకు?" తడబడుతూ అన్నది సుభాషిణి.

"రాకేష్ ఎవడండీ!" అంది అతని భార్య ఆయోమయంగా.

"నువ్వు నోర్ముయ్!" అని భార్యమీద విరుచుకు పడ్డాడు.

ఆమె ముఖం మాడ్చుకుంది.

సుభాషిణి గుండె దడదడలాడింది. ఆమె మనసు మొద్దుబారిపోయింది భయంతో. తను రాకేష్‌ని లౌ చేస్తున్న సంగతి తండ్రికెలా తెలిసిందనే సంగతి చచ్చినా అర్థంకాలేదు.

"రాజేష్ ఎవడో నాకు తెలియదు డాడీ!" అంది సుభాషిణి.

అవతారకృష్ణ నివ్వెరపోయాడు.

"సరిగ్గా చెప్పు. వాడితో నువ్వు సినిమాలకి, షికార్లకి తిరుగుతున్నావని తెల్సింది" దబాయించాడు.

"నాన్సెన్స్! ఎవడు నీకు చెప్పింది? వాడిని చెప్పు తీసుకుని పళ్ళు రాలగొడతాను."

"ఏమీ లేకుండా ఈ పుకారు పుడుతుందా? నిప్పు లేనిదే పొగ రాదన్నారు పెద్దలు."

"ఎవడో కుర్రాడు నా వెంట తిరుగుతున్నాడు డాడీ! వాడి పేరు నాకు తెలీదు. అది చూసి ఎవరైనా నీకు చెప్పారేమో?"

"నీ వెంట పడుతున్నాడా? ఎవడు వాడు? ఎంత ధైర్యం వాడికి. ఈసారి రోడ్డుమీద పట్టుకుని చెప్పుతో కొట్టు వాడిని. ఆ తర్వాత నేను చూసుకుంటాను వాడి సంగతి. ఏమనుకుంటున్నాడో!"

అవతారకృష్ణ హృదయం గాలిలో తేలిపోయింది. అదంతా వట్టి పుకారే అన్నమాట.

'హమ్మయ్య' అనుకున్నాడు.

ఎందుకైనా మంచిది వాడికి తను వార్నింగ్ ఇవ్వడం మంచిదని అనుకున్నాడు.

సోఫాలో కూర్చుని హెల్తు ఆఫీసరుకి ఫోన్ చేశాడు.

దక్షిణామూర్తి సమయానికి ఇంట్లోనే వున్నాడు.

"నమస్తే! కృష్ణగారూ!" అన్నాడు.

"నమస్తే! మీకు వార్నింగ్ ఇవ్వాలని ఫోన్ చేశాను" అవతారకృష్ణ కంఠం కఠినంగా పలికింది.

దక్షిణామూర్తి వులిక్కిపడ్డాడు.

"వాట్డూయూ మీన్?" సీరియస్ గా అన్నాడు.

"మీ తమ్ముడి పేరు రాకేష్. అవునా?"

"యస్."

"వాడు మా అమ్మాయిని అల్లరిపెడుతున్నాడట. బీకేర్ ఫుల్. ఇంకొకసారి కంప్లెయింట్ వస్తే సీరియస్ గా తీసుకుంటాను. మీ వాడికి భయం చెప్పండి. పెద్దవారు మీరు గార్డియన్ గా వున్నారుకదా అని వార్నింగ్ ఇస్తున్నాను."

సమాధానం ఆశించకుండా అతను ఫోన్ క్రెడిల్ చేశాడు.

దశరథరామూర్తికి తిక్కరేగింది అవతారకృష్ణ మాట్లాడిన పద్ధతికి. ఎంత పెద్ద కంట్రాక్టరు అయితే మాత్రం ఇంత బెదిరిస్తాడా? ఏమిటాయన వుద్దేశ్యం? అనుకున్నాడు.

ఇంతలో రాకేష్ కన్పించాడు బుక్స్ చేత్తో పట్టుకుని.

"రాకేష్!"

"ఏం అన్నయ్యా!"

"ఎక్కడ్నుంచి వస్తున్నావు?"

"ట్యూషన్ నుంచి."

"అవతారకృష్ణ కూతుర్ని అల్లరి పెడుతున్నావంటగా?"

రాకేష్ తెల్లముఖం వేశాడు.

"అతను ఇప్పుడు ఫోన్ చేసి బెదిరించాడు. ఈసారి అల్లరిచేస్తే కాళ్ళిరగదీస్తానన్నాడు. నేనిక్కడ పరువుగా బతుకుతున్నవాడిని. నీమూలంగా అల్లరిపాలు కావలసి వస్తోంది. ఛీ..." అన్నాడు ఛీత్కారం చేస్తూ.

"లేదన్నయ్యా! నేను ఎవర్నీ అల్లరిచెయ్యడంలేదు"

తమ్ముడిగా చెప్పాడు రాకేష్.

"వాట్?"

"అవునన్నయ్యా! ప్రామిస్."

"మరి అతను చాలా సీరియస్‌గా చెప్పారే! వాటీజ్ ద రాంగ్?'

రాకేష్‌కు ఏం చెప్పాలో తోచలేదు.

"వాళ్ళమ్మాయి నీకు తెలుసా?"

"ఊఁ...."

"ఏం పేరు?"

"శుభాషిణి."

"గుర్తు తెచ్చుకో! ఎప్పుడన్నా గోలచేశావేమో?"

"ఉహూఁ...."

"మరి వాళ్ళ నాన్న నీమీద యెందుకు మండిపడుతున్నాడు. నిజం చెప్పు?" దక్షిణామూర్తి కేకలు పెట్టాడు.

"మేం ఇద్దరం లా చేసుకుంటున్నాం" చెప్పాడు రాకేష్.

"యూ రాస్కెల్ లా చేస్తున్నావా? మూడు పార్టులు పూర్తిచెయ్యడానికి మూడేళ్ళు పట్టింది. డిగ్రీ పూర్తిచెయ్యడం చేతగానివాడికి 'లా' కావాల్సొచ్చిందా! యూ స్కౌండ్రల్! కళ్ళు దగ్గరుంచుకుని చదువు. వాళ్ళు బలిసినవాళ్ళు వాళ్ళతో పెట్టుకుంటే మర్డర్ చేయిస్తారు. నీకింకా తెలీదు."

దక్షిణామూర్తి తమ్ముడికి వార్నింగ్ ఇచ్చాడు.

రాకేష్ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. ఆ రాత్రి అతను చాలాసేపు నిద్రపోలేదు. ఏం జరిగి వుంటుందో అర్థం కాలేదు. గత ఆర్నెల్లనుంచి ఇద్దరూ క్లిక్‌గా కలిసి తిరుగుతున్నారు. ఎప్పుడూ యే గొడవా రాలేదు. సడన్‌గా

ఈ వార్నింగ్ యేమిటి?

మర్నాడు రాకేష్ అసహనంగా వున్నాడు.

సాయంకాలం కాలేజి లాస్టుబెల్ కొట్టేవరకూ వెయిట్ చేశాడు.

సుభాషిణి ముభావంగా వుంది.

అతన్ని చూసీచూడనట్లు వెళ్ళిపోతుంటే వెంట వెళ్ళాడు.

"సుభా....!"

ఆమె ఆగింది.

"ఏం జరిగింది?"

"ఏమో? మా నాన్నకి ఎవరో మన గురించి చెప్పారు రాకేష్!"

"ఎవరు?"

"కాసేపు మాట్లాడుకుందాం పార్కులోకి పద."

"వద్దు రాకేష్. ఎవరైనా చూస్తారు" భయంగా అంది సుభాషిణి.

రాకేష్ బ్రతిమాలిన తర్వాత అయిష్టంగానే వెళ్ళింది.

"రాకేష్! మా నాన్నకి తెలియకపోతే బాగుండేది. ఎవరు చెప్పారో యేమో? తెలిసిపోయింది. ఇక మనం కలుసుకోకుండా వుంటేనే మంచిది" అంది సుభాషిణి.

"సుభా!........నువ్వేనా ఇట్లా మాట్లాడుతున్నది?" రాకేష్ గుండె విలవిల్లాడింది.

"అవును రాకేష్! ఏం చేస్తాం? రోజులన్నీ మనవి కావుగదా!"

"అయితే మాత్రం?"

"ఈసారి మా నాన్న కంటపడితే చంపేస్తాడు."

"మీ నాన్నకి చెప్పలేదా మనం ప్రేమించుకున్న

సంగతి?"

"అమ్మో! ఇంకేమైనా వుందా?"

"అయితే ఇన్నాళ్ళూ మనం ప్రేమించుకోలేదా? సుభా! మాట్లాడవేం?"

సుభాషిణి గడ్డిపరకలు తుంపుతూ ఎటో చూస్తోంది.

"అయితే నేను నిన్ను అల్లరిపెడుతున్నానని మీ నాన్నతో చెప్పావన్న మాట" అన్నాడు రాకేష్ కోపంగా.

"మరేం చెప్పమంటావ్?" సుభాషిణి గూడా కోపంతో అంది.

"నువ్వు చీట్ వి........!" అని రాకేష్ ఆమె చెంప మీద లాగి కొట్టాడు.

ఆమె దిగ్భ్రాంతి పడింది.

కళ్ళు తిరిగినట్లయింది.

ఇంతలో నలుగురు కుర్రాళ్ళు వాళ్ళ చుట్టూ నిల్చున్నారు వలయాకారంలో.

రాకేష్ వాళ్ళనెప్పుడూ చూళ్ళేదు.

అందులో ఒకడు రాకేష్ని చొక్కా పట్టుకుని పైకి లేపాడు.

"ఏరా! ఎంత పొగర్రా నీకు? ఆ అమ్మాయి ఏమైనా రనుకుంటున్నావ్? చెంపమీద కొడతావా?" అని మూతి మీద ఒక్కటి ఇచ్చుకున్నాడు.

రాకేష్ మూతిపగిలి నెత్తురు కారింది.

"ఓనరుగారమ్మాయిని కొట్టే మొనగాడివిరా రాస్కెల్!"

"నిన్నిప్పుడే చంపి పాతిపెడతాం."

రాకేష్‌ని ఆ నలుగురూ కలిసి చితక్కొట్టారు. అతన్ని కొడుతుంటే సుభాషిణి యేం మాట్లాడలేక చూస్తుండి పోయింది. వాళ్ళెవరో? తన తరపున అతన్ని యెందుకు కొడుతున్నారో అర్థంకాలేదు. పార్కులోని జనం అక్కడికి చేరుకున్నారు.

అవతారకృష్ణగారి అమ్మాయి రాకేష్‌తో తిరుగుతున్నదని చాలామందికి తెలుసు. అది వికటించి రాకేష్‌కి దేహశుద్ధి జరిగిందని అనుకున్నారు.

జనం తలా ఒక రకంగా చెప్పుకుంటుంటే సుభాషిణి అక్కడ్నుంచి జారుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

రాకేష్‌ని గుర్తుపట్టి యెవరో హెల్తు ఆఫీసరుకి ఫోన్ చేశారు. దక్షిణామూర్తికి కబురు అంది జీప్‌లో వచ్చేసరికి తమ్ముడు పార్కులాన్‌లో పడివున్నాడు ముక్కుతూ మూలుగుతూ.

అతనికి కోపం వచ్చింది తమ్ముడ్ని ఆ స్థితిలో చూసేసరికి. వెంటనే డియస్పీకి ఫోన్ చేసి చెప్పాడు.

కొంచెం సేపట్లో సి.ఐ., యస్.ఐ., కొందరు కాన్‌స్టేబుల్స్ అక్కడికి చేరుకున్నారు.

దక్షిణామూర్తి రిటెన్ కంప్లెయింట్ యిచ్చాడు.

సి.ఐ. అవతారకృష్ణకోసం వాన్‌లో తిరిగాడు. ఇంట్లో లేడు. వర్క్ స్పాట్‌లో కనిపించాడు.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ తనకోసం యెందుకొచ్చాడో అతనికి అర్థంకాలేదు.

రాకేష్ అని హెల్తు ఆఫీసర్ తమ్ముడిని మీ మనుషులు కొట్టారనీ, ఆయన కంప్లెయింట్ ఇచ్చాడని చెప్తే ఆశ్చర్యపోయాడు.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 60/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా గ్యారంటీగా అందుతాయి. ఇంకా రెండేసి నెలల కొకసారి V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

# 19

"మన రెండో ప్లాన్ కూడా సక్సెస్" గర్వంగా అన్నాడు కిరణ్.

విజయ సంతోషించింది.

"ఎలా జరిగింది?" అడిగింది.

"నిన్న ఫోన్ చేశాక అవతారకృష్ణ కూతురికి వార్నింగ్ ఇచ్చి వుంటాడు. ఆ అమ్మాయి రాకేష్‌ని ఇక కలుసుకో వద్దని చెప్పివుంటుంది. వాడికి కోపంవచ్చి లాగికొట్టాడు పబ్లిక్ పార్కులో. అదే సమయంలో నేను మాట్లాడిన కుర్రాళ్ళు వెళ్ళి వాడిని చితకొట్టారు. తమ్ముడిని తన్నినందుకు హెల్తు ఆఫీసరుకి కోపం వచ్చింది. పోలీస్ కంప్లయింట్ ఇచ్చాడు. తను ఆ కుర్రాడిని కొట్టించ లేదని మొత్తుకుంటున్నాడు అవతారకృష్ణ" చెప్పాడు కిరణ్.

"ఇప్పుడేం జరుగుతుంది?"

"ఏం జరగదు. అవతారకృష్ణ బడా కంట్రాక్టరు. హెల్తు ఆఫీసరు అతన్నేమీ చెయ్యలేడు. డియస్పీ యిద్దరికీ రాజీ చెయ్యక తప్పదు. చేస్తాడుగూడా! గట్టిగా పట్టుబడతానంటే తెల్లవారికే ట్రాన్స్‌ఫర్ ఆర్డర్సు తెప్పిస్తారు" అన్నాడు కిరణ్.

"అవతారకృష్ణని ఇప్పుడు మర్డర్ చేస్తే పోలీసులు ఇద్దర్ని అనుమానిస్తారు. ఒకడు యూసఫ్, రెండోవాడు రాకేష్" విజయ తృప్తిగా అంది.

"ఇద్దరు చాలరు. ఇంకా ఇద్దరుంటే పోలీసులు తికమక పడిపోతారు.

"ఇంకా ఇద్దరు కావాలంటావా?"

"కావాలి మరి. అంతా ప్రిపేర్ చేస్తున్నాను. వాడి

మెడకి వుచ్చు బిగిస్తున్నాను. వాడి చావు దగ్గరికి వచ్చింది" అన్నాడు కిరణ్.

మళ్ళీ వారానికి కిరణ్ ప్రమేయం లేకుండానే ముఖ్యమైన సంఘటన జరిగింది.

వర్షాలు తీవ్రంగా కురుస్తున్నాయి.

మహా నదికి వరదలు ముంచుకొచ్చాయి.

నిర్మాణంలో వున్న డామ్ పని పూర్తిగా ఆగిపోయింది. రోజూ వర్షమే. నదికి ఎగువన కురిసిన వానల వల్ల ఫ్లడ్ బాగా వచ్చింది.

ఎత్తు తక్కువగా వున్న బ్లాకుల పైనుంచి వుధృతంగా వురుకుతోంది వరద.

ఒకరోజు అర్థరాత్రి ఫెళ.... ఫెళమని భయంకరమైన శబ్దం చేస్తూ డామ్ దిగువనున్న బ్రిడ్జి సగానికి పైగా కొట్టుకుపోయింది.

జయపూర్ దక్షిణానికి, ఉత్తరానికి సంబంధాలు తెగిపోయాయి. పవర్ సప్లయ్ దక్షిణంనుంచి ఉత్తరానికి వస్తుంది. మాచ్ ఖండ్ నుంచి వచ్చే విద్యుత్ దక్షిణంలో ఆగిపోయింది. బ్రిడ్జిపై నుంచి వున్న టెలిఫోన్ లైన్సు విచ్ఛిన్నమైపోయాయి.

తెల్లవారకముందే టౌన్ గగ్గోలెత్తింది. ఎవరినోట విన్నా బ్రిడ్జి పడిపోయిన సంగతే చెప్పుకున్నారు. పనులన్నీ స్తంభించిపోయాయి. ఆడ, మగ, పిల్ల, మేకా అంతా నది ఒడ్డుకు చేరుకున్నారు. అటూ ఇటూ వేలాది జనం ఆశ్చర్యంగా చూస్తున్నారు కూలిపోయి సగం కొట్టుకుపోయిన బ్రిడ్జిని.

ముఖ్యమంత్రి గెస్టుహౌస్‌లో బసచేసి సమావేశం యేర్పాటు చేశాడు. ఇరిగేషన్ మంత్రి, ఛీఫ్ ఇంజనీర్,

సూపరింటెండింగ్ ఇంజనీర్లు హాజరయ్యారు.

"బ్రిడ్జి కట్టి ఆరు సంవత్సరాలైంది. కోటిరూపాయలు ఖర్చుపెట్టారు. ఇప్పుడది కూలిపోయింది? బాధ్యత యెవరిది?" అని ప్రశ్నించాడు ముఖ్యమంత్రి.

ఎవరూ మాట్లాడలేదు. అందరి ముఖాలు మాడిపోయి వున్నాయి. ఇరిగేషన్ మంత్రి చీఫ్ ఇంజనీర్ మీద మండి పడ్డాడు. దీనికి బాధ్యులు యెవరో తేల్చమని ఆదేశించాడు.

ఆఫీసులనుంచి ఫైల్సు జీపులమీద కట్టలు, కట్టలుగా మోసుకొచ్చారు.

ఆరేళ్ళ క్రితం మెసర్ మెంట్ బుక్స్, ఫైల్స్, దుమ్ము దులిపారు. బ్రిడ్జి నిర్మాణంలో పాత్రవహించిన వారి పేర్ల లిస్టు తయారుచేశారు. ఒక సూపరింటెండింగ్ ఇంజనీర్, ఒక ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, నలుగురు అసిస్టెంట్ ఇంజనీర్లు, పదహారుమంది జూనియర్ ఇంజనీర్లు అందులో వున్నారు.

వీళ్ళందరిమీద తీవ్రమైన చర్య తీసుకుంటామనీ, బ్రిడ్జి కూలిపోవడానికి కారణం యేమైవుంటుందనే విషయం మీద ఒక రిటైర్డు చీఫ్ ఇంజనీరుతో దర్యాప్తు చేయిస్తామనీ ముఖ్యమంత్రి విలేఖరులకు వివరించారు.

ప్రస్తుతానికి బ్రిడ్జి కట్టిన కంట్రాక్టరుని బ్లాక్ లిస్టులో వుంచుతున్నామని ప్రకటించారు.

ఆ కంట్రాక్టరు పేరు చిరంజీవిరావు.

అతను ప్రస్తుతం పనిచేస్తున్న కంట్రాక్టులు గవర్నమెంట్ రద్దుచేసింది. అతనికి ఇవ్వవలసిన బిల్స్ పెండింగ్ లో పెట్టమని యెక్కౌంట్స్ ఆఫీసరుకి ఆదేశాలు జారీచేశారు.

చిరంజీవిరావు షాక్ తిన్నాడు. (ఇంకా వుంది)

